# శ్రీరామ పట్టాభిషేకము

శ్రీమద్గోస్వామి తులసీదాసకృత

శ్రీరామచరితమానసము

(ఉత్తరకాండము



అనువాదకుడు :

డ రామనారాయణ శరణ్

పరిష్కర్తలు :

స్. యస్. నారాయణ, M. A. Ph. D.

కేపల్లి లక్ష్మీనారాయణ M. A. Ph. D.



శ్రీరామ జయరామ జయజయరామ

# ఆశీస్సులు

మహామండలేశ్వర్, భాగవతచరితవ్యాస్

శ్రీ శ్రీరామశరణ్

## శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య పాకయాజి

శ్రీ గోస్వామి తులసీదాసుగారు కేవలము శ్రీ వాల్మీకిమహర్షి యొక్క

అవతారము

శ్లో॥ వాల్మీకి స్తులసీదాసః కలౌదేవీ భవిష్యతి
రామచంద్ర కథాందివ్యాం భాషారూపాం కరిష్యతి ॥
(భరద్వాజ సంహిత)

"శ్రీవాల్మీకి తులసీదాసై ఈకలియుగములో నవతరించి దివ్యమగు శ్రీ రామచంద్రుని కథను ప్రాకృతభాషలో రచింప గలడు.

అని చెప్పబడినది. వీరు మహాతపస్వులరై భగవదాదేశ మున రామాయణమును రచించిరి. ఈ రామాయణమును పఠించిన వేరొక గ్రంథమును జదువవలసిన పనిలేదని చెప్ప నచ్చును. కథతోపాటుగా మధ్య మధ్య తత్వ విషయములు వచ్చుచుండును. శ్రీమద్రామాయణములోవచ్చు సందేహము లన్నియు దీరుచుండును. ఇందు క్రొత్తక్రొత్త కథా విశేషణ ములు గలవు దీనినిగూర్చి అపరశంకరు లనదగిన శ్రీ మధు సూధన సరస్వతీ స్వాములవారు ఇట్లు అభిప్రాయ మొసంగిరి.

శ్లో॥ ఆనంద కాననేహ్యస్మిన్ తులసీ జంగమ స్తరుః
కవితామంజరీ భాతి భ్రమర శోభితాః ॥

# అనువాదకుని విజ్ఞప్తి

కాలప్రభావముచే మరుగునపడియున్న తన భక్తి యోగమును లోకములో తిరిగి వెల్లడిచేయుటకు ఆ శ్రీరామ చంద్రుడే మాగురువర్యులయిన శ్రీ శ్రీరామశరణుల రూప మున అవతరించెనని నా దృఢమగు విశ్వాసము. ఇట్టి మహా త్ములు గురువులుగా లభించుట నా పూర్వజన్మ విశేషమే.

శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం - స్పర్శనం పాపనాశనమ్
సంభాషణం కోటితీర్థం - సేవనంముక్తి దాయకమ్

అను ఆర్యోక్తి ననుసరించి శ్రీ శ్రీరామశరణు సద్గురువుల దర్శన స్పర్శన సంభాషణ సేవనాదుల ద్వారా నాజన్మ తరించినది.

నేను పామరుడను. అజ్ఞానిని. సత్సాంగత్య మెట్టిదో తెలియనివాడను. అట్టినన్ను శ్రీరామశరణులు దగ్గరకు చేర్చు కొని తమ కంతేవాసులుగ జేసికొని "హనుమత్సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న" 'గురు' మంత్రముల నుపదేశించి నన్ను అనుగ్రహించిరి శ్రీచరణ సేవ మహిమవలన తన్మంత్ర ప్రభావము వలన ఆ పరాత్పరుని చరణములయందు నాకు అనన్యమగు ప్రీతి జనించినది. నిరంతరము శ్రీవారిని సేవిం చుచు వారు బోధించు శ్రీతులసీ రామాయణ కథను శ్రవ ణము చేసితిని.

శ్రీ తులసీదాసుగారు "స్వాంతః సుఖాయ తులసీ రఘునాథ గాథా"యని చెప్పెను. నాకు పాండిత్యము లేక పోయినను ఈ గ్రంథమునందు నాకు గలిగించిన భక్తి భావనలే ఈ అనువాదమునకు ప్రేరణ గలిగించినవి. నేనీగ్రంథము వ్రాయుటకు పూర్వము అయోధ్య మొదలు చిత్రకూటము (భరతకూప్) వరకు శ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారితో, రెండువేలమంది సాధువుల ఋషి పుంగవులతో భరత యాత్రగా పాదయాత్రను జరిపి, అవధభాషను నేర్చుకొని, మాపూజ్యగురుదేవులగు శ్రీరామ శరణులవారి వద్దకు జేరితిని. నేను వారి సేవయందున్న సమయమున తులసీరామాయణమును తెనుగునకు అనువదింపుమని ఆదేశించిరి. నాకు భాష రాకపోయినను శ్రీవారి యాజ్ఞ గొప్పది గనుక మోయలేని భారమునుగూడ శిరోధార్యముగ భావించి, అరణ్య,కిష్కింధ, సుందర, పార్వతీ కళ్యాణమును, నామవందనము,-సీతారామ కళ్యాణమును, శ్రీరామ పట్టాభిషేకమును తెనుగున కనువదించితిని. నేను పండితుడను గాకపోవుటచే అర్థదోషములు, భాషాదోషములు, నుండవచ్చును. చదివి తప్పులు జూపు పండితులకు కృతజ్ఞతలు దెల్పుచు, రెండవ ముద్రణయందు సరిదిద్దుకొనగలవాడను.

ఈగ్రంథమును ముద్రించుటకు తగిన కృషిసల్పిన శ్రీ గూడాని కోటేశ్వరరావు, శ్రీ యం. వి. నరసింహారావు,

శ్రీ మారావఝల కృష్ణమూర్తి, శ్రీ వజీరుద్దీన్ గార్లకు, పరిష్కరించి, తగు సలహాల నొసంగిన డాక్టరు శివసత్య నారాయణ, డాక్టర్ తెలికేపల్లి లక్ష్మీనారాయణగార్లకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు తెలుపుకొను చున్నాను.

ఈ గ్రంథమును త్వరితగతిని అతిశ్రద్ధతో ముద్రించి యిచ్చిన శ్రీ వెల్‌కం ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్ వారికి మా అభినందనలు.

ఇట్లు
శ్రీరామశరణు పాదరేణువు

**బెజవాడ రామనారాయణశరణ్**

**1—4—82**

## గణేశ ప్రార్థన

శుక్లాంబరందరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ :
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే ॥

## ఇష్ట దేవతా ప్రార్థన

మనోజవం మారుతతుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి

## సద్గురు ధ్యాన శ్లోకములు

శ్లో॥ శ్రీమత్కుందుర్తి వంశాంబు నిధిరాకా సుధాకరమ్
బహు భాషాసు నిష్ణాతం శ్రీరామ శరణం భజే ॥

శ్లో॥ రామాది మంత్రజపారం నామ సంకీర్తనే రతమ్
ఆధ్యాత్మ విద్యాసంపన్నం శ్రీరామ శరణం భజే ॥

శ్లో॥ ఆధ్యాత్మిక బహుగ్రంథ కర్తారం గురుపుంగవమ్
కవితా పాండితీ ఖూరం శ్రీరామ శరణం భజే ॥

శ్లో॥ రామనామాంకితం వస్త్రం దార్యతే యేన సర్వదా
సద్గురుం పావనాత్మానం శ్రీరామ శరణం భజే ॥

శ్లో॥ జపతండుల పక్వాన్నం భుజ్యతే యేన సంతతమ్
తస్యసార శాస్త్ర్యతీతం శ్రీరామ శరణం భజే॥

శ్లో॥ చిరకాలం నదీతీరే యేనతప్తం మహాతపః
మంత్రసిద్ధిశ్చ లబ్ధా తం శ్రీరామ శరణం భజే॥

శ్లో॥ మంత్రోపదేశ మహామా యదీయః కురుతేఽనిశమ్
బహుశిష్యాన్ కృతార్థాన్ తం శ్రీరామ శరణం భజే॥

శ్లో॥ తులసీదాస రచిత రామాయణ సుధా సదా
ప్రసాద్యతే యేన భక్త్యా శ్రీరామ శరణం భజే॥

శ్లో॥ శ్లోకాష్టక మిదం నిత్యం పఠేద్యో భక్తిసంయుతః
గురోః కృపా పరాసిద్ధిశ్చాప్యేతే తేన సర్వదా॥

మంగళం మహత్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

శ్రీరామచంద్రాయనమః

# శ్రీ రా మ ప ట్టా భి షే క ము

శ్లోకము

కేకీకంఠాభనీలం సురవర విలసద్విప్ర పాదాబ్జ చిహ్నం
శోభాఢ్యం పీతవస్త్రం సరసిజ నయనం సర్వదా సుప్రసన్నం
పాణౌ నారాచ చాపం కపినికరయుతం బంధునా సేవ్యమానం
నౌమీడ్యం జానకీశం రఘువరమనిశం పుష్పకారూఢ రామం॥

తా॥ నెమలి మెడవంటి నీలపురంగు గలవాఁడును, దేవతా శ్రేష్ఠుఁడును, ప్రకాశించుచుండిన భృగుమహర్షి యొక్క పాదారవిందముల గుర్తు కలవాఁడును, మిక్కిలి అందము కలవాఁడును, పచ్చని పట్టు వస్త్రమును ధరించినవాడును, పద్మపత్రములవంటి నేత్రములు గలవాడును, ఎల్లప్పుడును ప్రసన్నుఁడుగ నుండువాడును, చేతులందు ధనుర్బాణములను ధరించువాడును, కోతులమూకతో జుట్టుకొనబడినవాఁడును, తమ్ముఁడగు లక్ష్మణునిచే సేవింపబడువాడును, సీతానాధుడును, రఘువంశ శ్రేష్ఠుడును, పుష్పకము నెక్కినవాడునునగు రామునికి నిరంతరము నమస్కరించు చున్నాను.

కోసలేంద్ర పదకంజమంజులౌ
కోమలావజ మహేశ వందితౌ।
జానకీకర సరోజ లాలితౌ
చింతకస్య మనభృంగ సంజ్ఞినౌ॥ 2

తా॥ కోసలదేశ ప్రభువగు శ్రీరామచంద్రుని సుందరము కోమలము నగు రెండు చరణములు సృష్టికర్తయగు బ్రహ్మయు సంహారకర్తయగు పరమశివుడును ఎల్లవేళల సేవించుచుండురు జానకీదేవికి ప్రియుడును, తన భక్తుల మనోరూపమనెడు భ్రమరములతో స్నేహము చేయువాడను,

కుంద ఇందు దరగౌర సుందరం
అంబికాపతి మభీష్ట సిద్ధిప్రదం।
కారుణీక కలకంజ లోచనం
నౌమి శంకరమనంగ మోచనం ॥ 4

తా॥ మల్లె పుష్పములవలె, చంద్రునివలె, శంఖమువలె సుందరమైన గౌరవర్ణము గలవాడును, జగజ్జననియగు పార్వతీదేవికి భర్తయు, మనో వాంఛితములు నెరవేర్చువాడును, దుఃఖముల నశింపజేయువాడును, సుందర ములగు పద్మములవంటి కన్నులు గలవాడును, మన్మథుని నశింపజేసిన వాడును, శుభములు గలుగజేయునట్టి వాడునునగు శంకర భగవానునకు నమస్కరించుచున్నాను.

దో॥ రహా ఏకదిన అవధికర అతిఆరత పురలోగ
జహఁ తహఁ సోచహిఁ నారి నరకృశ తన రామ బియోగ

తా॥ శ్రీరామచంద్రుడు అరణ్యవాసము గడపి తిరిగి అయోధ్యక వచ్చుటకు ఒక్కరోజు మాత్రమే గడువవలసి యుండెను. అయోధ్య నివా సులు మిక్కిలి సంతోషముతో నుండిరి శ్రీరామచంద్రుని వియోగబాధను గూర్చి స్త్రీ పురుషులు చెప్పుకొనుచుండిరి, శ్రీరామచంద్రుడింకను ఏల రాలేదో అని ఒకరితోనొకరు అనుకొనసాగిరి.

సో॥ సగున హోహిఁ సుందర సకల మన ప్రసన్న సబ కేర ।
ప్రభు ఆగవన జనావ జను నగర రమ్య చహుఁ ఫేర ॥

తా॥ ఇంతలోనే శుభశకునములన్నియు కాసాగెను. ప్రజలెల్ల వాళ్ళు ఆనందముతో ఉప్పొంగి పోవుచుండిరి, అయోధ్యా నగరము

నాలుగువైపుల దివ్యశోభలతో అలంకరించిరి. శ్రీరామచంద్రుడు వచ్చు చున్నాడనుటకు శుభచిహ్నములవలె వీనిని జూచు వారలకుండెను.

దో॥ కౌసల్యాదిమాతు సబమన ఆనంద అనహోఇ ।
ఆయఉ ప్రభు శ్రీ అనుజ జుత కహ న చహాత అబకోఇ ॥

తా॥ శ్రీసీతా లక్ష్మణసహితుడై శ్రీరామచంద్రుడు వచ్చునాడ యేమి అనునట్టి ఆనందముతో కౌసల్యాదేవి మొదలుగా గల రాణులలో సంతోష ముప్పొంగి పోవుచుండెను.

దో॥ భరత నయన భుజ దక్షిణ ఫరకత బారహిం బార ।
జానిసగున మన హరష అతిలాగే కరన బిచార ॥

తా॥ భరతునకు మాటిమాటికి ఎడమకన్ను ఎడమభుజము అదరు చుండెను. శుభములగొల్పు శకునములతో భరతుడు సంతోషముగ నుండెను.

చౌ॥ రహేఉ ఏకదిన అవధి అధారా ।
సముఝుత మన దుఖ భయఉ అపారా ॥
కారన కవన నాథనహిం ఆయఉ ।
జాని కుటిల కిధోం మోహి బిసరాయఉ ॥ 1

తా॥ సర్వజీవులకు ఆధారభూతుడగు శ్రీరామచంద్రుడు వచ్చుటకు ఒక్కదినము మాత్రమె జరుగవలసి యుండెను. శ్రీరామచంద్రుడింకను ఏకారణముచేతనో రాలేదే ? నేను కుటిలుడనని దెలిసికొని మరచినాడని భరతుడు మిక్కిలి బాధను జెందసాగెను

చౌ॥ అహాహ ధన్య లఛిమన బడభాగీ ।
రామ పదారవింద అనురాగీ ॥

కహ తేఁ కుటిల మోహి ప్రభు చీన్హా ।
తా తే నాథ సంగ నహి లీన్హా ॥

తా॥ ఆహా! లక్ష్మణుడు అదృష్టవంతుడు. ఆతనికి శ్రీరామచంద్రుని చరణారవిందములపై ప్రేమగలదు శ్రీరామచంద్రుని చరణములు నాదు యేనాడును లేదు నేను కుటిలుడనని ఎఱింగి తనవెంట రానివ్వలేదు.

చౌ॥ జౌఁ కరనీ సముఝై ప్రభు మోరీ ।
నహి నిస్తార కలప సతకోరీ ॥
జన అవగున ప్రభుమాన న కాఉ ।
దీనబంధు అతి మృదుల సుభాఉ ॥

తా॥ సత్యమే. ప్రభువగు శ్రీరామచంద్రుడు నా కార్యముల దెలిసి కొన్ని కోట్ల సంవత్సరముల వరకు నరకవాసమును గలిగించినను పాపవ పోదు. భగవానుడు సేవకుని తప్పిదములు లెక్కలోనికి తీసుకొనడ ఆతడు దీనజన బాంధవుడు. కోమలస్వభావము గలవాడు,

చౌ॥ మోరే జియఁ భరోస దృఢ సోఈ ।
మిలిహహిఁ రామ సగున సుభ హోఈ ॥
బీతేఁ అవధి రహహిఁ జౌఁ ప్రానా ।
అధమ కవన జగ మోహి సమానా ॥

తా॥ శ్రీరామచంద్రుడు అవశ్యముగ వచ్చునని నాకు విశ్వాసవ గలుగుచున్నది శుభశకునములగుటయే నిదర్శనము నాలాగున ప నాలుగు సంవత్సరములను గడపి జీవించగలిగిన నీచుడెవడీజగత్తుల నుండడు.

దో॥ రామ బిరహసాగర మహఁభరత మగనమన హోత ।
బిప్రవ రూపధరి పవనసుత ఆఇ గయఉ జనుపోత ॥

తా॥ శ్రీరాముని వియోగ దుఃఖసాగరమున భరతుడు మునిగి యుండెను. నీట మునుగువారికి నావ దొరికినట్లు హనుమంతుడు ఆసమయమున బ్రాహ్మణ వేషమును ధరించి వచ్చి

దో॥ బైఠేదేఖి కృసాసన జటాముకుట కృసగాత ।
రామరామ రఘుపతి జపత స్రవత నయన జలజాత ॥ 1

తా॥ దుర్బల శరీరముతోనున్న వానిని జడలనే కిరీటముగ ధరించినవానిని, కమలములవంటి కన్నులతో శోభించుచు ఆనందభాష్పములు రాల్చుచు దర్భాసనముపై కూర్చుండి రామరామ రఘురామయని జపించుచున్న

చౌ॥ దేఖత హనుమాన అతి హరషేఉ ।
పులకగాత లోచన జల బరషేఉ ॥
మన మహఁ బహుత భాంతి సుఖమానీ ।
బోలేఉ శ్రవన సుధాసమ బానీ ॥

తా॥ భరతుని జూచి హనుమంతుడు సంతోషించెను. శరీరము పులకరించెను. నేత్రములనుండి ప్రేమాశ్రువులు స్రవింపసాగెను. అతిశయ సంతోషము గలవాడై చెవులకింపు గలిగించు, సుఖమును గల్గజేయు అమృతపు పలుకులు పలుకసాగెను.

చౌ॥ జాసు బిరహఁ సోచహు దినరాతీ ।
రటహు నిరంతర గున గన పాతీ ॥
రఘుకుల తిలక సుజన సుఖ దాతా ।
ఆయఉ కుసల దేవ ముని త్రాతా ॥

తా॥ ఎవరి విరహబాధచే నీవు రాత్రింబవళ్లు దుఃఖించుచుంటివో ఎవరిగుణగణముల నిరంతరము జపించుచు కీర్తించుచుంటివో, సాధుజనులకు సుఖమును గలుగజేయువాడును, దేవతల, మునీశ్వరుల భక్తుల కాపాడునట్టి వాడునునగు శ్రీరామచంద్రమూర్తి సకుశలముగా వచ్చినారు.

చౌ॥ రిపు రన జీతి సుజస సురగావత ।
సీతాసహిత అనుజ ప్రభు ఆవత ॥
సునత బచన బిసరే సబ దూఖా ।
తృషావంత జిమిపాఇ పియూషా ॥

తా॥ యుద్ధమందు శత్రువులను సంహరించి సీతాలక్ష్మణ సహితు శ్రీరామచంద్రుడు వచ్చినాడు. దేవతలు వారి సత్కీర్తిని కీర్తించుచున్నా ఈమాటలు విని భరతుడు ఆనందించెను. దప్పికతో బాధపడువా అమృతము లభించుటచే పానముజేసి, సర్వదుఃఖములు పోగొట్టుకొనిన భరతుడు తన దుఃఖములు మరచెను

చౌ॥ కో తుమ్హ తాత కహాఁ తే ఆఏ ।
మోహి పరమ లఘు బచనసునాఇ ॥
మారుతసుత మైఁ కపిహనుమానా ।
నాము మోర సునుకృపానిధానా ॥

తా॥ (భరతుడిట్లడిగెను.) నాయనా! నీవెవరవు: ఎక్కడను వచ్చితివి, నిన్ను జూచుటచే నాకు అనందము గలుగుచున్నదని భరత వలుక (హనుమాన్ యిట్లు పలికెను.) కృపాసముద్రుడా! భరతా! వాయుదేవుని కుమారుడను. వానరజాతికి చెందినవాడను. నాపేరు హ మంతుడు.

చౌ॥ దీనబంధు రఘుపతి కరకింకర ।
సునత భరత భేంటెఉ ఉఠి సాదర ॥
మిలత ప్రేమనహిం హృదయ సమాతా ।
నయన స్రవత జల పులకిత గాతా ॥ 5

తా॥ దీనజనోద్ధారకుఁడగు శ్రీరామచంద్రుని సేవకుఁడనని హనుమంతుడు పలుక వెంటనే భరతుడు లేచి ఆలింగనము జేసికొనెను. ఆ సమయమున వారికి గలిగిన ఆనందము వర్ణనాతీతము. కన్నులవెంట ఆనందబాష్పములు స్రవించసాగెను. శరీరము పులకరించెను.

చౌ॥ కపి తవ దరస సకల దుఃఖబీతే ।
మిలే ఆజు మోహి రామ పిరీతే ॥
బార బార బూఝే కుసలాతా ।
తోకహుఁ దేఉఁ కాహ సును భ్రాతా ॥ 6

(భరతుడిట్లు పలికెను.) ఓ హనుమంతా ! నీదర్శన స్పర్శనాదులచే నాదుఃఖము నశించినది నీ రూపమునందు రామదర్శనము నాకు నేడు లభించినది యని మాటిమాటికి క్షేమసమాచారములు అడుగుచు ఈశుభవార్త జెప్పినందులకు నీకేమి యివ్వగలవాడనని పలికెను.

చౌ॥ ఏహి సందేసు సరిస జగమాహీం ।
కరి బిచార దేఖేఉఁ కఛు నాహీం ॥
నాహి న తాత ఉరిన మై తోహీ ।
అబ ప్రభుచరిత సునావహు మోహీ ॥ 7

తా॥ ఈశుభ సందేశముతో సమానమైనట్టి వార్త పదునాలుగు భువనములలో లేదని నేననుకుంటిని. కావున ఓహనుమా' నేను నీకు ఋణపడియుంటిని. నేనెట్లు నిన్ను గౌరవించగలను. నీఋణమును తీర్చజాలను నాకు శ్రీరామచంద్రుని లీలలు సర్వమును వినిపింపుము.

చౌ॥ తబ హనుమంత నాఇ పదమాథా
కహే సకల రఘుపతి గునగాథా ॥
కహు కపి కబహుఁ కృపాల గోసాఈ ।
సుమిరహిఁ మోహి దాసకీ నాఈ ॥

అని భరతుడు పలుక హనుమంతుడాతని చరణములకు నమస్కరించి శ్రీరామచంద్రుల గుణముల గాథల జెప్పెను. (మరల భరతుడిట్లనెను) హనుమా ! దయాసముద్రుడగు శ్రీరామచంద్రుడెప్పుడైన తదాసునివలె నన్ను భావించి గుర్తుంచుకొనునా ?

ఛం॥ నిజ దాస జ్యోఁ రఘువంశ భూషన
కబహుఁ మమ సుమిరన కరచ్యోఁ ।
సుని భరత బచన బినీత అతి
కపి పులకి తన చరనన్హి పర చ్యోఁ ॥
రఘుబీర నిజముఖ జాసుగున
గనకహత అగ జగ నాథ జో ॥
కాహే నహోఇ బినీత పరమ
పునీత సదగున సింధు సో ।

తా॥ రఘువంశ శ్రేష్ఠుడగు శ్రీరామచంద్రుడు నన్నెపుడైన జ్ఞ ప్తియందుంచుకొని తన దాసునివలె భావించునా ? సుశీలుడు వినయవంతు

భరతుని మాటలును విని, పులకిత శరీరుడై హనుమంతుడాతని పాదము లపై బడెను. (మనస్సునందిట్లాలోచించు కొనసాగెను.) చరాచర జీవులకు ప్రభువగు శ్రీరామచంద్రుడీతని గుణగణముల కీర్తించెను. అట్టి భరతు డేల వినమ్రుడు, పవిత్రుడు, సద్గుణనిలయుడు, కాకుండును.

దో॥ రామ ప్రాన ప్రియనాథ తుమ్హ సత్య బచన మమ తాత।
పుని పుని మిలత భరతసుని హరష న హృదయఁ సమాత॥

తా॥ (హనుమంతుడిట్లు పలుకసాగెను.) నాధా ! నీవు శ్రీరామచంద్రు నకు పరమప్రియుడవు. సత్యమైనవిషయము అని పలుక భరతుడుశ్రీఆంజ నేయుని కౌగిలించుకొనెను వారికి గలిగిన ఆనందమును వర్ణింపజాలము.

సో॥ భరత చరన సిరునాఇ తురిత గయఉ కపి రామ పహిఁ।
కహీ కుసల సబ జాఇ హరషి చలేఉ ప్రభు జానచఢి॥

తా॥ పవన కుమారుడు భరతుని చరణములకు నమస్కరించి శ్రీ రామచంద్రుని వద్దకు వెడలి ఆతని క్షేమసమాచారములు జెప్పెను. రఘు వంశ శ్రేష్ఠుడగు రామచంద్ర మహారాజు సంతోషించినవాడై పుష్పక విమానమునధిరోహించి ప్రయాణము సాగించెను.

చౌ॥ హరషి భరత కోసలపుర ఆఏ।
సమాచార సబ గురుహి సునాఏ॥
పుని మందిర మహఁ బాత జనాఈ।
ఆవత నగర కుసల రఘురాఈ॥ 1

తా॥ భరతుడు ఆనందోత్సాహములతో అయోధ్యాపురమునకు జేరి గురువగు వశిష్ఠుల వారికి సంతోషముతో సర్వవిషయములు విన్నవించెను, శ్రీరామచంద్రుడు రాజమహలుకు వచ్చుచున్నాడని కబురువంపెను,

చౌ॥ సునత సకల జననీं ఉఠిధాఈ ।
కహి ప్రభు కుసల భరత సముఝాఈ ॥
సమాచార పురవాసిన్హ పాఏ ।
నర అరునారి హరషి సబ ధాఏ ॥ 2

తా॥ ఆ శుభవార్త వినిన వెంటనే ఆ మువ్వురుతల్లులు లేచి పరుగిడ సాగిరి. శ్రీరామచంద్రుడు క్షేమముగ ఉన్నాడని భరతుడు తల్లులక జెప్పెను. అయోధ్యాపురిలోని వారెల్లరకు ఈవార్త దెలియుటచే శ్రీరాముని దర్శనార్థము సంతోషముతో పరుగిడసాగిరి.

చౌ॥ దధి దుర్బా రోచన ఫల ఫూలా ।
నవ తులసీదల మంగలమూలా ॥
భరి భరి హేమ థారభామినీ ।
గావత చలీं సింధుర గామినీ ॥

తా॥ (శ్రీరామచంద్రునకు స్వాగతమిచ్చుటకై) పెరుగు, దర్భల గోరోజనము ఫలముల, పుష్పముల శుభములకు మూలస్వరూపిణియగు లేచిగురు తులసీదళములు, సుగంధ ద్రవ్యముల బంగారు కలశము నిండుగ నింపుకొని వయ్యారపు నడకలు నడచుచు సౌభాగ్యవతులగు స్త్రీలు కలశపాత్రలు ధరించి శ్రీరాముని కీర్తించుచు నడవసాగిరి.

చౌ॥ జై సేహిం తై సేహిం ఉఠిధావహిం ।
బాలవృద్ధ కహం సంగ న లావహిం ॥
ఏక ఏకన్హ కహం బూఝహిం భాఈ ।
తుమ్హ దేఖే దయాల రఘురాఈ ॥

తా॥ ఎక్కడ ఉన్నవారు అచ్చటినుండియే (ఎవరు ఏయేదిక్కుల యందుండిరో ఆయాయా దిక్కులనుండి పరుగిడసాగిరి.) లేచి పరుగిడ సాగిరి. ఆలస్యమగునేమో యనియెడు భయమువలన బాలురును, వృద్ధులును ఎవరికి వారే వచ్చిరి. సోదరుడా! దయాళుడు, దీనజనబాంధవుడగు శ్రీరామచంద్రుని జూచితివా? అని ఆ వచ్చినవారొకరి నొకరు ప్రశ్నించుకొనుచుండిరి.

చౌ॥ అవధపురీ ప్రభు ఆవతజానీ ।
భఈ సకల సోభాకై ఖానీ ॥
కహఇ సుహావన త్రిబిధ సమీరా ।
భఇ సరజూ అతి నిర్మల నీరా ॥ 5

తా॥ శ్రీరామచంద్ర ప్రభువు వచ్చుట యెరింగి అయోధ్యా పట్టణము సర్వశోభలకు నిలయమై అలరారుచుండెను. త్రివిధములగు (మంద, సుగంధ, శీతల) వాయువులు వీచసాగెను. పరమపావనమగు సరయూ నదిలోని జలము నిర్మలముగనుండెను.

దో॥ హరషిత గురపరిజన అనుజ భూసుర బృందసమేత ।
చలే భరత మన ప్రేమ అతిసన్ముఖ కృపానికేత ॥ 3

తా॥ శ్రీగురుదేవులగు వశిష్ఠ మహర్షియు, కుటుంబీకులును, శత్రుఘ్నుడును, బ్రాహ్మణ సమాజములను వెంటనిడుకొని భరతుడు సంతోషముతో కృపాసముద్రుడగు శ్రీరామచంద్రుని సన్నిధికి స్వాగతమిచ్చుటకై వెడలెను

దో॥ బహుతక చఢీం అటారిన్హ నిరఖహిం గగన బిమాన ।
చలే భరత మన ప్రేమ అతిసన్ముఖ కృపానికేత ॥ 3

తా॥ అనేకమంది స్త్రీలు మేడలపైనెక్కి ఆకాశమార్గమునవచ్చు విమానమును జూచుచు తీయని కంఠస్వరములతో సుందరములగు మంగళ గీతములు గానము చేయుచుండిరి.

దో॥ రాకా ససి రఘుపతి పురసింధు దేఖిహరసాన ।
బఢచ్యో కోలాహాల కరతజనునారి తరంగ సమాన ॥

తా॥ శ్రీరామచంద్రుడు పూర్ణిమనాటి చంద్రుడు. అయోధ్య పట్టణము సముద్రము. శ్రీరామచంద్రుని జూచి అయోధ్యాపురము వర్ణనాతీతమగు సంతోషముతో నుండెను. శ్రీరామచంద్రుని దర్శించుటకు ఉబలాటపడు చుండెను. (సముద్రము పూర్ణచంద్రుని అందుకొనుటకై పొంగిపొంగి ఆనందముతో అలలు వేయునట్లుండెను.) ఆ నగరస్త్రీలు సముద్రతరంగ ములవలె భగవంతుని దర్శించుటకై అటునిటు పరుగెత్తుచుండిరి.

చౌ॥ ఇహాఁ భానుకుల కమల దివాకర ॥
కపిన్హ దేఖావత నగర మనోహర ॥
సునుకపీస అంగద లంకేసా ।
పావన పురీరుచిర యహ దేసా ॥ 1

తా॥ సూర్యకుల రూపమనెడు కమలమును వికసింపజేయు సూర్యుడను శ్రీరామచంద్రుడు వానరులకు, అయోధ్యా నగర దివ్యశోభను విమానము పై నుండి జూపుచు సుగ్రీవా, అంగదా, లంకాపతియగు విభీషణా! ఈ అయోధ్యాపురము పరమ పవిత్రమైనది. సుందరమైనదియని వారితో పలికెను.

చౌ॥ జద్యపి సబ బైకుంఠ బఖానా ।
వేదపురాన బిదిత జగుజానా ॥

అవధపురీ సమ ప్రియ నహిం సో ఊ।
యహ ప్రసంగ జానఇ కోఉ కోఊ॥

తా॥ అయోధ్యాపురము వైకుంఠము కంటెను గొప్పదియని వేదము లలో పురాణములలో చెప్పబడియున్నదని సర్వులకు దెలియును. నాకు అయోధ్యాపురము అనిన మిక్కిలి ప్రియము అందరకును దెలియును.

చౌ॥ జన్మభూమి మమపురీ సుహావని
ఉత్తరదిసి బహసరయూపావని॥
జా మజ్జనతే బినహిం ప్రయాసా।
మమ సమీప నరపావహిం బాసా॥ 3

తా॥ ఈ పరమపవిత్రమైన అయోధ్యాపురము నా జన్మభూమి. ఈ పట్టణమునకు ఉత్తరవైపున జీవుల పవిత్రమొనర్చు సరయూనది ప్రవహించుచున్నది. దీనియందు స్నానముజేసిన మానవుడు పరిశ్రమ లేకయే నా సమీపమునకు వచ్చును. సామీప్యముక్తిని బొందును. ఇందు సంశయమే మాత్రమును లేదు.

చౌ॥ అతి ప్రియమోహిం ఇహాం కే బాసీ।
మమ ధామదా పురీసుఖ రాసీ॥
హరషే సబ కపి సునిప్రభు బానీ।
ధన్య అవధ జో రామ బఖానీ॥

తా॥ అయోధ్యలో నివసించుటనిన నాకు బహుఇష్టము. ఈ పురము సర్వసుఖ సంపదలకు నిలయమైనది. ఇచ్చట నివసించువారికి స్వర్గలోక గతులు గల్గును. (సచ్చిదానంద లోకమునకు వచ్చెదరు) శ్రీరామచంద్రుడే

స్వయముగ అయోధ్యాపురము యొక్క గొప్పదనమును ప్రాశస్త్యమును వర్ణించెను. చాల పవిత్రమైనది

దో॥ ఆవత దేఖిలోగ సబ కృపాసింధు భగవాన్।
నగర నికట ప్రభు ప్రేరేఉ ఉతరేఉ భూమి బిమాన్॥ 4

తా॥ కృపాసముద్రుడగు భగవానుడు వచ్చుటను ప్రజలెల్లరు జూచిరి. శ్రీరామచంద్రుడు పుష్పకవిమానమును అయోధ్యాపురికి సమీపమున దిగునట్లు ఆదేశించెను. ఆ విమానమపుడు భూమికి సమీపముగ అయోధ్యకు జేరెను.

దో॥ ఉతరి కహేఉ ప్రభు పుష్పకహి తుమ్హ
కుబేర పహిం జాహు।
ప్రేరిత రామ చలేఉ సో హరషుం
బిరహు అతి తాహు॥ 4

తా॥ శ్రీరామచంద్రుడు విమానమునుండి దిగి ఓ పుష్పకవిమానమా! నీవు కుబేరునివద్దకు వెడలుమని పలికెను. శ్రీరామచంద్రుని ఆజ్ఞానుసారమది బయలుదేరెను. తన స్వామివద్దకు వెడలుచుండుటచే సంతోషమును శ్రీరామచంద్రుని ఎడబాటునకు అపారమగు దుఃఖమును బొందుచుండెను.

చౌ॥ ఆ ఏ భరత సంగ సబ లోగా।
కృస తన శ్రీరఘుబీర బియోగా।
బామదేవ బసిష్ట మునినాయక।
దేఖే ప్రభు మహి ధరి ధనుసాయక॥

తా॥ భరతుని వెంట ప్రజలెల్లరు వచ్చిరి. శ్రీరామచంద్రుని వియోగ బాధచే వారెల్లరి శరీరములు కృశించెను. వామదేవుని, గురువగు వశిష్ఠుల వారిని మునిశ్రేష్ఠులను శ్రీరామచంద్రుడు జూచి ధనుర్బాణములు భూమిపై పెట్టెను.

దో॥ భూ ఇ ధరే గురు చరన సరోరుహా ।
అను జ సహిత అతి పులక తనోరుహా ॥
భేంటి కుసల బూఝి ముని రాయా ।
హమరేం కుసల తుమ్హారిహిం దాయా ॥

తా॥ తమ్ముడగు లక్ష్మణసహితుండై పరుగిడి గురువగు శ్రీవసిష్ఠుల వారి పాదములకు సాష్టాంగ నమస్కారము జేసెను. వారి శరీరము పులకరించెను రోమ-రోమములు నిక్కబొడిచెను. మునిశ్రేష్ఠులగు వసిష్ఠులవారు ఆ బాలురనిర్వురను లేవనెత్తి హృదయమునకు హత్తుకొని వారి క్షేమసమాచారముల నడుగ గురుదేవా మీ అపార అనుగ్రహమువలన మేము క్షేమమని శ్రీరాముడు పలికెను.

చౌ॥ సకల ద్విజన్హ మిలి నాయఉ మాథా
ధర్మ ధురంధర రఘుకులనాథా ॥
గహే భరత పుని ప్రభు పద పంకజ ।
నమత జిన్హహి సుర ముని సంకర అజ ॥

తా॥ ధర్మధురంధరుడగు శ్రీరామచంద్రుడు బ్రాహ్మణ సమాజములను గలిసికొని తలవంచి నమస్కరించెను. భరతుడు శ్రీరామచంద్ర ప్రభువు పాదములకు సాష్టాంగనమస్కారము జేసెను. రఘుకుల స్వామియగు శ్రీరామచంద్రునకు దేవతలు, మునీశ్వరులు, శివుడు, బ్రహ్మ మొద

లుగా గల దేవతాశ్రేష్ఠులు, యక్షులు, కిన్నరులు నమస్కారములు చేయు చుండిరి.

చౌ॥ పరే భూమి నహిఁ ఉఠత ఉఠాఏ।
బర కరి కృపాసింధు ఉర లాఏ।
శ్యామల గాత రోమ భఏ ఠాఢే॥
నవ రాజీవ నయన జల బాఢే॥

తా॥ భరతుడు శ్రీరామచంద్రునకు సాష్టాంగ నమస్కారములు జేయుచు భూమిపై బడియుండి లేచుటకశక్తుడయ్యెను. శ్రీరామచంద్రుడు భరతుని బలాత్కారముగ లేవనెత్తి తన హృదయమునకు ఆలింగనము జేసికొనెను ఆతని నీలమేఘ శరీరమునగల వెంట్రుకలు నిక్కబొడుచు కొనెను. లేతవగు కమలములవంటి కన్నులనుండి ఆనందబాష్పములు రాలుచుండెను.

ఛం॥ రాజీవ లోచన స్రవత జల తన
లలిత పులకావలిబనీ।
అతిప్రేమ హృదయఁ లగాఇ అనుజహి
మిలే ప్రభు త్రిభువన ధనీ॥
ప్రభుమిలత అనుజహి సోహ మో
పహిఁ జాతి నహిఁ ఉపమా కహీ।
జను ప్రేమ అరు సింగార తనుధరి
మిలే బర సుషమా లహీ॥

తా॥ లేతకమలములతో సమానములగు రెండు కనులనుండి ఆనంద బాష్పములు రాలసాగెను నీలకమలము వంటి ఆ సుందరమగు శరీరము

పులకరించుటచే శోభతో ప్రకాశించుచు తన్మయము జెందుచుండెను. ముల్లోకములకు ప్రభువగు శ్రీరామచంద్ర మహారాజు తమ్ముడగు భరతుని ప్రేమతో ఆలింగనము జేసికొనెను. ఆ సోదరులకు గలిగిన ఆనందము వర్ణనాతీతము ఉపమానము లేదు. శ్రేష్ఠమగు అందమే రెండు శరీరములై గలిసికొనెనా ? అనునట్లు జూచువారలకుండెను.

ఛం॥ బూఝుత కృపానిధి కుసల భరతహి
బచన బేగి న ఆవ ఈ।
సును సివా సో సుఖ బచన మన తే
భిన్న జాన జో పావ-ఈ॥
అబకుసల కౌసలనాథ ఆరత జాని
జన దరసన దియో।
బూఢత బిరహ బారీస కృపానిధాన
మోహి కర గహి లియో॥ 2

తా॥ దయాసముద్రుడు శ్రీరామచంద్రుడు తమ్ముడగు భరతుని యోగక్షేమ సమాచారములడిగెను. ఆనందమున భరతుడు మునిగియుండుట వలన నోటివెంట మాటలు వెంటనే రాకుండెను. ఓ పార్వతీ ఆనమయమున గలిగిన సుఖసంతోషములు నాతని మనస్సుకు మాత్రమే తెలియును. మనస్సే ఆ ఆనందానుభూతిని జెప్పగ:దు. (భరతుడు చెప్పుచున్నాడు) శ్రీరామచంద్రా ! నేను మీదాసుడనని దెలిసికొని నాదుఃఖముల బాపుటకొరకై దర్శనమిచ్చితివి నీ అనుగ్రహము వలన క్షేమముగనే యుంటిని. విరహ సముద్రమున మునుగు నన్ను కృపాసముద్రుడవగు నీవు కాపాడితివి.

దో॥ పుని ప్రభు హరషి సత్రుహన భేంటే హృదయఁలగాఇ।
లఛిమన భరత మిలేతబ పరమ ప్రేమ దో ఉ భాఈ॥

తా॥ శ్రీరామచంద్రుడు శతృఘ్నుని గలిసికొని హృదయమునకు హత్తుకొనెను. ఆ సమయముననే లక్ష్మణ భరతులు మిక్కిలి ప్రేమతో కలిసికొనిరి.

చౌ॥ భరతానుజ లఛిమన పుని భేంటే।
దుసహ బిరహ సంభవ దుఖ మేటే॥
సీతా చరన భరత సిరు నావా।
అను జ సమేత పరమ సుఖ పావా॥ 1

తా॥ లక్ష్మణుడు శతృఘ్నుని కలిసికొని ప్రేమతో ఆలింగనము జేసికొనిరి. ఈ విధముగా వారికి గలిగిన సహింపరాని దుఃఖమును నాశనము జేసికొనిరి. భరతుడు తమ్ముడగు శతృఘ్న సహితుడై శ్రీసీతాదేవి పాదములకు ప్రణమిల్లి సంతసించెను.

చౌ॥ ప్రభు బిలోకి హరషే పురబాసీ।
జనిత బియోగ బిపతి సబనాసీ॥
ప్రేమాతుర సబ లోగ నిహారీ।
కౌతుక కీన్హ కృపాల ఖరారీ॥

తా॥ శ్రీరామచంద్రుని దర్శించుటచే అయోధ్యావాసులెల్లరు ఆనందించిరి. వారికి గలిగిన వియోగబాధ నశించినది. ప్రజలెల్లరు ప్రేమచే తన్మయులైరి. ఖర-దూషణాంతకుడగు శ్రీరామచంద్రుడొక చమత్కారమును జేసెను.

చౌ॥ అమితరూప ప్రగటే తేహికాలా।
జథా జోగ మిలే సబహి కృపాలా॥

కృపాదృష్టి రఘుబీర బిలోకీ
కిఏ సకల నర నారి బిసోకీ ॥ 3

తా॥ ఆ సమయముననే కృపాసముద్రుడగు శ్రీరామచంద్రుడు అనేక రూపములు ధరించి ప్రతియొకరివి కలిసి సంతోషపరచి వారినెల్లరను అనుగ్రహించి, స్త్రీ-పురుషులను శోకరహితులుగ జేసెను

చౌ॥ ఛన మహిఁ సబహి మిలే భగవానా ।
ఉమా మరమ యహ కాహుఁ న జానా ॥
ఏహి బిధి సబహి సుఖీ కరిరామా ।
ఆగేఁ చలే సీల గున ధామా ॥ 4

తా॥ శ్రీరామచంద్ర భగవానుడు క్షణకాలములోనే సర్వులను గలిసికొనెను. ఓపార్వతీ ! ఈ రహస్యమెవరికిని దెలియదు. సచ్ఛీలము, సద్గుణములకు నిలయుడునగు శ్రీరాముడు ప్రజల యెదుటకువచ్చి నిలువబడి వారిని సంతోషపెట్టెను.

చౌ॥ కౌసల్యాది మాతు సబ ధాఈ ।
నిరఖిబచ్ఛ జను ధేను లవాఈ ॥ 5

తా॥ గోవత్సవముల కొరకై పాలిచ్చుటకు ఆవులు ప్రేమతో పరుగిడునట్లు వారివారిబిడ్డల జూచుటకు తల్లులు పరుగిడుచుండిరి.

ఛం॥ జను ధేను బాలక బచ్ఛ తజి
గృహఁ చరన బన పరవస గఈఁ ।
దిన అంత పురరుఖ స్రవత
థన హుంకార కరి ధావత భఈ ।

అతి ప్రేమ ప్రభు సబ మాతు భేంటేం
బచన మృదు బహు బిధి కహే ।
గఇ బిషమ బిపతి బియోగ భవ
తిన్హ హరష సుఖ అగనిత లహే ॥

తా॥ అప్పుడే ఈనిన ఆవు దూడనుపదలి అడవికి ఆహారముకొరకు వెళ్ళి సూర్యాస్తమయమువరకు గడ్డిని మేయుచుండి బిడ్డయందు ప్రేమ గలదై 'అంబా' అని రంకెలువేయుచు వచ్చుచున్నట్లును, పట్టణమునకు వెళ్ళి ప్రేమతో, ఉత్సాహముతో పాలు అమ్ముకొని యింటికి సంతోషముగ వచ్చునట్లు తల్లులెల్లరు ఉప్పొంగుచున్న ప్రేమతో వచ్చి శ్రీరాముని గలిసిరి. "అమ్మా ! భయానకమగునట్టి వియోగబాధ నశించినది" అని రామచంద్రుడు బలుక తల్లులెల్లరు సుఖమును, సంతోషమును అనుభవించిరి.

దో॥ భేంటేఉ తనయ సుమిత్రతాం రామ చరన రతి జాని
రామ హి మిలత కైకేఈ హృదయ బహు త సకుచాని॥

తా॥ సుమిత్ర మొదలుగాగల తల్లులెల్లరు శ్రీరామచంద్రుని జూచుటకు సంతోషముతో వచ్చిరి. కైకేయీదేవి శ్రీరామచంద్రుని జూచి సిగ్గుపడెను.

దో॥ లఛిమన సబ మాతహి మిలి హరషే ఆశిష పాఇ ।
కైకేయి కహం పుని పుని మిలే మన కర ఛోభు న జాఇ॥౧

తా॥ లక్ష్మణుడు తల్లులనెల్లరను గలిసికొని వారి ఆశీర్వాదములు బొందెను. కైకేయిని అనేక పర్యాయములు గలిసికొనెను అతని రోషము పోలేదు,

చౌ॥ సాసున్హ సబని మిలీ బై దేహీ ।
చరనన్హి లాగి హరషు అతి తేహీ ॥
దేహీం ఆశీస బూఝి కుసలాతా ।
హోఇ అచల తుమ్హార అహిబాతా ॥

తా॥ జానకిదేవి అత్తలనెల్లర దర్శించి వారిచే ఆశీర్వాదములు బొందెను. వారు సంతోషించి నీకీర్తి సూర్య-చంద్రులున్నంత వరకుండు గాక అని దీవించిరి.

చౌ॥ సబరఘుపతి ముఖకమల బిలోకహీం ।
మంగల జాని నయన జల రోకహీం ॥
కనక థార ఆరతీ ఉతారహీం ।
బారబార ప్రభు గాత నిహారహీం ॥

తా॥ తల్లులెల్లరు శ్రీరామచంద్రుని నీలకమలమువంటి ముఖమును జూచి కనులవెంట ప్రేమాశ్రువులు రాల్చుచుండిరి. వారిది శుభసమయమని యెరింగి వారు ఆనందాశ్రువులను కన్నులయందే యింకింపజేసిరి. బంగారు పళ్ళెములచే హారతుల నిచ్చుచు మాటిమాటికి శ్రీరామచంద్రుని జూచుచుండిరి.

చౌ॥ నానా భాంతి నిఛావరి కరహీం
పరమా నంద హరష ఉర భరహీం ॥
కౌసల్యా పుని పుని రఘువీరహి ।
చితవతి కృపాసింధు రణ ధీరహి ॥ 3

వివిధ విధములగు హారతుల నిచ్చిరి. హృదయమందు సంతోషము ఉప్పొంగుచుండెను. అనేక పర్యాయములు తల్లియగు కౌసల్యాదేవి శ్రీరామ చంద్రుని జూచుచు ఆనందించుచుండెను.

చౌ॥ హృదయఁ బిచారతి బారహిఁ బారా
కవన భాంతి లంకాపతి మారా ॥
అతి సుకుమార జుగల మేరే బారే ।
నిసిచర సుభట మహాబల భారే ॥ 4

తా॥ ఈ బాలురిరువురు పసివారును సుకుమారులు. ఆ రాక్షసులు బలవంతులు యుద్ధమందు ఆరితేరిన నిపుణత్వముగల రావణుని శ్రీరాముడు యెట్లు జంపెనని చెప్పుకొనసాగిరి.

దో॥ లఛిమన అరుసీతా సహిత ప్రభు హి బిలోకతి మాతు।
పరమానంద మగన మన పుని పుని పులకిత గాతు ॥ 7

తా॥ సీతారామలక్ష్మణులను జూచుటచే కౌసల్యాదేవి మనస్సున సంతోషముప్పొంగు చుండెను శరీరము పులకరింపసాగెను.

చౌ॥ లంకాపతి కపీస నల నీలా ।
జామవంత అంగద సుభసీలా ॥
హనుమదాది సబ బానర బీరా ।
ధరే మనోహర మనుజ సరీరా ॥ 1

తా॥ లంకాధిపతియగు విభీషణుడు, వానరరాజు సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, అంగదహనుమదాదులు మొదలుగాగల శ్రేష్ఠస్వభావము గల వానరవీరులెల్లరను మానవ శరీరముల ధరించిరి.

చౌ॥ భరత స్నేహ సీల వ్రత నేమా ।
సాదర సబ బరన హిఁ అతి ప్రేమా ॥

దేఖి నగరబాసిన్హ కై రీతీ ।
సకల సరాహహిం ప్రభుపద ప్రీతీ ॥ 2

తా॥ భరతుని ప్రేమను, సుందరమగు స్వభావమును, త్యాగబుద్ధిని, నియమవ్రతమును, జూచి వారెల్లరు కీర్తించిరి. నగర నివాసులగు స్త్రీ-పురుషుల ప్రేమను, శీలమును, వినయమును వారి ఆచరణమును జూచి చాల ఆనందించిరి. (మాభక్తి తక్కువయని వారు భావించుకొనిరి.) శ్రీరామచంద్రుని కీర్తించిరి.

చౌ॥ పుని రఘుపతి సబ సఖా బోలాఏ ।
ముని పద లాగహు సకల సిఖాఏ ॥
గురు వశిష్ట కులపూజ్య హమారే ।
ఇన్హ కి కృపాఁ దనుజ రన మారే ।

తా॥ శ్రీరామచంద్రుడు స్నేహితులనెల్లర బిలపించెను. వశిష్ఠ మహర్షులవారు మా కులగురువులు. పూజ్యులు వీరి దివ్యానుగ్రహముచేతనే రాక్షసకులమును నిర్మూలించుట జరిగినది యని పలికెను

చౌ॥ ఏ సబ సఖా సునహు ముని మేరే ।
సమర సాగర కహేఁ బేరే ॥
మమ హిత లాగిజన్మ ఇన్హ హారే ।
భరతహు తే మోహి అధిక పి ఆరే ॥ 4

తా॥ (శ్రీరాముడు మరల యిట్లు పలుకసాగెను) ఓ మునిశ్రేష్ఠా ! వీరెల్లరు నా సఖులు. యుద్ధరూపమనెడు సముద్రమునందు నాకు వీరు పెద్ద పడవలు, వీరు నా క్షేమముకొరకై ప్రాణముల హోమముజేసిరి, వారెల్లరు చివరివరకు పోరాడిరి. వీరు భరతునికంటె అధికమగు ప్రియులు.

చౌ॥ సుని ప్రభు బచన మగన సబ భఏ ।
నిమిష నిమిష ఉప జత సుఖ నఏ ॥ 5

తా॥ శ్రీరామచంద్రుని మాటలువిని వారెల్లరు ఆనందసముద్రమున మునిగి సుఖ-సంతోషములను పొందిరి.

దో॥ కౌసల్యా కె చరనన్హి పుని తిన్హ నాయఉ మాథ ॥
ఆసిష దీన్హే హరషి తుమ్హ ప్రియమమ జిమి రఘునాథ॥

తా॥ ఆ ప్రజలెల్లరు గౌసల్యాదేవికి నమస్కరించిరి. ఆమె సంతోషించి వారి నాశీర్వదించి మీరెల్లరు నాకు శ్రీరామచంద్రునితో సమానులని పలికెను. వారెల్లరు ఆనందించిరి.

దో॥ సుమన వృష్టి నభ సంకుల భవన చలే సుఖకంద ।
చఢీ అటారిన్హ దేఖహిం నగరనారి నరబృంద ॥ 8

తా॥ ఆనందనిధియగు శ్రీరామచంద్రుడు తన మహలునకు వెడలెను. ఆకాశము పుష్పసమూహములచే నిండియుండెను. అయోధ్యాపురములోని స్త్రీపురుషులు మేడలు, మిద్దెలపై నెక్కి భగవానుని దర్శించుచుండిరి,

చౌ॥ కంచన కలస బిచిత్ర సంవారే ।
సబహిం ధరే సజి నిజ నిజ ద్వారే ॥
బందనవార పతాకా కేతూ ।
సబన్హి బనాఏ మంగల హేతూ ॥ 1

తా॥ బంగారు కలశములను వివిధ విధములుగ మణులచే, రత్నములచే అలంకరించి పట్టుకొని ప్రజలెల్లరు వారి-వారి వాకిళ్ళలో నుండిరి.

వాకిళ్ళకు మంగళ తోరణములు గట్టిరి పతాకములు గట్టిన ధ్వజములు పట్టుకొనిరి.

చౌ॥ బీథీం సకల సుగంధ సించాఈ।
 గజమని రచి బహు చౌక పురాఈ॥
 నానా భాంతి సుమంగల సాజే।
 హరషి నగర నిసాన బహు బాజే॥

తా॥ బజారులు, వీధులన్నియు సుగంధిత పదార్థములచే, సువాసనలచే నిండియుండెను. ఏనుగు కుంభస్థలమునుండి దీయబడిన మంచిముత్యములచే అందముగ అలంకరించిరి. వివిధ విధములగు మంగళకరద్రవ్యములు సమకూర్చిరి. సంతోషముచే నగరమున ఢంకా, షహనాయి మొదలుగాగల వాద్యములు ప్రయోగించుచుండిరి.

చౌ॥ జహం తహం నారి నిచావరికరహీం।
 దేహిం అసీస హరష ఉర భరహీం॥
 కంచన థార ఆరతీం నానా।
 జువతీం సజేం కరహిం సుభగానా॥ 3

తా॥ స్త్రీలు హారతుల నిచ్చుచుండిరి. వారికి గలిగిన ఆనందము వర్ణనాతీతము. ఆశీర్వాదములు జేయుచుండిరి. సౌభాగ్యవతులగు స్త్రీలు బంగరువత్తులు వెలిగించి వివిధ విధములగు హారతులనిచ్చుచు, మంగళకరములగు కీర్తనలు పాడుచు సంతోషమున దేలియాడుచుండిరి.

చౌ॥ కరహిం ఆరతీ ఆరతిహర కేం।
 రఘుకుల కమల బిపిన దినకర కేం॥

పురసోభా సంపతి కల్యానా ।
నిగమ సేష సారదా బఖానా ॥ 4

తా॥ దుఃఖముల హరించి, శాంతిని గలుగజేయువాడును, సూర్య కుల రూపమనెడు కమలవనమును వికసింపజేయు సూర్యునివంటి శ్రీరామ చంద్రునకు హారతుల నిచ్చుచుండిరి. అయోధ్యానగర శోభను, సంపదలను, శుభగుణములను, వేదములు, అనంతశేషుడు సరస్వతీదేవియు వర్ణించి చెప్పెను.

చౌ॥ తేఉ యహ చరిత దేఖి ఠగి రహహీం ।
ఉమా తాసు గున నర కిమి కహహీం ॥ 5

తా॥ ఈ లీలలు సంపదలజూచి ఆశ్చర్యమును జెందిరి. (శివుడిట్లు పలుకుచున్నాడు.) ఓపార్వతీ. వారి సద్గుణముల మానవుడు ఎట్లు వర్ణింప గలడు.

దో॥ నారి కుముదినీం అవధ సరరఘుపతి బిరహదినేస ।
అస్థభఏ బిగసత భఈం నిరఖి రామ రాకేస ॥ 9

తా॥ స్త్రీలు కమలపుష్పములు. అయోధ్యాపుర పెద్ద సరోవరము. శ్రీరామచంద్రుని విరహతాపమే సూర్యుడు. విరహరూపమనెడు సూర్యుడు అస్త్రాద్రిని జేరిన పూర్ణచంద్రుదుదయించుటచే కమలపుష్పములు వికసించు నట్లు ఆ అయోధ్యలోని స్త్రీ-పురుషులు శ్రీరామచంద్రుని జూచి ఆనంద ముతో నుండిరి.

దో॥ హౌహి సగున సుభ బిబిధి బిధి బాజహిం గగన నిసాన।
పుర నరనారి సనాథ కరి భవనచలే భగవాన ॥

తా॥ వివిధ రకములగు శుభశకునములు అగుచుండెను. ఆకాశమందు నగారా శబ్దములు మ్రోగించుచుండిరి. అయోధ్యా నగరములోని స్త్రీపురుషులు శ్రీరాముని దర్శించుటకై రాజమహాలుకు బయలుదేరిరి.

చౌ॥ ప్రభు జానీ కైకఈ లజానీ ।
ప్రథమ తాసు గృహా గఏ భవానీ ॥
తాహి ప్రబోధి బహుత సుఖ దీన్హా ॥
పుని నిజభవన గవనహరి కీన్హా ॥ 1

తా॥ (శివుడు జెప్పుచున్నాడు) ఓపార్వతీ! శ్రీరామచంద్రుడు వచ్చెనని కైక దెలిసికొని మిక్కిలిగ సిగ్గుపడుచుండెను. (కావుననే) మొదటనే శ్రీరాముడు కైకేయీ గృహమునకు వెడలి ఆమెనునంతో షపరచి,

చౌ॥ కృపాసింధు జబ మందిర గఏ ।
పుర నర నారి సుఖీసబ భఏ ॥
గురు బసిష్ట ద్విజ లిఏ భులాఈ ।
ఆజు సుఘరీ సుదిన సముదాఈ ॥ 1

తా॥ రాజమహలునకు వెడలెను అయోధ్యాపురములోని స్త్రీపురుషులెల్లరు సంతోషపడి రాజమహలువైపుకు నడువసాగిరి. శ్రీరామచంద్రుని రాకను జూచి నగరంలోని స్త్రీ-పురుషులు ఆనందముతో నుండిరి. వశిష్ఠ మహర్షులవారు బ్రాహ్మణుల బిలిపించి నేడు శుభదినము, శుభఘడియలు అన్నియు శుభస్కరములై యుండెనని పలికెను.

చౌ॥ సబ ద్విజదేహు హరషి అనుసాసన
రామచంద్ర బైఠహిం సింఘాసన ॥

మునివశిష్ట కే వచన సుహాఏ ।
సునత సకల బిప్రన్హ అతి భాఏ ॥

శ్రీరామచంద్రుడీ సింహాసనముపై కూర్చుండి విరాజమానుడై దేదీప్య ముగ వెలుగునట్లు బ్రాహ్మణులెల్లరును ఆశీర్వదించుడు. ఆ వశిష్ఠులవారు పలికిన మాటలువిని మహాత్ములెల్లరును ఆనందించిరి.

చౌ॥ కహహిం బచన మృదు బిప్ర అనేకా
జగ అభిరామ రామ అభిషేకా ॥
అబ మునివర బిలంబ నహిం కీజై
మహారాజ కహం తిలక కరీజై ॥

తా॥ అక్కడకు జేరిన వారెల్లరను, బ్రాహ్మణ మండలులును శ్రీ రామచంద్రునకు రాజ్యాభిషేకము జరిగిన సర్వజగత్తులకును ఆనందోత్సాహ ములు గలుగునని పలుకసాగిరి. ఓవశిష్ఠమహర్షీ! ఆలస్యముజేయక వెంటనే శ్రీరామచంద్ర మహారాజుకు రాజ్యాభిషేక తిలకధారణ జేయుము.

దో॥ తబమునికహేఉ సుమంత్రసన సునత చలేఉ హరషాఇ
రథ అనేక బహుబాజి గజ తురత సంవారే జాఇ ॥ 10

తా॥ శ్రీవశిష్ఠులవారు మంత్రియగు సుమంత్రునితో వెంటనే రథ ముల, గుఱ్ఱముల, ఏనుగుల సమకూర్చుడని పలికెను.

చౌ॥ జహం తహం ధావన పఠఇ పుని మంగలద్రవ్య మగాఇ।
హరష సమేత బసిష్ట పద పుని సిరునాయఉ ఆఇ ॥ 10

తా॥ దూతలు మంగళకర వస్తువులు తీసికొనివచ్చి సంతోషముతో వశిష్ఠులవారికిచ్చి పాదాభివందనము జేయుచుండిరి.

చౌ॥ అవధపురీ అతిరుచిర బనాఈ ।
దేవన్హ సుమన వృష్టి ఝరి లాఈ ॥
రామ కహా సేవకన్హ బులాఈ ॥
ప్రథమ సఖన్హ అన్హావహు జాఈ ॥ 1

తా॥ అయోధ్యాపురమును శోభాయమానముగ అలంకరించిరి. దేవతలు ఆకాశమునుండి పుష్పవర్షమును గురిపించసాగిరి. శ్రీరామచంద్రుడు తన సేవకులను బిలిచి ముందుగా నా సఖులకు స్నానాదికార్యక్రమములు ముగించుడని పలికెను.

చౌ॥ సునత బచన జహఁ తహఁ జన ధాఎ ।
సుగ్రీవాది తురత అన్హావాఎ ॥
పుని కరునానిధి భరతు హఁకారే ।
నిజకర రామ జటా నిరు ఆరే ॥ 2

తా॥ భగవానుని ఆజ్ఞానుసారముగ సుగ్రీవాది వానరులకు స్నానములు చేయించిరి. కరుణాసముద్రుడగు రఘురాముడు భరతుని జడలను స్వయముగ విడదీసెను.

చౌ॥ అన్హావాఎ ప్రభు తీనిఉ భాఈ ।
భగత వత్సల కృపాల రఘురాఈ ।
భరతభాగ్య ప్రభు కోమల తాఈ ।
సేషకోటి సతసకహిఁ న గాఈ ॥ 3

తా॥ భక్తవత్సలుడగు శ్రీరామచంద్రుడు తన ముగ్గురు తమ్ములకు స్నానము చేయించెను. భరతుని అదృష్టమును; భాగ్యమును ఆతనిపై

భగవానునకు గల వాత్సల్యమును కోట్లకొలది శేషులుసహితం వర్ణింప లేరు.

చౌ॥ పుని నిజ జటా రామ బిబ రాఏ।
గురు అను సాసన మాగి నహాఏ॥
కరి మజ్జన ప్రభు భూషన సాజే।
అంగ అనంగ దేఖి సత లాజే॥ 4

తా॥ శ్రీరామచంద్ర ప్రభువు తన జడలను విప్పుకొని గురుదేవుల ఆజ్ఞానుసారము స్నానముజేసి పిదప మరకతమాణిక్య రత్నఖచితములగు సొమ్ములు ధరించెను. వారియొక్క దివ్యము చిన్మయమునగు అందచంద ములు జూచి వేలమన్మధులు సిగ్గుపడుచుండిరి.

దో॥ సాసున్హ సాదర జానకిహి మజ్జన తురత కరాఇ।
దివ్యబసన బరభూషన అంగ అంగః సజే బనాఇ॥

తా॥ అత్తలు జానకీదేవికి ప్రేమతో స్నానాదికార్యములు చేయించి మిరుమిట్లు గొలుపునట్టి ఆభరణములు ధరింపజేసిరి.

దో॥ రామ బామ దిసిసోభతి రమారూప గున ఖానీ।
దేఖి మాతు సబ హరషీఁ జన్మసుఫల నిజ జానీ॥

తా॥ శ్రీరామచంద్రుని కెడమవైపున సద్గుణ నిలయురాలగు శ్రీజానకీ దేవి శోభతో ప్రకాశించుచుండెను ఆమెను జూచిన తల్లులెల్లరు వారివారి జన్మలు, జీవితములు తగిన ఫలితమును బొందినవని దెలిసికొని సంతో షించిరి.

దో॥ సును ఖగేస తేహి అవసర బ్రహ్మ శివ ముని బృంద
చఢి బిమాన ఆఏ సబసుర దేఖన సుఖకంద ॥

తా॥ (కాకభుశుండి జెప్పుచున్నాడు.) ఓపక్షిరాజా ! గరుడజీ ! విన వలసినది! ఆ సమయమున బ్రహ్మ, శివుడు, మునుల దేవతా సమూహముల వెంటనిడుకొని విమానములందధిరోహించి ఆనందకంద స్వరూపుడగు శ్రీరామచంద్రుని దర్శించుటకు వచ్చిరి.

చౌ॥ ప్రభు బిలోకి ముని మన అనురాగా !
తురత దివ్య సింఘాసన మాగా ॥
రవి సమ తేజ సో బరని న జాఈ ।
బైఠె రామ ద్విజన్హ సిరు నాఈ ॥ 1

తా॥ శ్రీవశిష్ఠులవారు శ్రీరామచంద్రుని జూచి మనస్సులో తన్మయత జెంది దివ్యము చిన్మయమునగు సింహాసనమును దెప్పించెను. అది సూర్యుని వెలుగుతో సమానముగ నుండెను. దాని సౌందర్యమును వర్ణింప జాలను. బ్రాహ్మణ సమాజములకు నమస్కరించి, శ్రీరాముడా సింహాసనముపై కూర్చుండెను.

చౌ॥ జనక సుతా సమేత రఘురాఈ ॥
పేఖి ప్రహరషే ముని సముదాఈ ।
బేద మంత్ర తబ ద్విజన్హ ఉచారే ।
నభ సుర ముని జయ జయతి పుకారే ॥ 2

తా॥ శ్రీజానకీ సహితుడగు శ్రీరామచంద్రుని జూచి మునీశ్వర సముదాయములు ఆనందమును జెందెను. బ్రాహ్మణులు వేదమంత్రముల ఉచ్చ

రించిరి. ఆకాశమునుండి దేవతలు, మునిసముదాయములు జయహో, జయహో అని నినాదములు జేయసాగిరి.

చౌ॥ ప్రథమ తిలక బసిష్ట ముని కీన్హా ।
పుని సబ బిప్రన్హ ఆయసు దీన్హా ॥
సుత బిలోకి హరషీం మహా తారీ ।
బార బార ఆరతీ ఉతారీ ॥ 3

తా॥ అందరికంటె ముందుగ గురువగు వశిష్ఠుడు బ్రాహ్మణసమాజముల ఆజ్ఞానుసారము శ్రీరామచంద్రునకు తిలకధారణ జేసెను. పుత్రుడు రాజసింహాసనముపై కూర్చుండి యుండుటను తల్లులు జూచి ఊహాతీతమగు ఆనందముననుభవించుచు మాటిమాటికి హారతులు ఇచ్చుచుండిరి.

చౌ॥ బిప్రన్హ దాన బిబిధి బిధి దీన్హే ।
జాచక సకల అజాచక కీన్హే ॥
సింఘాసన పర త్రిభువన సాఈం ।
దేఖి సురన్హ దుందుభీం బజాఈం ॥ 4

తా- వారు బ్రాహ్మణులకు వివిధరకములగు వస్తువాహనములు దానధర్మములు జేసిరి. యాచకులకు సంపూర్ణముగ దానములనిచ్చి అయాచకులుగ జేసెను. త్రిభువనములకు స్వామియగు శ్రీరామచంద్రుడు సింహాసనముపై కూర్చుండియుండ దేవతలెల్లరు జూచి 'ఢంకా' 'నగారా' ధ్వనులు జేయుచుండిరి.

ఛం॥ నభ దుందుభీం బాజహిం బిపుల గంధర్వ కిన్నర గావహీం
నాచహీం అపచరాబృంద పరమానంద సురముని పావహీం

భరతాది అనుజ బిభీషనాంగద హనుమదాది సమేత తే।
గహేఁఛత్ర చామర బాంజ ధనుఅసి చర్మన శక్తిబిరాజ తే॥

తా॥ ఆకాశమార్గమున 'నగారా' శబ్దములు మ్రోగించుచు యక్ష కిన్నర, గంధర్వులు పాటలు పాడుచుండిరి. అప్సరసలు గుంపులు-గుంపులుగ నొకచోట జేరి నాట్యమాడుచుండిరి. దేవతలు, మునీశ్వరులు వర్ణనాతీతమగు ఆనందముచే తన్మయతను బెందుచుండిరి. భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు, విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు, సుగ్రీవుడు మొదలుగా గలవారు క్రమముగ ఛత్రమును, చామరమును, ధనుస్సును, ఖడ్గమును, డాలును, శక్తి మొదలుగాగల ఆయుధములు ధరించి శోభతోనుండిరి.

ఛం॥ శ్రీసహిత దినకరవంశ భూషన కామ బహుఛబి సోహఈ।
నవ అంబుధర బరగాత అంబరపీత సురమన మోహఈ॥
ముకుటాంగదాది బిచిత్రభూషన అంగ అంగన్హి ప్రతిసజే।
అంభోజనయన బిసాల ఉరభుజ ధన్యనర నిరఖంతి జే॥ 2

తా॥ సూర్యవంశ విభూషణుండగు శ్రీరామచంద్రుడు వేలమన్మధుల కంటెను అందముగ నుండెను, జలయుక్తములైయున్న సుందరమైనట్టి నీల మేఘముతో సమానమైన శ్యామల శరీరాకారుండగు శ్రీరామచంద్రుడు పట్టుపీతాంబరములు ధరించి దేవతల మనస్సులనుగూడ హరించుచున్నట్లుండెను. కిరీటము, బాజాబందులు మొదలుగాగల విచిత్రాభరణములు శరీరమునకు అలంకరింపబడెను కమలములవంటి నేత్రములును, విశాలమగు వక్షస్థలమును, పొడుగుగల చేతులును, విశాలమగు భుజములును గలవు. ఎవరీ పురాణ పురుషుని దర్శింతురో, అట్టివారే ధన్యులు అని చెప్పబడెను.

దో॥ వహ శోభా సమాజసుఖ కహత న బనఇ ఖగేస ।
బరనహిం సారద సేష శృతి సో రస జానమహేస ॥ 12

తా॥ ఓపక్షిరాజా! గరుడుడా! వినుము. ఆ శోభను, ఆ సమాజము వారికి గలిగిన సుఖమును నేనేట్లు వర్ణింపగలను. సరస్వతీదేవి అనంత శేషుడు, వేదములు వాటిని వర్ణించిరి. దానివలన గలుగు ఆనందము మహా దేవునకు బాగుగ దెలియును.

దో॥ భిన్న భిన్న అస్తుతి కరి గఏ సుర నిజ నిజ ధామ ।
బందీబేష బేద తబ ఆఏ జహం శ్రీరామ ॥ 12

తా॥ దేవతలెల్లరు ఎవరికివారే భగవానుని కీర్తించి వారివారి లోకములకు వెడలిరి. స్తోత్రపాఠకుల వేషములు ధరించి నాలుగు వేదములు శ్రీరామచంద్రుడున్న ప్రదేశమునకు వచ్చెను.

దో॥ ప్రభు సర్వగ్య కీన్హ అతి ఆదర కృపానిధాన ।
లఖేఉ న కాహూం మరమ కఛు లగే కరన గునగాన॥

తా॥ కృపానిధానుడు, సర్వజ్ఞుడునగు ప్రభువు వారినెల్లరను ఆదరించి సత్కరించెను. ఈ విషయమెవరికి దెలియదు. వేదములు శ్రీరామచంద్రుని గుణములు గానము జేయసాగెను.

ఛం॥ జయసగున నిర్గున రూపరూప అనూప భూపసిరోమనే ।
దసకంధరాది ప్రచండ నిశిచర ప్రబల ఖలభుజ బలహనే ॥
అవతార నరసంసార భార బిభంజి దారున దుఖ దహే।
జయ ప్రనతపాల దయాల ప్రభు సంజుక్త సక్తి నమామహే॥

తా॥ ఓసగుణ నిర్గుణాకారా! దివ్యస్వరూపా! దశరధరామా ! రాజ శ్రేష్ఠా! భగవాన్! నీకు జయమగుగాక! రావణుడు మొదలుగాగల ప్రబల మగు దుష్ట రాక్షసులను, నీ భుజబల సంపదచే జయించి నాశనము జేసితివి. నీవు మానవజన్మనెత్తి సంసారదుఃఖ తాపముల నాశనము జేయుచుంటివి. దీనజనోద్ధారకా! కరుణామయా! రామా! శరణాగతరక్షకా! ప్రభో! నీకు జయమగుగాక! శ్రీసీతాసహితుడవైన నీకు మాటిమాటికి నమస్కారము జేయుచున్నాను.

ఛం॥ తవ బిషమ మాయా వస సురాసుర
నాగనర అగజగహారే ।
భవ పంథ భ్రమత అమిత దివస
నిసికాల కర్మగునని భరే ।
జే నాథకరి కరునా బిలోకే
త్రిబిధ దుఖతే నిర్బహే ।
భవఖేద ఛేదన దచ్ఛ హామ
కహుఁ రచ్ఛ రామ నమామహే ॥ 2

తా॥ హేహరీ! ప్రభూ! నీ దుస్తరమగు మాయకు వశీభూతులు కాని వారెవరు? దేవతలు, రాక్షసులు, నాగులు, మానవులు, చరాచర జీవులు మొదలుగా గలిగినవెల్లను కాలకర్మ గుణములకు కట్టుబడినవి. రాత్రింబవళ్ళు అనంతకాలచక్రమునుండి దిరుగుచున్నవి. దిరుగుచునేయుండును. సందేహము లేదు. కృపాదృష్టులచే నీవెవరివి అనుగ్రహించెదవో అట్టివారు మాయాజనిత సంసారసముద్రమునుండియు, త్రికాలములనుండి వచ్చు దుఃఖములు వారినుండి తప్పించుకొనెదరు. జన్మమరణలు నశింపజేసి మమ్మేల గాపాడుము. మీకు నమస్కారము జేయుచున్నాను.

ఛం॥ జేగ్యాన మాన బిమత్త తవ భవహరని భక్తి న ఆదరీ।
తేపాఇ సుర దుర్లభ పదాదపి పరత హామ దేఖ తహారీ ॥
బిస్వాస కరి సబ ఆస పరిహరి దాస తబ జే హోఇ రహే
జపినామ తవబినుశ్రమ తరహిఁ భవనాథసుసమరామ హే॥

తా॥ మిడిమిడి జ్ఞానాభిమానులు సంసారసముద్రమునబడి మునుగుచు నీభక్తిని అనుసరించక దేవదుర్లభమగు పదవిని బొందినను పతనమయ్యెదరు. సర్వవిధములగు కోర్కెలను జంపుకొని నీయందు విశ్వాసముసుంచి నీ నామమును జపించువారు నీదాసులై పరిశ్రమలేకయే సంసారసాగరము నుండి సులభముగ తరించెదరు. అందువలననే మిమ్ముల స్మరించుచుంటిమి.

ఛం॥ జే చరన సివ అజ పూజ్య రజ సుభ పరసి మునిపతినీ తరీ।
నఖ నిర్గతా ముని బందితా త్రైలోక పావని సురసరీ ॥
ధ్వజ కులిస అంకుస కంజ జుత బన ఫిరత కంటక కిన లహే
పద కంజ ద్వంద ముకుంద రామ రమేస నిత్య భజామ హే॥

తా॥ యేచరణకమలముల నిత్యము బ్రహ్మ, శివుడు సేవింతురో కల్యాణములు గలుగజేయు ఆచరణరజోమయ పాదధూళి స్పర్శచే గౌతమ మహర్షి పత్నియగు అహల్య తరించెను. యేచరణ కమలముల నఖముల జ్యోతులను మునిశ్రేష్ఠులు పూజింతురో, త్రిలోకములు పావనముజేయు త్రిపథగామినియగు దేవనది గంగ బయలుదేరినదో. ధ్వజమును, అంకుశమును, వజ్రమును కమలములు మొదలుగాగల శుభచిహ్నములతో నొప్పుచున్నట్టియు, వనములలో విహరించు సమయమున ముళ్ళు గ్రుచ్చుకొనుట చేత గుర్తులు ఏర్పడినవో, ఓముకుందా! ఓరామా। రమాపతీ! మేమెల్లప్పుడు మీపదద్వంద్వముల భజించుచుందుము.

ఛం॥ అవ్యక్త మూలమనాది తరుత్వ చ
చారి నిగమాగమ భనే ॥
పటకంధ సాఖాపంచ
బీసఁ అనేక పర్ణసుమన ఘనే ॥
ఫల జుగల బిధి కటు మధుర
బేలి అకేలి జేహి ఆశ్రిత రహె ।
పల్లవత ఫూలత నవల నిత
సంసార బిటప నమా మహే ॥ 5

తా॥ అవ్యక్తమూలమైన ప్రకృతిప్రవాహము అనాదనుండి ప్రవహించుచున్నది. దీనికి నాలుగువిధములగు తత్వములు ఆరుఅంగములును ఇరువదైదు శాఖలును వేలకువేలు ఆకులును, లెక్కకు మిక్కుటములుగ పుష్పములు గలవు. వీనికి చేదును గలిగించు కాయలును, తీపిని గలిగించు పండ్లునుగలవు వీని అన్నిటికి బోదెమాత్రమొకటియే, అవి అన్నియును మొదలునే ఆశ్రయించి యున్నవి. వీనినుండియే లేచిగుర్లు, ఆకులును, పుష్పములు, ఫలములు పుట్టుచున్నవి. ఆదేవిధముగ సంసారవృక్ష స్వరూపుడవగునీకు మేము నమస్కరించుచున్నాము.

ఛం॥ జే బ్రహ్మ అజమద్వైతమను
భవగమ్య మనపర ధ్యావహీఁ ।
తే కహహుఁ జానహుఁ నాథ హామ
తవ సగున జసనిత గావహీఁ ॥
కరునాయతన ప్రభు సదగునాకర
దేవ యహబర మాగహీఁ ।

మన వచన కర్మ వికార తజి తవ
చరన హమ అనురాగహీం ॥

తా॥ బ్రహ్మ జన్మవిరహితుడు అద్వయుడు కేవలము అనుభవము వలన ధ్యానమువలననే తెలిసకొనబడువాడని జెప్పిరి. ఓస్వామి! మేము నిత్యమును నీ సగుణరూపమును కీర్తించుచుంటిమి ఓకరుణామయ ప్రభూ! ఓసద్గుణాకార!ఓదేవా! మాలో వికారగుణములు నశింపజేసి మనోవాక్కాయ కర్మలద్వారా మీ సేవజేయునట్లు మాకు వరమును దయచేయుమని ప్రార్థించుచుంటిమి.

దో॥ సబకే దేఖత బేదన్హ బినతీకీన్హి ఉదార ।
అంతర్ధాన భఏ పుని గఏ బ్రహ్మ ఆగార ॥ 13

తా॥ చతుర్వేదములే శ్రేష్ఠముగ యిట్లు జెప్పి అంతర్ధానమై బ్రహ్మలోకమున కెడలెను.

దో॥ వైనతేయ సును సంభు తబ ఆఏ జహఁ రఘువీర ।
బినయ కరత గదగద గిరా పూరిత పులక సరీర ॥ 14

తా॥(కాకభుశుండి ఇట్లు జెప్పుచున్నాడు)ఓగరుడుడా! వినుము. రఘురాముడున్నచోటికి పరమశివుడు వచ్చి గద్గదమగు కంఠముతో శ్రీవారిని కీర్తించసాగెను. ఆతని శరీరము పులకరించి తన్మయత నొందుచుండెను.

ఛం॥ జయ రామ రమా రమనం సమనం ।
భవ తాప భయాకుల పాహిజనం ॥
అవధేస సురేస రమేశ విభో ॥
శరనాగత మాగత పాహి ప్రభో ॥ 1

తా॥ ఓరామా! ఓలక్ష్మీపతీ! జన్మ-మరణరూపమనెడు సంసారచక్రమును నశింపజేయువాడా నీకు జయమగుగాక! భయమును, శోకమును, వ్యాకులమును మొదలుగాగల దుఃఖముల నశింపజేయుము. మమ్ముల రక్షింపుము. ఓఅయోధ్యాపతీ! దేవతారక్షక! స్వామీ! హేరమాపతీ! దీనజన బాంధవా! నేను నీకు శరణాగతుడగునట్లు వరమును దయచేయుడని ప్రార్థించుచున్నాడను. ప్రభూ! మమ్ముల రక్షింపుము.

ఛం॥ దససీస బినాసన బీ సభుజా ।
కృతదూరి మహా మహి భూరి రుజా ॥
రజనీచర బృంద పతంగ రహే ।
సర పావక తేజ ప్రచండ దహే ॥

తా॥ పదితలలు, ఇరువది భుజములుగల రావణుని ఆతని సహచరుల నశింపజేసి, భూభారమును హరింపజేసిన శ్రీరామా! రాక్షసకులరూపములనెడు మిడుతలు నీబాణరూపమనెడు ప్రచండాగ్ని యందు బూడిదయ్యెను.

ఛం॥ మహీమండల మండన చారుతరం ।
ధృత సాయక చాప నిషంగ బరం ॥
మద మోహ మహా మమతా రజనీ ।
తమ పుంజ దివాకర తేజ అనీ ॥ 3

తా॥ ఓరామా! ఈ భూమండలమునకే మీరు దివ్యము సుందరము నగు అలంకారులు. శ్రేష్ఠములగు ధనుర్బాణములు తరకసమును ధరించి యుంటిరి. మద మోహములు మమతారూపములనెడు గొప్పవగు అంధకార సమూహముల నశింపజేయుటకు ప్రకాశవంతమైన సూర్యునికిరణముల సమూహముల వంటివాడవు

ఛం॥ మన జాత కిరాత నిపాత కిఏ ।
మృగలోగ కుభోగ సరేన హిఏ ॥
హతినాథ అనాథ ని పాహిహరే ।
బిషయా బన పాఁవర భూలిపరే ॥ 4

తా॥ కాముని రూపమునగల బోయవానిని, మానవ రూపమునగల లేడి హృదయమును అనుభవరూపమను బాణముచే సంహరించితివి. రామా! పాపతాపముల నశింపజేయువాడా! విషయరూపములనెడు వనముల నశింప జేసి, పామరుల, అనాథజీవుల రక్షింప వేడుచున్నాము.

ఛం॥ బహు రోగ బియోగన్హి లోగ హఏ ।
భవ దంఘ్రి నిరాదర కేఫల ఏ ॥
భవ సింధు అగాధ పరే
పదపంకజ ప్రేమ నజే కరతే ॥ 5

తా॥ ప్రజలెల్లరు రోగగ్రస్తులై, విషయవాసనలచే హతులయ్యే దరు. నీ పదచరణములు నిరాదరించినందులకు ఆ ఫలితమును బొందిరి. ఏ మానవుడు నీ పదచరణ కమలముల ప్రేమింపడో వాడు మరల సంసార సముద్రమున పడితీరును.

ఛం॥ అతి దీన మలీన దుఖీనితహీఁ ।
జిన్హ కేఁపద పంకజ ప్రీతినహీఁ ॥
అవలంబ భవంత కథా జిన్హ కేఁ ।
ప్రియసంత అనంత సదా తిన్హ కేఁ ॥ 6

తా॥ నీ చరణకమలములయందు ప్రేమలేనివారు దీనులు, మలినులు, దుఃఖవంతులయ్యేదరు వారికి నీ దివ్యలీలలు, కథలుమాత్రమే ఆధారము. వారికే సాధుమహాత్ములు, భగవానుడు ప్రియులు.

ఛం॥ నహిం రాగ న లోభ న మా న మదా ।
తిన్హ కేం సమవై భవ వా విపదా ॥
ఏహిం తే తవసేవక హోత ముదా ।
ముని త్యాగత జోగ భరోస సదా ॥ 7

తా॥ వారిలో రాగాసక్తులు, లోభము, అభిమానము మదమాత్సర్య ములుగాని ఉండవు వారికి సుఖసంపదలు సమానము. ఋషిలోకవాసులు తపోమయ సాధనవలన సర్వమునొదలెదరు. ప్రయత్న ప్రభావమువలన మీదాసులయ్యేదరు.

ఛం॥ కరి ప్రేమ నిరంతర నేమలి యేం ।
పద పంకజ సేవత సుద్ధ హియేం ॥
సమ మాని నిరాదర ఆదరహీ ।
సబ సంత సుఖీ బిచరంతి మహీ ॥ 8

తా॥ వారు ప్రేమపూర్వకముగ నియమముతో పరిశుద్ధమగు హృదయముతో మీ చరణకమలముల సేవించెదరు. నిరాదరణమును, ఆదరణమును, సమానము అని భావించి భూమండలమునందు సంచరించెదరు.

ఛం॥ ముని మానస పంకజ భృంగ భజే ।
రఘువీర మహారన ధీర అజే ॥

తవనామ జపామి నమామిహరీ ।
భవరోగ మహాగదమాన అరీ ॥ 9

తా॥ ఋషిశ్రేష్ఠుల మనోరూపకమలములనెడి ఓ భ్రమరస్వరూపా ! యుద్ధవీరుడా! జయింపవీలుగాని పరాక్రమముగల రఘురామా! నేను నీకు దాసుడను నిన్ను భజించుచున్నాను, ఓహరీ! నీనామమును జపించుచుంటిని నమస్కరించుచుంటిని. జనన-మరణ రూపమనెడు సంసారచక్రమను రోగమునకు దివ్యమగు గొప్ప ఔషధమువంటి వాడవు. అభిమానమునకు విరోధుడవు.

ఛం॥ గునశీలు కృపా పరమాయతనం ।
ప్రనమామి నిరంతర శ్రీరమనం ॥
రఘునంద నికందయ ద్వంద్వఘనం ।
మహిపాల బిలోకయ దీనజనం ॥ 10

తా॥ ఓరామా! గుణశీలములకు, దయానుగ్రహములకు సముద్రునివంటివాడవు. నీవు లక్ష్మీదేవికి భర్తవు. సర్వకాల సర్వావస్థలయందు నీకు నమస్కరించుచున్నాను. ఓ రఘురామా! జనన-మరణముల, సుఖ-దుఃఖముల, రాగ-ద్వేషములతో గూడిన ద్వంద్వముల నాశనము జేయుడు భూభారము వహించుము. పాలించుము. ఈదీనజనులందనుగ్రమును జూపుము.

దో॥ బార బార బర మాగఉఁ హరషి దేహు శ్రీరంగ ।
పదసరోజ అనపాయనీ భగతి సదా సతసంగ ॥ 14

తా॥ మీచరణకమలములందు అచంచలమగు భక్తిని, సత్సంగమును ఎల్లప్పుడు గలుగజేయుము. ఓ లక్ష్మీపతీ! రామనారాయణా! నాకా వరమును సంతోషముతో అనుగ్రహింపవలసినదిగా మాటిమాటికి ప్రార్థించుచున్నాను.

దో॥ బరని ఉమాపతి రామగున హరషి గఏ కైలాస ।
తబ ప్రభుకపిన్హ దివాఏ సబబిధి సుఖప్రద బాస ॥ 14

తా॥ శ్రీరామచంద్రుని గుణముల వర్ణించి ఉమాపతి సంతోషముతో కైలాసమునకు బయలుదేరెను. శ్రీరామచంద్రుడు వానరులనెల్లర రావించి వారిని తగిన విధముగ సన్మానించి, గౌరవించి ఆనందింపజేసెను.

చౌ॥ సును ఖగపతి యహ కథాపావనీ
త్రిబిధ తాప భవ భయ దావనీ ॥
మహారాజ కర సుభ అభిషేకా ।
సునత లహహిం నర బిరతి బిబేకా ॥ 1

తా॥ ఓగరుడుడా! వినుము. ఈకధ సర్వులకు పవిత్రమును, సుఖ శాంతుల గలుగజేయును. త్రితాపములు, (దైనిక, దైహిక, భౌతిక) జన్మ-మృత్యుభయముల నాశనము జేయును. శ్రీరామచంద్ర మహారాజుయొక్క కల్యాణమయమగు రాజ్యాభిషేక కథలను నిష్కామభావముతో విన్నట్టి మీరు వైరాగ్యమును, జ్ఞానమును గలిగియుందురు

చౌ॥ జే సకామ నర సునహిం జే గావహిం ।
సుఖసంపతి నానా బిధి పావహిం ॥
సుర దుర్లభ సుఖకరి జగమాహీం ।
అంతకాల రఘుపతిపుర జాహీం ॥ 2

తా॥ కోర్కెలు గోరుకొని వినువారు, కీర్తించువారు దేవదుర్లభమగు సుఖముల, భోగముల, బొందెదరు అంత్యకాలమందు శ్రీరామచంద్రుని పరంధామమున కేఁగెదరు.

చౌ॥ సునహిఁ బిముక్త బిరత అరుబిషఈ ।
లహహిఁ భగత గతి సంపతి నఈ ॥
ఖగపతి రామకథా మైఁ బరనీ ।
స్వమతి బిలాస త్రాస దుఖ హరనీ ॥ 3

తా॥ జీవన్ముక్తులు, విరక్తులు, భక్తులు ముక్తిని పొందెదరు ఓపక్షి రాజా! గరుడుడా! నేను నా బుద్ధ్యానుసారముగ రామకథను వర్ణించి చెప్పితిని. ఈ రామకధ జన్మ-మరణములనుండి రక్షించును. దుఃఖముల హరించును.

ఛం॥ బిరతి బిబేక భగతి దృఢకరనీ ।
మోహనదీ కహఁ సుందర తరనీ ॥
నితనవ మంగల కౌసలపురీ ।
హరషిత రహహిఁ లోగ సబ కరని ॥ 4

తా॥ దృఢమగు వైరాగ్యము, వివేకము, భక్తి విశ్వాసముగలవారు మోహరూపమనెడు నదిని సులభముగ దాటెదరు. అయోధ్యాపురమందు నిత్యము మంగళకర ఉత్సవములు జరుగుచుండెను. ప్రజలెల్లరు మిక్కిలిగ ఆనందములు అనుభవించుచుండిరి.

చౌ॥ నితనఇ ప్రీతి రామపద పంకజ ।
సబకేఁ జిన్హహి నమత సివముని అజ ॥
మంగన బహు ప్రకార పహిరాఏ ।
ద్విజన్హ దాన నానా విధి పాఏ ॥ 5

తా॥ శ్రీరామచంద్రుని దివ్యచరణ కమలములకు పరమేశ్వరుడు, ఋషులు, మునిగణములును, సృష్టికర్తయగు బ్రహ్మయు నమస్కరించిరి

వారెల్లరకు వింతలతోగూడిన అనుభూతులు గలుగుచుండెను. విశ్వాసముతో గూడిన ప్రేమ అధికమగుచుండెను. భిక్షుకులకు వివిధ విధములగు వస్త్రములు దానముచేయుటచే వారు ఆనందించి వెళ్ళిరి బ్రాహ్మణులు వివిధ రకములగు వస్తువాహనములు దానములుగ బొందిరి.

దో॥ బ్రహ్మానంద మగన కపి సబకేఁ ప్రభుపద ప్రీతి ।
జాత న జానేదివస తిన్హ గఏ మాస షటబీతి ॥ 15

తా॥ వానరులెల్లరు బ్రహ్మానందమున మునిగి తేలుచుండిరి వారెల్లరకు శ్రీరామచంద్ర మహారాజు చరణములయందు మిక్కిలి ప్రేమగలదు. వారికి రోజులు గడచుట తెలియుటలేదు. ఇట్లు ఆరునెలలు కాలముగడచెను.

చౌ॥ బిసరే గృహ సపనేహుఁ సుధి నహీఁ ।
జిమి పరద్రోహ సంతమన మాహీఁ ॥
తబ రఘుపతి సబ సఖా బోలాఏ ।
ఆఇ సబన్హి సాదర సిరు నాఇ ॥ 1

ఆ ప్రజలెల్లరు వారివారి గృహములు మరచిరి. సాధుమహాత్ముల మనస్సునందు పరులకు అపకారము చేయుదమనెడు భావము గలుగనట్లు స్వప్నములోగూడ వారివారి గృహముల విషయము గుర్తునకు రాలేదు. శ్రీరామచంద్రుడు స్నేహితులనెల్ల బిలిపించెను. వారెల్లరువచ్చి ప్రేమతో నమస్కరించిరి.

చౌ॥ పరమ ప్రీతి సమీప బైఠారే ।
భగత సుఖద మృదుబచన ఉచారే ।
తుమ్హ అతికీన్హి మోరి సేవకాఈ ।
ముఖపర కేహి బిధి కరౌఁ బడాఈ ॥ 2

తా॥ ప్రేమతో శ్రీరామచంద్రుడు వారిని దగ్గరగ కూర్చుండబెట్టు కొని మీరెల్లరు నాకు సేవలుజేసితిరి. మీగొప్పతనమును ఒకనోటితో నేనెటుల జెప్పగలనని పలికెను.

చౌ॥ తాతేమోహి తుమ్హ అతిప్రియలాగె।
మమహిత లాగి భవనసుఖ త్యాగె ॥
అనుజరాజ సంపతి బై దేహీం ।
దేహగేహ పరివార సనేహీం ॥ 3

తా॥ నామేలుగోరి మీరెల్లరు సర్వసుఖముల త్యాగము జేసితిరి. నాకు మిక్కిలి ప్రియులైతిరి తమ్ముడు, రాజ్యము, సంపదలు జానకీదేవి, నా శరీరము, యిల్లు కుటుంబము, స్నేహితులు

చౌ॥ సబ మమ ప్రియనహిం తుమ్హహి సమానా ।
మృషా న కహఉం మోరయహ బానా ॥
సబకేం ప్రియ సేవక యహ నీతి ।
మోరేం అధిక దాస పరప్రీతీ ॥ 4

తా॥ నాకు ప్రియులైనను మీతో సమానులుగారు. ఇదిసత్యము. ఇదే నాస్వభావమైయున్నది. సేవకులను స్వామి ప్రేమించవలెనన్ని నియమమున్నది. నాకు నాదాసులపై ప్రేమగలదు.

దో॥ అబగృహ జాహు సఖా సబ భజేహు మోహిదృఢ నేమ।
సదా సర్వగత సర్వహిత జాని కరేహు అతిప్రేమ ॥ 16

తా॥ సఖులారా ! మీరెల్లరు మీగృహములకు పొండు. ప్రేమతో నన్నే కీర్తించుచుండుము. నేను సర్వవ్యాపకుడనని, సర్వులకు మేలుజేయువాడనని దెలిసికొని ప్రేమతో నుండుము

చౌ॥ సుని ప్రభు బచన మగన సబ భఏ ।
క్రో హామ కహాఁ బిసరి తన గఏ ॥
ఎకటక రహే జోరి కర ఆగే ।
సకహిఁ న కచు కహి అంత అనురాగే ॥ 1

తా॥ శ్రీరామచంద్రుని పలుకులు విని వారెల్లరు ఆనందమగ్నులయిరి. మేమెవరము ? యెక్కడనుంటిమి ? శరీరములను మరచియుండిరి. రెండు చేతులు జోడించుకొని కనురెప్పలు వాల్పక శ్రీరాముని జూచుచుండిరి. అత్యున్నతమగు ప్రేమతో నున్నవారగుటవలన ఏమియు జెప్పజాలకుండిరి.

చౌ॥ పరమప్రేమ తిన్హ కర ప్రభు దేఖా ।
కహా బిబిధి బిధి గ్యాన బిసేషా ॥
ప్రభు సన్ముఖ కఛు కహన న పారహిఁ ।
పుని పుని చరన సరోజ నిహారహిఁ ॥ 2

తా॥ శ్రీరామచంద్ర ప్రభువు వారిని ప్రేమతో జూచి, విశేషమగు జ్ఞానము నుపదేశించెను. వారేమియు పలుకజాలకుండిరి అనేకపర్యాయములు ప్రభువు చరణములపై బడసాగిరి,

చౌ॥ తబ ప్రభు భూషన బసన మగాఏ ।
నానారంగ అనూప సుహాఏ ॥
సుగ్రీవహి ప్రథమహిఁ పహిరాఏ ।
బసన భరత నిజహాథ బనాఏ ॥ 3

తా॥ శ్రీరామచంద్ర ప్రభువపుడు వివిధరకముల సుందరములగు వస్త్రములు దెప్పించెను భరతుడు స్వయముగ తనచేతులతో ముందుగ సుగ్రీవున కలంకరించెను.

చౌ॥ ప్రభు ప్రేరిత లఛిమన పహిరాఏ ।
లంకాపతి రఘుపతి మన భాఏ ॥
అంగద బైఠ రహా నహిం డోలా ।
ప్రీతి దేఖి ప్రభు తాహి న బోలా ॥ 4

తా॥ శ్రీరామచంద్ర మహారాజు ఆజ్ఞానుసారము లక్ష్మణుడు విభీషణుని భూషణముల వస్త్రములచే అలంకరించెను. అవి శ్రీరామచంద్రునకు ప్రియమును గలుగజేయునవై యుండెను. అంగదుడు కూర్చుండియే యుండెను. అతనికి ప్రపంచముయొక్క స్పృహయే లేకుండెను అతని యొక్క దృఢమగు నియమమును ప్రేమను జూచి శ్రీరామచంద్రుడు దగ్గరకు పిలువలేదు.

దో॥ జామవంత నీలాది సబ పహిరాఏ రఘునాథ ।
హియఁ ధరి రామ రూప సబ చలే నాఇ పదమాథ ॥ 17

తా॥ శ్రీరాముడు జాంబవంతునకు, నీలునకు మిగిలిన వారికి ఆభరణములు, వస్త్రములు అలంకరించెను. వారెల్లరు శ్రీరామచంద్రుని రూపమును హృదయమున ధరించి నమస్కరించి వెడలిరి.

దో॥ తబ అంగద ఉఠి నాఇ సిరు సజల నయన కరి జోరి ।
అతి బినీత బోలేఉ బచన మనహుఁ ప్రేమరస బోరి॥ 17

తా॥ అంగదుడు లేచి తలవంచి నమస్కరించి, కన్నుల ఆనంద బాష్పములచే, నిండియుండగ రెండుచేతులు జోడించుకొని వినమ్రుడై ప్రేమాంబుధిలో మునిగినవాడై మధురము, కోమలమునగు పలుకులిట్లు పలుకసాగెను.

చౌ॥ సును సర్వగ్య కృపాసుఖ సింధో ।
దీన దయాకర ఆరత బంధో ॥
మరతీ బేర నాథ మోహి బాలీ ।
గయఉ తుమ్హారేహిం కొఛేం ఘాలీ ॥ 1

తా॥ సర్వవ్యాపీ ! దయాసుఖసాగరా ! దీనులయందనుగ్రహము జూపువాడా ! రామా! దయచేసి వినుము. మాతండ్రి వాలి చనిపోవునపుడు మీ ఒడియందు నన్నుంచెను.

చౌ॥ అసరన సరన బిరదు సంభారీ ।
మోహిజని తజహు భగత హితకారీ ॥
మోరేం తుమ్హ ప్రభు గురు పితు మాతా ।
జాఉఁ కహాం తజి పద జలజాతా ॥ 2

తా॥ భక్తుల కోర్కెలు నెరవేర్చు రామచంద్రా! శరణు వేడిన వారిని రక్షించువాడవని బిరుదుగలదు. ఆ మాటను గుర్తుకు దెచ్చికొని నన్ను విడవలదు. నీవు నాకు గురుడవు. తల్లివి, తండ్రివి, దైవమున్నునై యున్నావు. సర్వము నీవై యున్నావు. నీచరణ కమలముల వదలి నేనెక్కడకు పోగలను?

చౌ॥ తుమ్హరి బిచారి కహహు నరనాహా ।
ప్రభు తజి భవన కాజ మమ కాహా ॥

బాలక గ్యాన బుద్ధి బల హీనా ।
రాఖహు సరన నాథ జన దీనా ॥ 3

తా॥ అనుగ్రహింపుము. ప్రభువు వదలిపెట్టిన నాకేమి పనియుండును? జ్ఞానము, బుద్ధిబలము లేని ఈ బాలుని భక్తజన సేవకుడని భావించి మీ అండన ఉండనిమ్ము.

చౌ॥ నీచ టహాల గృహ కై నబ కరిహఉఁ ।
పద పంకజ బిలోకి భవ తరిహఉఁ ॥
అసకహి చరన పరేఉ ప్రభు పాహీ !
అబ జని నాథ కహహు గృహ జాహీ ॥ 4

తా॥ నేను నీగృహమందు సర్వవిధములగు కార్యములు జేయగలను. నీచరణ కమలముల జూచి జూచి సంసారసముద్రమును దాటగలను.

దో॥ అంగదబచన బినీత సుని రఘుపతి కరునా సీంవ ।
ప్రభు ఉఠాఇ ఉరలాయఉ సజల నయన రాజీవ ॥

తా॥ అంగదుని వినయ సంపన్నములగు నాపలుకులు కరుణాసముద్రుడగు శ్రీరామచంద్రమహారాజు విని వానిని లేవదీసి హృదయమునకు హత్తుకొనెను. శ్రీరామచంద్రునకు నేత్రములవెంట ప్రేమాశ్రువులు స్రవించసాగెను.

దో॥ నిజ ఉరమాల బసన మని బాలితనయ పహిరాఇ ।
బిదా కీన్హి భగవాన్ తబ బహు ప్రకార సముఝాఇ ॥

తా॥ అప్పుడు శ్రీరామచంద్రుడు తన హృదయమునగల వనమాలను, వస్త్రములను, రత్నములచే కూర్చబడినమాలను, వాలిపుత్రుడగు అంగదునిచే ధరింపజేసి, వివిధవిధముల దెలియజెప్పి వానిని పంపి

చౌ॥ భరత అనుజ సౌమిత్రి సమేతా ।
పఠవన చలే భగత కృత చేతా ॥
అంగద హృదయఁ ప్రేమ నహిఁ థోరా ।
ఫిరి ఫిరి చితవ రామ కీఁ ఓరా ॥ 1

తా॥ భరతుని, శత్రుఘ్నుని, లక్ష్మణుని తన భక్తులను వెదకి తీసుకొని వచ్చుటకై బంపెను. అంగదునకు వర్ణింపవీలుగాని ఆనందము హృదయమందుగలదు. ఆతడు మాటిమాటికి వెనుదిరుగుచు శ్రీరామ చంద్రులవారిని దర్శించుచుండెను.

చౌ॥ బార బార కర దండ ప్రనామా ॥
మన అస రహాన కహహిఁ మోహి రామా ।
రామ బిలోకని బిలోకని చలనీ ।
సుమిరి సుమిరి సోచ త హాఁస మిలనీ ॥ 2

తా॥ మాటిమాటికి షాష్టాంగ దండప్రణామముల జేయుచుండెను. శ్రీరామచంద్ర మహారాజు నన్ను తనవద్ద యుంచుకొనెదనని చెప్పినాడు. (మనస్సున అనుకొనసాగెను.) శ్రీరాముని జూచినది, మాట్లాడినది, వారి వెంట నడచినది, కలసినపుడు నవ్వుకొనిన విషయములు గుర్తుకు దెచ్చి కొని బాధపడుచుండెను.

చౌ॥ ప్రభు రుఖ దేఖి బినయ బహు భాషీ ।
చలేఉ హృదయఁ పద పంకజ రాఖీ ॥
అతి ఆదర సబ కపి పఠంచాఏ ॥
భాయిన్హ సహిత భరత పుని ఆఏ ॥ 3

తా॥ శ్రీరాముని మాటిమాటికి జూచుచు, వినయములగు మాటలు చెప్పుచు తన హృదయకమలమునందు భగవానుని దివ్యచరణ కమలముల నుంచుకొని అంగదుడు బయలుదేరెను. వినయసంపదగల భరతుడు తమ్ముల సహితుడై వానరులనెల్ల రకమగొని, వెంటనిడుకొని ప్రభువువద్దకు వచ్చెను.

చౌ॥ తబ సుగ్రీవ చరన గహి నానా।
భాంతి బినతు కీన్హా హనుమానా॥
దిన దసకరి రఘుపతి పద సేవా!
పుని తబ చరన దేఖిహాఉఁ దేవా॥

తా॥ హనుమంతుడు సుగ్రీవుని చరణకమలముల పట్టుకొని యిట్లు పలికెను రాజా నేను పదిదినముల వరకు శ్రీరాముని చరణకమలముల సేవించుకొని మీదర్శనమునకు వచ్చెదను.

చౌ॥ పున్య పుంజ తుమ్హ పవన కుమారా।
సేవహు జాఇ కృపా ఆగారా॥
అస కహి కపి సబ చలే తురంతా।
అంగద కహాయి సునహు హనుమంతా॥

తా॥ (సుగ్రీవుడిట్లు పలికెను.) హే పవనకుమార! నీవు పుణ్యాత్ముడవు. శ్రీరామచంద్ర భగవానుడు నిన్ను సేవయందుంచుకొనెను. వానరులెల్లరు వారివారి ధామములకు బయలుదేరిరి. (అంగదుడిట్లు పలికెను.) హనుమాన్! వినుము.

దో॥ కహేహు దండవత ప్రభు సేఁతుమ్హ హి కహాఁ కర జోరి।
బార బార రఘునాథ కహి సురతి కరాఏహు మోరి॥ 19

తా॥ నేను రెండుచేతులెత్తి నమస్కరించితినని శ్రీరామచంద్రునకు తెలుపుము. దీనజనబాంధవునకు మాటిమాటికి నన్ను గుర్తుజేయుము.

దో॥ అసకహి చలేఉ బాలసుత ఫిరి ఆయుఉ హానుమంత ।
తాసు ప్రీతి ప్రభు సనకహీ మగనభఎ భగవంత॥ 19

తా॥ అనిజెప్పి వాలిపుత్రుడగు అంగదుడు వెడలెను. పవన్‌కుమార్ వచ్చి ప్రభువులవారికి వారివారి ప్రేమామృతపు పలుకులు వినిపించెను.

దో॥ కులిసహు చాహి కఠోర అతికోమల కుసుమహు చాహి।
చిత్త ఖగేస రామ కర సముఝి పర కహు కాహి॥19

తా॥ (కాకభుశుండి జెప్పుచున్నాడు.) ఓ గరుడజీ। శ్రీరామచంద్రుని హృదయము వజ్రమునకంటె కఠోరమైనదియు పుష్పములకంటె సున్నితమ్ము మృదువైనది. ఏతచ్ఛిత్తమును దెలిసికొనగోరుచుంటివో చెప్పుము.

చౌ॥ పునికృపాల లియో బోలి నిషాదా ।
దీన్హే భూషన బసన ప్రసాదా ॥
జాహు భవన మమ సుమిరన కరేహూ ।
మన క్రమ బచన ధర్మ అనుసరేహూ ॥

తా॥ వెంటనే నిషాదరాజును శ్రీరామచంద్రుడు పిలిపించి వానికి, ఆభరణములు, వస్త్రములు ప్రసాదమును యిచ్చి మీయింటికి వెడలుము. నన్ను స్మరించుకొనుచు, మనో, వాక్కాయ, కర్మల ధర్మానుసారముగ నడచుకొనుము.

చౌ॥ తుమ్హ మమసఖా భరతసమ భ్రాతా ।
సదా రహేహు పుర ఆవత జాతా ॥

బచన సునత ఉపజా సుఖ భారీ ।
పరే ఉ చరన భరి లోచన భారీ ॥ 2

తా॥ నీవు నాకు స్నేహితుడవును భరతసమానుడవునైయున్నావు. అయోధ్యకు ఎల్లప్పుడును రాకపోకలు సలుపుమని శ్రీరామచంద్రుడనుటచే హృదయమందు సంతోషము గలిగెను. నేత్రములు రెండును ప్రేమామృతజలములచే నిండియుండెను. గుహుడు శ్రీరామచంద్రుని దివ్యచరణములపై బడెను.

చౌ॥ చరన నలిన ఉరధరి గృహ ఆవా ।
ప్రభు సుభాఉ పరి జనన్హి సునావా ॥
రఘుపతి చరిత దేఖి పురబాసీ ।
పునిపుని కహహిం ధన్య సుఖరాసీ ॥ 3

తా॥ భగవంతుని దివ్యచరణ కమలముల హృదయమందు ధరించి నిషాదరాజు యింటికివచ్చి తన కుటుంబములోని వారికి శ్రీరామచంద్రుని స్వభావములను తెలియజెప్పెను. అయోధ్యాపురములోని వారు శ్రీరామచంద్రుని దర్శించి, శ్రీవారి కథలు జెప్పుకొనుచు సుఖసంపదలకు నిలయుడని ధన్యుడని చెప్పుకొనుచు ఆనందముగ నుండిరి.

చౌ॥ రామరాజ బైఠేం త్రైలోకా ।
హరషిత భఏ గఏ సబ సోకా ॥
బయరు న కర కాహూ సన కోఈ ॥
రామ ప్రతాప బిషమతా ఖోఈ ॥ 4

తా॥ శ్రీరామచంద్రుని పట్టాభిషేకము జరిగిన తదుపరి త్రిలోకవాసులు ఆనందించిరి. వారికి దుఃఖము నశించెను. విరోధ స్వభావముగల

వారెవ్వరును లేకుండిరి. శ్రీరామచంద్ర మహారాజు ప్రభావము వలన ఆంతరంగిక భేదములు తొలగెను. ప్రజలు ఆనందముతో నుండిరి.

దో॥ బరనాశ్రమ నిజ నిజ ధర్మ నిరత బేద పథలోగ ।
చలహిం సదా పావహిం సుఖహి నహిం భయసోక న రోగ

తా॥ ప్రజలెల్లరు వారివారి వర్ణాశ్రమముల ధర్మముననుసరించి ఎల్లపుడు వేదమార్గమున ప్రవర్తిల్లుచు సుఖ-సంపదలు బొందుచుండిరి. భయము, దుఃఖము రోగబాధలు లేకుండిరి. ఎల్లపుడానందమున ఉండిరి.

చౌ॥ దైహిక దైవిక భౌతిక తాపా ।
రామ రాజ నహిం కాహుహి బ్యాపా ॥
సబ నర కరహిం పరస్పర ప్రీతీ ।
చలహిం స్వధర్మ నిరత స్మృతి నీతీ ॥ 1

తా॥ రామరాజ్యమందు దైహిక, దైవిక భౌతికతాపములు, ఆధి వ్యాధులుగాని లేక ప్రజలెల్లరు సుఖముగ సంతోషముగనుండి ఒకరినొకరు ప్రేమించుకొనుచుండిరి. వేదములలో చెప్పిన విధానముననుసరించి నీతి మర్యాదలు పాటించుచు వారి-వారి ధర్మములు అనుసరించుచుండిరి.

చౌ॥ చారిఉ చరన ధర్మ జగమాహీ ।
పూరి రహా సపనేహుం అఘనాహీం ॥
రామ భగతి రత నర అరు నారీ ।
సకల పరమ గతికే అధికారీ ॥

తా॥ నాలుగుపాదముల ధర్మము జగత్తున వ్యాపించినది. స్వప్నమందుగూడా పాపములేదు. స్త్రీపురుషులెల్లరు రామభక్తి పరాయణులును, మోక్షమునకు అధికారులునై యుండిరి.

చౌ॥ అల్పమృత్యు నహిం కవని ఉ పీరా ।
సబ సుందర సబ బిరుజ నరీరా ॥
నహిం దరిద్ర కోఉ దుఖి న దీనా ।
నహిం కోఉ అబుధ న లచ్ఛన హీనా ॥ 3

తా॥ బాల్యావస్థలో మృత్యువుండదు. ఎవరికినీ పీడలుండవు. సర్వులు ఆరోగ్యముతో నుండెదరు రోగగ్రస్థులుండరు. దుఃఖితులు, దరిద్రులు, దీనులు, మూర్ఖులుండరు. శుభలక్షణ సంపన్నులు. ప్రజలెల్లరు సద్గుణములతో నుండెదరు.

చౌ॥ సబ నిర్దంభ ధర్మరత పునీ ।
నర అరు నారి చతుర సబ గునీ ॥
సబ గునగ్య పండిత సబ గ్యానీ ।
సబ కృతగ్య నహిం కపట సయానీ ॥

తా॥ ప్రజలు నిరాడంబరులు. ధర్మపరాయణులును, పుణ్యాత్ములు స్త్రీపురుషులెల్లరు చతురులు, గుణవంతులుగ నుండిరి. వారెల్లరును సద్గుణముల ఆదరించువారలు, పండితులును జ్ఞానులునై యుండిరి. ఇతరులకు మేలుజేయువారుగ నుండరి. కపటము చతురత ధూర్తలక్షణములు లేవు.

దో॥ రామరాజ నభ ఖగేస సును చరాచర జగమాహిం ।
కాల కర్మ సుభాఉ గునకృత దుఖ కాహుహి నాహిం ॥

తా॥ (కాకభుశుండి జెప్పుచున్నాడు) ఓపక్షిరాజా! గరుడజీ! శ్రీరాముని రాజ్యమందు జడచేతనములు సర్వజగత్తులోను కాల, కర్మ, స్వభావముల గుణములచే ఉత్పన్నమయినట్టి దుఃఖము మొదలుగా గల ఏ బాధలచే యెవరును బాధపడలేదు.

చౌ॥ ... మి స ప్త సాగర మేఖలా ।
పక భూప రఘుపతి కోసలా ॥
భువన అనేక రోమ ప్రతి జాసూ ।
యహ ప్రభుతా కఛు బహుత న తాసూ ॥ 1

తా॥ సప్తసముద్రములచే చుట్టబడిన అయోధ్యాపురమునకు శ్రీరామచంద్రుడు చక్రవర్తి. వారి రోమ రోమమున అనేక బ్రహ్మాండములు గలవు. వానికి సప్తద్వీపములపై అధిపత్యమొక లెక్కలోనిదగాదు.

చౌ॥ సో మహిమా సముఝత ప్రభు కేరీ ।
యహ బరనత హీనతా ఘనేరీ ॥
సోఉ మహిమా ఖగేస జిన్హ జానీ ।
ఫిరి ఏ హిం చరిత తిన్హహుం రతి మానీ । 2

తా॥ సప్తద్వీపములకు మాత్రమే శ్రీరామచంద్రుడు రాజని యెఱుంగుట మహాదోషము. సప్తసముద్రములు చుట్టుగాగల సప్తద్వీపములకు అతడే చక్రవర్తి. ఓ గరుడుడా ! వారిమహిమలు దెలిసిన వారు ప్రేమలో మునిగి దేలియాడుచుందురు.

చౌ॥ సో ఉ జానే క ర ఫల యహ లీలా ।
కహహిం మహాముని బర దమసీలా ॥
రామ రాజ కర సుఖ సంపదా ।
బరని న సకయి ఫనీస సారదా ॥ 3

తా॥ మహిమలు దెలిసికొనిన యింద్రియనిగ్రహము, గలుగునని మహాఋషులు దెప్పిరి. శ్రీరాముని రాజ్యమునగల సుఖసంపదల అనంత శేషుడును, సరస్వతీదేవియుగూడ వర్ణింపలేదు.

చౌ॥ సబ ఉదార సబ పర ఉపకారీ।
బిప్ర చరన సేవక నర నారీ॥
ఏకనారి బ్రత రత సబ ఝూరి।
తే మన బచ క్రమ పతి హితకారి.

తా॥ స్త్రీపురుషులెల్లరు ఉదారులును పరోపకారులునై యుండిరి. వారెల్లరు భక్తుల బ్రాహ్మణుల చరణసేవలు జేయుచుండిరి. స్త్రీలెల్లరు పతిభక్తి పరాయణులై మనోవాక్కాయ కర్మలద్వారా సేవలు జేయుచుండిరి

దో॥ దండ జతిన్హ కరభేద జహాఁ నర్తక నృత్య సమాజ।
జీతహు మనహి సునిఅ అస రామచంద్రకే రాజ॥ 21

తా॥ శ్రీరామచంద్ర మహారాజు పరిపాలనలో దండనా విధానములు మహాత్ములు జేసెడివారు. (సన్యాసులజేతిలో దండము నిరుపయోగముగ నుండెడిది. అనగా తప్పులు జేయువారులేరు. దండనలేదని భావము) ప్రజలు అనుకూలముగ నుండుటచే ఒకరియందొకరికి భేదములేదు. జీతో శబ్దము కేవలము మనస్సును జయించుటయని మాత్రమే అర్థము. అపరాధులెవరును లేరు. శిక్షలు పడువారునులేరు 'దండ' శబ్దము కేవలము సన్యాసుల జేతులలోనుండు కఱ్ఱ మాత్రముగనే యుండిపోయెనని భావము. సర్వులు అనుకూలముగ నుండుటచే విరోధములు లేకుండిరి. నృత్యవిశేషాదులలో, రాగ, తాళశబ్దములకు మాత్రమే భేదశబ్దము వాడబడుచున్నది.

చౌ॥ ఫూలహిఁ ఫరహిఁ సదా తరుకానన।
రహహిఁ ఎకసంగ గజ పంచానన॥
ఖగ మృగ సహజ బయరు బిసరాఈ।
సబన్హి పరస్పర ప్రీతి బఢాఈ॥ 1

తా॥ అడవులయందు వృక్షములెల్లపుడు పుష్పముల ఫలములచే నిండియుండెను ఏనుగులు, సింహములు విరోధభావములు మరచి ఒకదాని ప్రక్కన మరొకటుండెను. పశుపక్ష్యాదులు వాని స్వభావసిద్ధమగు వైరములనొదలి కష్టముల యందొక దానినొకటి ప్రేమించుకొనుచుండెను.

చౌ॥ కూజహిం ఖగమృగ నానా బృందా ।
అభయ చరహిం వనకరహిం అనందా ॥
సీతల సురభి పవన బహామందా ।
గుంజత అలి లై చలి మకరందా ॥ ౭

తా॥ పక్షులు తీయతీయని కూతలుకూయుచుండెను. వివిధరకముల పశువులు గుంపులుగుంపులుగ నిర్భయముగ అడవులలో విహరించసాగెను. వాటి ఆనందము వర్ణనాతీతము. చల్లని, మందము, సువాసనలతోగూడిన గాలులు వీచసాగెను. తుమ్మెదలు పుష్పములలోని మకరందమును గ్రోలి రొదజేయుచు వెడలుచుండెను.

చౌ॥ లతా బిటప మాగేం మధు చవహీం ।
మన భావతో ధేను పయస్రవహీం ॥
ససి సంపన్న సదా రహ ధరనీ ।
త్రేతాం భఇ కృత జుగకై కరనీ ॥

తా॥ మారేడుచెట్లు మొదలుగా గలిగిన వృక్షములు మకరందమును బొట్లుబొట్లుగ స్రవింపజేయుచుండెను ఆవులు కోరినన్ని పాలు ఇచ్చుచుండెను. పొలములు ఎల్లపుడు పంటలచే శోభించుచుండెను. త్రేతాయుగము సత్యయుగమువలె నుండెను.

చౌ॥ ప్రగటీం గిరిన్హ బివిధమని ఖానీ ।
జగ దాత్మా భూప జగ జానీ ॥
సరితా సకల కహ హిం బర బారీ ।
సీతల అమల స్వాద సుఖ కారీ ॥ 4

తా॥ జగదాత్మ స్వరూపుడని, సర్వజగములకు చక్రవర్తియని తెలిసి కొని పర్వతములు వివిధ రకములుగల మణులను ప్రకటింపజేసెను. నదు లన్నియు శ్రేష్ఠము, శీతలము, నిర్మలము, సుఖములు ఆనందమును గలుగ జేయు తీయని జలమును ప్రవహింపజేయు చుండెను.

చౌ॥ సాగర నిజ మరజాదాం రహిహీం ।
డారహిం రత్న తిన్హహి నర లహహీం ॥
సరసిజ సంకుల సకల తడాగా ।
అతి ప్రసన్న దస దిసా బిభాగా ॥ 5

తా॥ సముద్రములు గతులు దప్పలేదు. అలలుద్వారా రత్నములను ఒడ్డునకు వేయుచుండ మానవులు వానిని పొందుచుండిరి. చెరువులన్ని కమలపుష్పములచే నిండి అందముగ నుండెను. పదిదిక్కుల యందు సుఖశాంతులుండెను.

దో॥ బిధు మహి పూర మయూఖన్హి
రవి తప జేతనేహి కాజ ।
మాగే బారిద దేహి జల
రామ చంద్రకే రాజ ॥ 23

తా॥ శ్రీరామచంద్రుని రాజ్యమునందు అమృతకిరణరూప ధారలచే చంద్రుడు భూమాతకు ఆనందమును గలుగజేయుచుండెను సూర్యుని వేడి తట్టుకొనలేని వారికి వర్షపుధారలు పడుచుండెను.

చౌ॥ కోటిన్హ బాజి మేధ ప్రభు కీన్హే ।
దాన అనేక ద్విజన్హ కహఁ దీన్హే ॥
శృతి పథ పాలక ధర్మధురంధర ।
గునాతీత అరు భోగ పురంధర ॥ 1

తా॥ శ్రీరామచంద్ర మహారాజు కోట్లకొలది అశ్వమేధ యజ్ఞములేసి బ్రాహ్మణులకు భూరిదక్షిణల నొసంగెను. వేదమార్గము ననుసరించెడివాడు ధర్మమున నడిచెడువాడు, సత్వ, రజ స్తమో గుణాతీతుడు; ఐశ్వర్యమున ఇంద్రునితో సమానుడైయున్నాడు.

చౌ॥ పతి అనుకూల సదా రహ సీతా ।
శోభా ఖాని సుసీల బినీతా ॥
జానతి కృపాసింధు ప్రభుతాఈ ।
సేవతి చరన కమల మన లాఈ ॥ 2

తా॥ శోభాసంపన్నురాలు, సశీలవతియగు శ్రీసీతాదేవి ఎల్లప్పుడు భర్తకు అనుకూలముగ నుండెడిది. ఆమెకు శ్రీరామచంద్ర ప్రభువులవారి మహాత్వము బాగుగా దెలియును మనస్సును వారియందు లగ్నమొనర్చి చరణసేవలు జేయుచుండెను.

చౌ॥ జద్యపి గృహఁ సేవక సేవకినీ ।
బిపుల సదా సేవా బిధి గునీ ॥

నిజకర గృహ పరిచర జా కరఈ ।
రామచంద్ర ఆయసు అనుసరఈ ॥ 3

తా॥ రాజమహలునందనేకమంది దాసదాసీ జనులుగలరు. వారెల్లరు శ్రీరామచంద్రుని మహత్వము బాగుగ నెరుగుదురు. సీతాదేవి స్వయముగ యింటిపనులు నెరవేర్చుకొనుచు భర్త ఆజ్ఞలను పాలించెడిది.

చౌ॥ జేహి బిధ కృపాసింధు సుఖ మానఇ ।
సో ఇ కర శ్రీ సేవా బిధి జానఇ ॥
కౌసల్యాది సాసు గృహ మాహీం ।
సేవఇ సబన్హి మాన మద నాహీం ॥ 4

తా॥ శ్రీరామచంద్రునకు సుఖసంతోషములు గలుగనట్లు అభిమానము, మదములేకుండ అత్తలముఖ్వరకు సేవలుజేయుచు సీతాదేవి ఆనందమున ఉండెడిది. ఇది బ్రహ్మకుమాత్రమే దెలియును.

చౌ॥ ఉమా రమా బ్రహ్మాది బందితా ।
జగదంబా సంతత మనిందితా ॥ 5

తా॥ (శివుడు జెప్పుచున్నాడు) ఓఉమా! జానకీదేవి సర్వదేవతా స్వరూపిణి. సర్వగుణ సంపన్నురాలు. బ్రహ్మాది దేవతలు మొదలుగాగల వారెల్లరు ఆమెకు సర్వకాల సర్వావస్థలయందు నమస్కరించుచుందురు.

దో॥ జాసు కృపా కటాచ్ఛు సుర చాహత చితవ నసోఇ ।
రామ పదారవింద రతి కరతి సుభావహి ఖోఇ ॥ 24

తా॥ దేవతలు పరితపించినను వారివైపు జూడక తన మహిమలను వీడి శ్రీరామచంద్రుని దివ్య చరణారవిందములయందు ప్రేమ గలిగి యుండెడిది.

చౌ॥ సేవహిం సానుకూల సబ భాఈ ।
రామ చరన రతి అతి అధి కాఈ ॥
ప్రభు ముఖ కమల బిలోకత రహహీం ।
కబహుం కృపాల హమహి కఛుక కహీం ॥ 1

తా॥ సోదరులెల్లరు శ్రీరామునకు అనుకూలముగనుండి సేవలు జేయుచుండిరి. శ్రీరామచంద్రుని చరణములపై వారికి మిక్కిలి ప్రేమ గలదు. ఎల్లపుడు ప్రభువువారి దివ్యముఖారవిందమునే జూచుచు సేవలు చేయసాగిరి.

చౌ॥ రామ కరహిం భ్రాతన్హ పర ప్రీతీ ॥
నానా భాంతి సిఖా వహి నీతీ ॥
హరషి త రహహిం నగర కే లోగా ।
కరహిం సకల సుర దుర్లభ భోగా ॥ 2

తా॥ శ్రీరామచంద్రుడు తమ్ములను ప్రేమించుచు వారికనేకవిధముల నీతిని బోధించుచుండెను. నగరములోనె ప్రజలానందించుచు దేవదుర్లభ మగు భోగభాగ్యముల ననుభవించుచుండిరి.

చౌ॥ అహనిసి బిధిహి మనావత రహహీం ।
శ్రీరఘువీర చరన రతి రహహీం ॥
దుఇ సుత సుందర సీతాం జాఏ ।
లవకుస బేద పురానన్హ గాఏ ॥ 3

తా॥ వారు రాత్రింబవళ్ళు బ్రహ్మధ్యానమందుండి శ్రీరాముని చరణములందు ప్రీతి గలిగియుండిరి. సీతాదేవికి లవుడు కుశలుడను యిర్వురు పుత్రులు గలిగిరి. వారికీర్తిని వేద, పురాణములలో వర్ణింపబడియుండెను.

చౌ॥ దోఉ బిజఈ బి నఈ గునసుందర ।
హొరి ప్రతిబింబ మనహుఁ అతి సుందర ॥
దుఇ దుఇ సుత సబ భ్రాతిన్హ కేరే ।
భఏ రూప గునశీల ఘనేరే ॥ 4

తా॥ వారిరువురును ప్రఖ్యాత యుద్ధవీరులు. వినయసంపదలు గల వారు సుందరాకారులు జూమవారలకు శ్రీహరి ప్రతిబింబమా అనునట్లుం డెను. ఆ నల్వురన్నదమ్ములకు యిరువురిరువురు పుత్రులు ఉదయించిరి. వారెల్లరు సుందరాకారులును, గుణ, శీలములుగల వారై యుండిరి.

దో॥ గ్యాన గిరా గోతీత అజమాయా గున పార ।
సోఇ సచ్చిదానంద ఘన కర నర చరిత ఉదార ॥ 25

తా॥ జ్ఞాన సంపన్నులు, సరస్వతీ నిలయులు. యింద్రియాతీతులు. జన్మరహితులు. మాయను, మనస్సును, త్రిగుణము జయించెను. సచ్చిదానంద స్వరూపుడగు భగవానుడు శ్రేష్ఠపంతపుగు నరలీలలు జేసెను.

చౌ॥ ప్రాతకాల సరఉ కరి మజ్జన ।
బైఠహిఁ సభాఁ సంగ ద్విజ సజ్జన ॥
బేద పురాన బసిష్ట బఖానహిఁ ।
సునహిఁ రామ జద్యపి సబ జానహిఁ ॥ 1

తా॥ ప్రాతఃకాలముల సరయూనదిలో స్నానపానములు ముగించుకొని బ్రాహ్మణులు సజ్జనులవెంట సభయందు కూర్చుండిరి. వసిష్ఠులవారు వేదపురాణములలోగల కథలు జెప్పుచుండెడివారు. శ్రీరామచంద్రుని కాకథలు దెలిసినను విని ఆనందించెడివారు,

చౌ॥ అను జన్మా సంజాత భోజన కరహీం ।
దేఖి సకల జననీ సుఖ భరహీం ॥
భరత సత్రుహన దోనఉ భాఈ ।
సహిత పవనసుత ఉపబన జాఈ ॥ 2

తా॥ శ్రీరాముడు సోదరసహితుడై భోజనము జేసెడివాడు. వారని జూచి తల్లులెల్లరు ఆనందించెడివారు. భరతుడు, శత్రుఘ్నుడు, హనుమంతుడు తోటలోనికి వెడలి—

చౌ॥ బూఝహీం బైఠి రామ గున గాహా ।
కహ హనుమాన సుమతి అవగాహా ॥
సునత బిమల గున అతి సుఖ పావహీం ।
బహురి బహురి కరి బినయ కహా వహీం ॥ 3

తా॥ అక్కడకూర్చుండి శ్రీరాముని గుణముల, కథలు చెప్పుకొనుచుండిరి. హనుమంతుడు తన బుద్ధ్యానుసారముగ భగవానుని గుణముల గానము జేసెడివాడు శ్రీరామునియొక్క నిర్మలమగు గుణముల విని ఆ యిరువురన్నదమ్ములు అత్యంతమగు సుఖమును బొందెడువారు. వినయముగ మాటిమాటికి నమస్కరించెడువారు.

చౌ॥ సబ కేంగృహ హోహీం పురానా ।
రామ చరిత పావన బిధి నానా ॥
నర అరు నారి రామ గున గానహీం ।
కరహీం దివస నిసి జాత నజానహీం ॥ 4

తా॥ వారివారి యిండ్లయందు పురాణములు, పవిత్రవంతములగు శ్రీరాముని కథలు గానము జేయుచుండిరి. స్త్రీపురుషులు తన్మయులై రాత్రింబవళ్ళను విషయమునే మరచిరి.

దో॥ అవధ పురీ బాసిన్హ కరసుఖ సంపదా సమాజ ।
సహస సేష నహిం కహిం సకహిం జహం నృప రామ
బిరాజ ॥ 26

తా॥ శ్రీరామచంద్రుడు రాజై పరిపాలింప అయోధ్యాపుర నివాసులకు గల సుఖసంపదలకును అనంతశేషుడైనను వెయ్యిముఖములతో వర్ణింపజాలడు.

చౌ॥ నారదాది సనకాది మునీసా ।
దరసన లాగి కోసలాధీసా ॥
దిన ప్రతి సకల అయోధ్యా ఆవహీం ।
దేఖి నగరు బిరాగు బిసరావహీం ॥

తా॥ నారదుడు, సనకుడు మొదలుగాగల ఋషిశ్రేష్ఠులు శ్రీరామచంద్ర మహారాజు దర్శనార్థము ప్రతినిత్యము వచ్చెడివారు. వారాదివ్యమగు నగరవైభవమును జూచి వైరాగ్యమును మరచెడువారు

చౌ॥ జాత రూప మనిరచిత అటారీం ।
నానారంగ రుచిర గచ ఢారీం ॥
పుర చహుం పాస కోట అతి సుందర ।
రచే కంగూర రంగ రంగ బర ॥ 2

తా॥ బంగారముచే, రత్నములచే పొదుగబడిన దివ్యభవనములు గలవు. మణులు, రత్నములు వివిధరంగులతో ప్రకాశించుచుండెను. నగ

మునకు నాలుగువైపుల సుందరమగు ప్రహరీగోడలను నిర్మించిరి. వావి మీద రంగురంగులతో బొమ్మలు చెక్కిరి.

చౌ॥ నవగ్రహ నికర అనీక బనాఈ ।
జన ఘేరీ అమరావతి ఆఈ ॥
మహి బహు రంగ రచిత గచకాంచా ।
జో బిలోకి మునివర మన నాచా ! 3

తా॥ నవగ్రహములే పేనలు. ఆపేనలు అమరావతిని ముట్టడించుటకు వచ్చుచుండినట్లుండెను. భూమిపైన, కొండలపైన దివ్యములగు రత్నపుగనులు గలవు. ఆ గనులను జూచి మునుల మనస్సులు సహితము భ్రమను జెందుచుండెను.

చౌ॥ ధవల ధామ ఉపర నభ చుంబత ।
కలసమనహుఁ రవి ససి దుతి నిందతి ॥
బహుమనిరచిత ఝరోకా భ్రాజహిఁ ।
గృహ-గృహ ప్రతిమని దీప బిరాజహిఁ ॥ 4

తా॥ ఉజ్జ్వలమగు నాభవనముల మేఘములు చుట్టుముట్టియుండెను. భవనములపైగల బంగారు కలశములు సూర్యచంద్రులకాంతిని తిరస్కరించుచున్నట్లుండెను. భవనములన్నియు మణులచే పొదుగబడియుండెను. వాటిశోభ వర్ణనాతీతము అయోధ్యాపట్టణములోని ప్రతిగృహమున మణుల దీపములకాంతులు దివ్యతేజోవంతముగ నుండెను.

ఛం॥ మనిదీప రాజహిఁ భవన భ్రాజహిఁ
దేహరీఁ బిద్రుమ రచీ ।

మని ఖంబ భీతి భిరంచి బిరంచీ
కనక మని మరకత ఖచీ ॥
సుందర మనోహర మందిరాయత
అజిర రుచిర ఫటిక రచే ।
ప్రతిద్వార ద్వార కపాట పురట బనాఇ
బహు బిప్రన్హ ఖచే ॥

తా॥ మణుల దీపపుకాంతులచే గృహములు దివ్యశోభతో ప్రకాశించుచుండెను. రత్నములచే నిర్మింపబడ్డ స్తంభములుగలవు. మరకతములు, మాణిక్యములు, బంగారుచే నిర్మింపబడిన స్థంభములా అనునట్లు జూచు వారలకుండెను. రాజమహలు సుందరముగ, విశాలముగ నుండెను. ఆభవనము పాలరాతిచే నిర్మించబడియుండెను. ద్వారమునకుగల తలుపులకు రత్నములు పొదుగబడియుండెను. కిటికీలకు బంగారుతలుపులుచే బిగించెను.

దో॥ చారు చిత్రసాలా గృహగృహ ప్రతిలిఖీ బనాఇ ।
రామ చరిత జో నిరఖి ముని తేమన లేహిం చోరాఇ॥27

తా॥ ప్రతిగృహమందు సుందరములగు రంగురంగుల బొమ్మలు గలవు శ్రీరామచంద్రునికథలు సుందర ప్రతిమలవలె లిఖించబడియుండెను. అవి మునిశ్రేష్ఠుల మనస్సునుగూడ హరించుచుండెను.

చౌ॥ సుమన బాటికా సబహిం లగాఈ ।
బివిధ భాంతి కరి జతన బనాఈ ॥
లతా లలిత బహు జాతి సుహాఈ ।
ఫూలహిం సదా బసంత కి నాఈ ॥

1

తా॥ వ్రజలెల్లరు భిన్నభిన్న విధములగు పుష్పములను తోటల నుండి దెచ్చిరి. అనేకరకములగు అందమైన పుష్పములు మృదువైనలతలు వసంతఋతువును ప్రకటింపజేయు నట్లుండెను.

చౌ॥ గుంజత మధుకర ముఖర మనోహర।
మారుత త్రిబిధ సదా బహ సుందర॥
నానా ఖగ బాలకన్హి జి ఆఎ।
బోలత మధుర ఉఢాత సుహా ఎ॥ 2

తా॥ తుమ్మెదలు తమతమ మధురస్వరములతో నాదమును జేయు చుండెను, త్రివిధములగు వాయువులు ఎల్లపుడును వీవసాగెను.

చౌ॥ మోర హంస సారస పారావత।
భవన ని పరసోభా అతి పావత॥
జహఁ తహఁ దేఖహిఁ నిజపరిఛాహీఁ।
బహు బిధి కూజహిఁ నృత్యకరాహీఁ॥ 3

తా॥ నెమళ్ళు, హంసలు, సారసములు, పావురాళ్ళు, యిండ్లపై భాగమున శోభతోనుండెను. పక్షులు ఆమణులకాంతులలో తమతమ నీడలను జూచుకొని (రెండవ) పక్షిగలదని భావించుకొని మధురముగ కూయుచు న్నట్లు నాట్యమాడసాగెను.

చౌ॥ సుక సారికా పఢావహిఁ బాలక।
కహహు రామ రఘుపతి జనపాలక॥
రాజ దు ఆర సకల బిధి చారు।
బీథీఁ చౌహాట రుచిర బజారు॥ 4

తా॥ చిరువయసుగల చిలుకలు "మైనాల"కు "రామ" రఘుపతి "జనపాలక" అని చెప్పుచుండెను. రాజద్వారము సుందరముగనుండెను. గొందులు, సందులు, బజారులన్నియు రమణీయంముగ నుండెను.

ఛం॥ బాజారరుచిర న బనఇ బరనత
బస్తు బినునాథ పాఇఏ ।
జహాఁ భూప రమానిదాస తహాఁకీ
సంపదా కిమి గా ఇఏ ॥
బైఠే బజాజ సరాఫ బనిక
అనేక మనహుఁ కుబేర తా ।
సబ సుఖీ సబ సచ్చరిత్ర సుందర
సుందరనారి నర సిసు జరఠ సే ॥

తా॥ బజారుల సుందరమును వర్ణింపలేను. వస్తువులు వివరీతములగు ధరలు పలుకుచుండెను. లక్ష్మీనిలయుడు, నారాయణుం డున్నచోట అష్ట సిద్ధులు గలవు. వానిని నేనెట్లువర్ణింపగలను. వస్త్రవ్యాపారులు, చిల్లర నాణెములు తీసుకొనుచు ఇచ్చుచుండిరి. ఆవ్యాపారులు కుబేరునితో సమానులు స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులుగలరు. వారెల్లరు సుఖవంతులునై, సదాచారము గలవారును సుందరాకారులును నై యుండిరి.

దో॥ ఉత్తరదిసి సరజూ బహానిర్మల జలుగంభీర ।
బాంధే ఘాట మనోహర స్వల్ప పంకనహిఁ తీర ॥ 28

తా॥ అయోధ్యానగరమునకు ఉత్తరదిశయందు సరయూనది ప్రవహించుండెను జలము నిర్మలము. గంభీరముగ యుండెను. సుందరమగు "ఘాట్"లు నిర్మింపబడెను. ఆచట వృద్ధులును యాచనచేయువారులేరు.

చౌ॥ దూరి ఫరాక రుచర సోఘాటా।
జహఁ జల పి అహిఁ బాజి గజఠాటా॥
పనిఘట పరమనోహర నానా।
తహఁ న పురుష కరహిఁ అస్నానా॥ 1

తా॥ కొద్దిదూరమున ఏకాంత ప్రదేశమువ మంచి అందముగల రేవు గలదు అచ్చట ఏనుగులకు గుఱ్ఱములకు మాలీసుజేపి నీరు త్రాపెదరు. నీరు త్రాగుటకు చాఁగ రేవులుగలవు. అవిచాల మనోహరముగ నుండును. అచ్చట పురుషులు స్నానపానములు జేయరు.

చౌ॥ రాము ఘాట్ సబ బిధి సుందర బర।
మజ్జహిఁ తహాఁ బరన చారి ఉ నర॥
తీర తీర దేవన్హ కే మందిర।
చహుఁ దిసి తిన్హ కే ఉపవన సుందర॥

తా॥ రాజఘాట్ సర్వవిధముల సుందరమును, శ్రేష్ఠమునైనది. అచ్చట సర్వవర్ణములవారును స్నానపానములు జేసెదరు. సరయూనది యొడ్డున అచ్చటచ్చట దేవతామందిరములు గలవు. వానికి నాలుగువైపుల చిన్నచిన్న వనములును గలవు.

చౌ॥ కహుఁ కహుఁ సరితా తీర ఉదాసీ।
బసహిఁ గ్యాన రత ముని సంన్యాసీ॥
తీర తీర తులసికా సుహాఈ।
బృంద బృంద బహు మునిన్హ లగాఈ॥ 3

తా॥ సరయూనదియొడ్డున అచ్చటచ్చట విరక్తులును, జ్ఞానపరాయణులును, మునులును, సన్యాసులును నివాసము చేయుచుందురు. ఆనది

యొడ్డున గుట్టలుగుట్టలుగ తులసీవనములుగలవు. అవి మునులను ఆకర్షించును.

చౌ॥ పుర శోభా కఛు బరని నజాఈ ।
బాహేర నగర పరమ రుచిరాఈ ॥
దేఖత పురీ అఖిల అఘ భాగా ।
బన ఉపబన బాపికా తఢాగా ॥

తా॥ అయోధ్యానగర శోభను వర్ణింపలేము. నగరము వెలుపలనూ చాల అందముగనుండును. అయోధ్యాపురిని దర్శించిన సర్వపాపములు నశించును. అక్కడ వనములు, ఉపవనములు తోటలు, చెరువులు శోభతోనుండును.

ఛం॥ బాపీం తఢాగ అనూప కూప
మనోహరాయత సోహహీం ।
సోపాన సుందర నీర నిర్మల
దేఖి సుర ముని మోహహీం ॥
బహు రంగ కంజ అనేక ఖగ
కూజహిం మధుప గుంజారహీం ।
ఆరామ రమ్య పికాది ఖగ రవ
జను పథిక హంకారహీం ॥

తా॥ సుందరవంతములగు చెరవులు, విశాలము మనోహరములగు బావులు శోభతోనుండెను. రత్నములతో పొదుగబడిన క్రమముగ పై పోవుమెట్లును, నిర్మలములగు జలమును జూచి దేవతలు మునులు భ్రమ జెందుచుండిరి. ఆచెరువులలో రకరకముల రంగులుగల కమలపుష్పముల

గలవు. రకరకముల పక్షులు కూయుచుండెను. తుమ్మెదలు ఝుంకారనాదము జేయుచుండెను. రమణీయమగు తోటలుగలవు. కోయిలలు మొదలుగాగల పక్షులు సుందరములగు కంఠస్వరములధ్వనులు మార్గమున వెడలువారిని పిలచుచున్నవా అన్నట్లుండెను.

దో॥ రమానాథ జహాం రాజా సో పుర బరని కి జాఇ ।
అని మాదిక సుఖ సంపదా రహీం అవధ సబ ఛాఇ ॥

తా॥ శ్రీలక్ష్మీపతియగు భగవానుడు స్వయముగ అవతరించిన పుర శోభను ఎట్లు వర్ణింపగలను? అష్టసిద్ధులు, సర్వసుఖసంపదలు అయోధ్య యందుండెను.

చౌ॥ జహాం తహాం నర రఘుపతి గున గావహీం ।
బైఠి పరసపర ఇహఇ సిఖావహీం ॥
భజహు ప్రనత ప్రతిపాలక రామహీం ।
సోభాసీల రూపగున ధామహీం ॥ 1

తా॥ ప్రజలు శ్రీరామచంద్రుని గుణములు కీర్తించుచు కథలు జెప్పుకొనుచుండిరి. వాని శోభా, శీల, రూప గుణసంపన్నుడగు శ్రీరాముని కీర్తింపుము.

చౌ॥ జలజ బిలోచన శ్యామల గాతహీ ।
పలక నయన ఇవ సేవక త్రాతహీ ॥
ధృత సర రుచిర చాప తూనీరహీ ।
సంత కంజ బన రవి రన ధీరహీ ॥ 2

తా॥ తామర పుష్పములవంటి కన్నులు నీలమేఘమువంటి శరీర ఛాయగల శ్రీరామచంద్రుని భజింపుము. నేత్రములను రెప్పలు గాపాడు నట్లు శ్రీరామచంద్రుడు భక్తులగాపాడును. సాధుమహాత్ములనెడు కమలవన మును వికసింపజేయుటకు సూర్యునివంటి వాడును, రణధీరుడునగు శ్రీరామ చంద్రుని భజింపుము.

చౌ॥ కాల కరాల బ్యాల ఖగరాజహి।
నమత రామ అకామ మమతా జహి॥
లోభ మోహ మృగ జూధ కిరాత హి।
మన సిజ కరిహరి జన సుఖ దాతహి॥ 3

తా॥ కాలరూపమనెడు సర్పమును భక్షించుటకు శ్రీరాముడు గరుడుని వంటివాడు. నమస్కరించిన వారి కోర్కెలుదీర్చును. లోభ, మోహ రూప మునగల జింకల గుంపులహరించు బోయవాని రూపమునగల శ్రీరాముని భజింపుము. కామరూపమునగల మదించిన ఏనుగును సంహరించుటకు సింహరూపుడగు శ్రీరాముని భజించిన సేవకులకు సర్వసుఖములు గల్గును.

చౌ। సంసయ సోక నిబిడ తమ భానుహి।
దనుజ గహన ఘనదహన కృసాను హి॥
జనక సుతా సమేత రఘుబీర హి।
కస న భజహు భంజన భవ భీరహి॥ 4

తా॥ సంశయము, శోకరూపమునగల గొప్పదగు చీకటిని నాశనము జేయుటకు సూర్యుని రూపమునగల శ్రీరాముని భజింపుము. రాక్షస రూప మునగల గొప్పదగు వనమును దహింపజేయుటకు అగ్నిరూపమున గల

శ్రీరాముని భజింపుము. జన్మ-మృత్యువులతో గూడిన భయమును నాశనము జేయునట్టి శ్రీజానకీరాముని ఏల భజింపరు?

చౌ॥ బహుబాసనా మసక హిమ రాసిహి ।
సదా ఎకరస అజ అబినాసిహి ॥
ముని రంజన భంజన మహి భారహి ।
తులసిదాస కె ప్రభుహి ఉదారహి ॥ 5

తా॥ వాసనారూపమున గల మచ్ఛరమును నాశనముజేయు శ్రీ రాముని భజింపుము. ఎల్లపుడును సుఖము, దుఃఖము లేనివాడును,జన్మరహితుడు, నాశనము లేనివాడును, మునీశ్వరులకు ఆనందమును గలుగజేయువాడును, భూభారమును వహించువాడును, శ్రీ తులసీదాసునకు ప్రభువనగు శ్రీరాముని భజింపుము.

దో॥ ఏహిబిధి నగరనారి నరకరహిం రామగునగాన ।
సానుకూల సబ పర రహహిం సంతత కృపానిధాన ॥ 3

తా॥ యీ విధముగ అయోధ్యా నగరములోని స్త్రీ-పురుషులు శ్రీ రాముని గుణములు కీర్తించుచుండిరి. వారెల్లరను ప్రభువనుగ్రహించుచుండెను.

చౌ॥ జబ తే రామ ప్రతాప ఖగేసా ।
ఉదిత భయఉ అతి ప్రబల దినేసా ॥
పూరి ప్రకాస రహేఉ తిహుం లోకా ।
బహు తేన్హ సుఖ బహు తన మన సోకా ॥

తా॥ (కాకభుశుండి జెప్పుచున్నాడు) ఓపక్షిరాజా! గరుడుడా! ఎప్పుడు రామప్రతాప రూపమనెడు సూర్యుడు అత్యంత ప్రచండుడిగ ఉదయించునో

అప్పుడే ముల్లోకములందు గల చీకట్లు నశించి కాంతివంతముగ నుండెను. అందువల్ల సుఖమును, దుఃఖమును గలిగెను.

చౌ॥ జిన్హహి సోక తే కహఁఉఁ బఖానీ ।
ప్రథమ అవిద్యా నిసా నసానీ ॥
అఘ ఉలూక జహఁ తహాఁలుకానే ।
కామ క్రోధ కైరవ సకుచానే ॥ 2

తా॥ దుఃఖములు, బాధలు జెందునట్టివారికి జెప్పుచున్నాను. మొదట అవిద్యా రూపమనెడు రాత్రిని తొలగింపుము. పాపరూపములనెడు గుడ్ల గూబలక్కడక్కడ దాగికొనెను. కామము - క్రోధరూపమునగల కుముద పుష్పములు ముకుళించుకొనెను.

చౌ॥ బివిధ కర్మ గున కాల సుభాఉ ।
ఏ చకోర సుఖ లహహిఁ న కాఉ ॥
మత్సర మాన మోహ మద చోరా ।
ఇన కర హూను సర న కవనిహుఁ ఓరా ॥ 3

తా॥ వివిధ విధములగు భ్రాంతిచే బంధనకారకమగు కర్మలు. గుణములు, కాలము, స్వభావము చకోరములు. రామప్రతాపరూపమనెడు సూర్య కాంతియందు ప్రకాసింపలేవు. సుఖపడలేవు. మత్సరము, మానము మోహము మదరూపములే దొంగలు. ఏ విద్యగూడా వారికిసాగదు. తగి[illegible] ఫలితమును బొందలేరు.

చౌ॥ ధరమ తడాగ గ్యాన బిగ్యానా ।
ఏ పంకజ బికసే బిధి నానా ॥

సుఖ సంతోష బిరాగ బిబేకా ।
బిగత శోక ఎ కోక అనేకా ॥ 4

తా॥ ధర్మరూపమనెడు చెరువునందు జ్ఞాన-విజ్ఞానములు గలవు. వీని యందనేక విధములగు రంగురంగుల తామరపుష్పములు వికసించును. సుఖ సంతోషములు, వైరాగ్యము, వివేకములనెడు చక్రవాకములే దుఃఖనాశనము.

దో॥ యహ ప్రతాప రవి జాకేఁ ఉర జబ కరఇ ప్రకాశ ।
పఛిలే బాఢహిఁ ప్రథమ జే కహే తే పావహిఁనాస ॥ 5

తా॥ శ్రీరామ ప్రతాపరూపమనెడు సూర్యుడు ఎవరి హృదయమున ప్రకాశమానుడై యుండునో అట్టివాడు దర్మ, జ్ఞాన, విజ్ఞానము, సుఖము, సంతోషము. వైరాగ్యము. వివేకమునందు పరిపూర్ణత్వము నొందును. అట్టి వారి గొప్పతనమును వర్ణింపజాలమని మొదటనె జెప్పితిని. అవిద్య, పాపము, కామము, క్రోధము, కర్మ, కాలము, గుణము, స్వభావము మొద లుగాగల దుష్టగుణములున్నను నశించును.

చౌ॥ భ్రాతన్హ సహిత రాము ఎక బారా ।
సంగ పరమ ప్రియ పవనకుమారా ॥
సుందర ఉప బన దేఖన గయె ।
సబ తరు కుసుమిత పల్లవ నఏ ॥

తా॥ ఒక పర్యాయము శ్రీరామచంద్రుడు తమ్ములను, పరమప్రియు డగు ఆంజనేయుని వెంటనిడుకొని సుందరవంతమగు పూలవాటికను జూచు టకు వెళ్లెను. అక్కడ అవృక్షములన్నియు పుష్పించి లేఁగురుటాకులతో మిక్కిలి శోభతో నుండెను.

చౌ॥ జాని సమయ సనకాదిక ఆఏ।
తేజ పుంజ గునశీల సుహాఏ।
బ్రహ్మానంద సదా లయలీనా।
దేఖత బాలక బహుకాలీనా॥ 1

తా॥ మంచి సమయమని యెరింగి సనకాది మహర్షులచటికి వచ్చిరి. వారు తేజో ప్రభావంతులు, సద్గుణములు, సచ్ఛీలము గలవారు. బ్రహ్మానందమున మునిగియుండిరి. వారు చూచుటకు బాలకులవలె యుండినను మిక్కిలి వయోవృద్ధులు.

చౌ॥ రూప ధరేఁ జను చారి ఉ బేదా।
సమదరసీ ముని బిగత బిభేదా॥
ఆసా బసన బ్యసన యహ తిహహీఁ।
రఘుపతి చరిత హోఇ తహఁ సునహీఁ॥

తా॥ నాలుగు వేదములే నలుగురు బాలరూపములు. ధరించినట్లుండెను. ఆముని శ్రేష్ఠులు సర్వమును భగవన్మయముగ జూచువారు. భేద భావము లేనివారు శ్రీరామచంద్రుని కథలు ఎచ్చట జరుగుచుండినను ఆ ప్రదేశమునకు వెడలి వినుటయందు వారలకు వ్యసనము మిక్కిలిగ గలదు.

చౌ॥ తహాఁ రహే సనకాది భవానీ।
జహఁ ఘట సంభవ మునివర గ్యానీ॥
రామ కథా మునివర బహు బరనీ॥
గ్యాన జోని పావక జిమి అరనీ॥ 4

తా॥ (శివుడు చెప్పుచున్నాడు.) ఓపార్వతీ! సనకాదిమహర్షులు ఎక్కడెక్కడకు వెడలెదరో అచ్చటచ్చట జ్ఞానియు, మునిశ్రేష్ఠుడునగు

అగస్త్యమహర్షి వుండును అతడు శ్రీరామచంద్రుని దివ్యకథలు వర్ణించు చుండును రెండుకట్టెలను బంధించి మధించిన నిప్పురాలునట్లు జ్ఞానోత్పత్తి యందాతడు సర్వసమర్థుడు.

దో॥ దేఖి రామ ముని ఆవత హారషి దండవత కీన్హా।
స్వాగత పూంఛీ పీత పట ప్రభు బైఠన కహఁ దీన్హా॥

తా॥ సనకాదిమహర్షులు వచ్చుటను శ్రీరామచంద్రుడు జూచి సాష్టాంగ దండప్రణామము జేసి, స్వాగత సత్కారములు జరిపి, క్షేమ సమాచారములనడిగి వారు కూర్చుండుటకై పట్టుపీతాంబరములు బరచెను

చౌ॥ కీన్హ దండవత తీని ఉ భాఈ।
సహిత పవనసుత సుఖ అధికాఈ॥
ముని రఘుపతి ఛబి అతుల బిలోకీ।
భఏ మగన మన సకే న రోకీ॥ 1

తా॥ వారికి హనుమంతుడు, భరత, లక్ష్మణ శత్రుఘ్నులు సాష్టాంగ దండప్రణామమాచరించి చాల ఆనందమును బొందిరి. ఆ మునిశ్రేష్ఠులు శ్రీ రామచంద్రుని దివ్యస్వరూపమును జూచి తన్మయులైరి. వారి మనస్సున కేమియు అడ్డులేకుండెను.

చౌ॥ స్యామల గాత సరోరుహ లోచన।
సుందర తా మందిర భవమోచన॥
ఏకటక రహె నిమేష న లావహిఁ।
ప్రభు కర జోరేఁ సీస నవావహిఁ॥ 2

తా॥ శ్రీరాముడు చావుపుట్టుకలనుండి తప్పించువాడు శ్యామలవర్ణము వంటి శరీరముగలవాడు, వికసించిన పద్మములవంటి కన్నులుగలవాడు,

దివ్యతేజో రూపరాశియగు శ్రీరామచంద్రుని సనకాదిమహర్షులు రెప్పలు వేయక జూచుచుండిరి. శ్రీరాముడు వారికి తలవంచి రెండుచేతులతో నమస్కరించు చుండెను.

చౌ॥ తిన్హ కై దసా దేఖి రఘుబీరా ।
స్రవత నయన జల పులక సరీరా ॥
కర గహి ప్రభు మునివర బైఠారే ।
పరమ మనోహర వచన ఉచారే ॥ 3

తా॥ వారియొక్క ప్రేమ వివశతను జూచుటచే శ్రీరామచంద్రుని కనులవెంట ఆనందబాష్పములు స్రవించసాగెను. శరీరము పులకితమయ్యెను. శ్రీరామచంద్రుడు వారి చేతులను పట్టుకొని శ్రేష్ఠులగు నామునీశ్వరుల కూర్చుండబెట్టి మనోహరములగు పలుకులిట్లు పలుకసాగెను.

చౌ॥ ఆజు ధన్య మై సునహు మునీసా ।
తుమ్హారే దరస జాహిం అఘ ఖీసా ॥
బడే భాగ పాఇబ సతసంగా ॥
బినహిం ప్రయాస హోహి భవ భంగా ॥ 4

తా॥ ఓ మునిశ్రేష్ఠులారా! నామాటవినుడు. నేనీరోజు మీవలన ధన్యుడను. అమోఘమగు మీదర్శన ప్రభావము వలన నాపాపము నశించినవి. అదృష్టము వలన సత్సంగము లభించినది. ఆ కారణమువలన పరిశ్రమలేకయే చావుపుట్టుకలనెడు చక్రభ్రమణమునుండి తప్పింపబడితి!

దో॥ సత సంగ అపవర్గ కర కామీ భవకర పంథ ।
కహహిం సంత కవికోవిద శ్రుతి పురాన సద్గ్రంథ ॥ 3

తా॥ సత్సంగ ప్రభావమువలన మోక్షము గలుగును. కాముకునితో స్నేహము జన్మ-మరణ చక్రమునందు పడుటకు మార్గమని మహాత్ములు, కవులు, పండితులు, వేదములు, పురాణములు, సద్గ్రంథములు జెప్పుచున్నవి

చౌ॥ సుని ప్రభు వచన హరషి ముని చారీ।
పులకిత తన అస్తుతి అనుసారీ॥
జయ భగవంత అనంత అనామయ।
అనఘ అనేక ఏక కరునామయ॥   1

తా॥ శ్రీరామచంద్రులవారి పలుకులను ఋషిశ్రేష్ఠులు విని, ఆనందించి, పులకిత శరీరులై యిట్లు స్తుతింపసాగిరి శ్రీరామా। నీకు జయమగుగాక। సర్వవ్యాపకుడవగు నీకు జయమగుగాక వికారరహితుడవు. పాపరహితుడవు. సర్వరూపధారుడవు. అద్వితీయుడవు. కరుణామయుడవగు నీకు జయమగుగాక.

చౌ॥ జయ నిర్గున జయ జయ గునసాగర।
సుఖ మందిర సుందర అతి నాగర॥
జయ ఇందిరా రమన జయ భూధర।
అనుపమ అజ అనాది సోభాకర॥   2

తా॥ ఓ నిర్గుణస్వరూపా। నీకు జయమగుగాక! సద్గుణనిధీ। నీకు జయమగుగాక। సర్వసుఖములకు నిలయుడవగు ఓరామా! నీవు సుందరుడవు. చతురుడవు. ఓలక్ష్మీపతి రామా! నీకు జయమగుగాక! ఓభూభర్తా। నీకు జయము కలుగుగాక। నీవు ఉపమారహితుడవు. అజన్ముడవు. అనాదివి, శోభాసముద్రుడవు.

చౌ॥ గ్యాన నిధాన అమాన మానప్రద ।
పావన సుజస పురాన బేదబద ॥
తగ్య కృతగ్య అగ్యతా భంజన ।
నామ అనేక అనామ నిరంజన ॥ 3

తా॥ నీవు జ్ఞానసముద్రుడవు. అభిమాన రహితుడవు. ఇతరులకు అభిమానమును గలుగజేయువాడవు నీపవిత్రతను, గొప్పతనమును, వేదములు, పురాణములలో జెప్పబడెను. నీవు తత్వముద్వారాను, సేవద్వారాను మాత్రమే తెలియబడెడువాడవు. అజ్ఞానమును నాశనము జేయువాడవు, నిరంజనుడవు. మాయారహితుడవు. అనేక నామములు గలవాడవు. నామ రహితుడవు.

చౌ॥ సర్వ సర్వగత సర్వ ఉరాలయ ।
బసహి సదా హమ కహుఀ పరిపాలయ ॥
ద్వంద బిపతి భవ ఫంద బిభంజయ ।
హృది బసి రామ కామ మద గంజయ ॥ 4

తా॥ రూపములన్నియు నీవే. సర్వవ్యాపకుడవు. సర్వుల హృదయ రూపములనెడు గృహములందు నివసించెడువాడవు. మమ్మనుగ్రహించి పాలింపుము. రాగ-ద్వేషములనుండి, అనుకూలత - ప్రతికూలత, జన్మ-మృత్యువులనెడు ద్వంద్వములనుండి, ఆపదలనుండి మమ్ములను అనుగ్రహించి కాపాడుము. ఓ శ్రీరామచంద్రా! నీవు నాహృదయమను గృహమందు నివసించు కామ-క్రోధాది గుణముల నాశనము జేయుము.

దో॥ పరమానంద కృపాయ తన మన పరిపూరన కామ ।
ప్రేమ భగతి అనపాయనీ దేహు హమహి శ్రీరామ ॥

తా॥ నీవు పరమానంద స్వరూపుడవు. కృపాసముద్రుడవు, మన స్సున గల కోర్కెలను పూర్తిగ దీర్చువాడవు. ఓ రామా ! నీయొక్క పరిపూర్ణమగు ప్రేమను భక్తిని మాకు గలుగజేయుము.

చౌ॥ దేహు భగతి రఘుపతి అతి పావని ।
త్రిబిధ తాప భవ దాప న సావని ॥
ప్రనత కామ సురధేను కలప తరు ।
హోఇ ప్రసన్న దీజై ప్రభు యహ వరు ॥ 1

తా॥ శ్రీరామచంద్రా ! నీవు మమ్ములను మిక్కిలిగ పవిత్రులను జేయువాడవు. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపముల హరించువాడ వును చావు పుట్టుకలనుండి కాపాడి నీవు మాకు భక్తిని ప్రసాదింపుము.

చౌ॥ భవ బారిధి కుంభజ రఘు నాయక ॥
సేవత సులభ సకల సుఖ దాయక ॥
మన సంభవ దారున సుఖ దారయ ।
దీనబంధు సమతా బిస్తారయ ॥ 2

తా॥ శ్రీరామచంద్రా ! నీవు చావు - పుట్టుకల రూపమున గల మృత్యురూప సముద్రమును ఎండింపజేయుటకు అగస్త్య ఋషితో సమా నుడవు. నీకు సేవలు జేసినవారలకు వశుడవు. సర్వసుఖములు గలుగజేయువాడవు. దీనజన రక్షకా ! మనస్సునందు ఉత్పన్నమగు దారుణ దుఃఖమును నాశనము జేయుము. మాలో సమదృష్టిని విస్తరింప జేయుము.

చౌ॥ ఆస త్రాస ఇరిషాది నివారక ।
బినయ బిబేక బిరతి బిస్తారక ॥

భూప మౌలి మునీ మండన ధరన ।
దేహి భగత సంసృతి సరి తరనీ ॥ 3

తా॥ శ్రీరామా ! నీవు విషయ వాసనలతో గూడిన ఆశలను నివారణజేయు వాడవు. వినయమును వివేకమును, విరాగత్వములను విస్తారముగ గలుగజేయువాడవు. రాజశ్రేష్ఠా ! భూ భూషణా ! శ్రీరామచంద్రా! చావు పుట్టుకలనెడు ప్రవాహరూపమునగల నదిని దాటుటకు, నౌకారూపమగునట్టి నీయొక్క పరమపావనమగు భక్తిని మాకు గలుగజేయుము.

చౌ॥ ముని మన మానస హంస నిరంతర ।
చరన కమల బందిత అజ సంకర ॥
రఘుకుల కేతు సేతు శ్రుతి రచ్ఛక ।
కాల కరమ సుభాఉ గున భచ్ఛక ॥ 4

తా॥ మునిశ్రేష్ఠుల మనోరూపమనెడు మానససరోవరమందు ఎల్లప్పుడు నివాసముచేయు హంసస్వరూపా! శ్రీరామా! నీచరణ కమలములను బ్రహ్మ, శివుడును ఎల్లపుడు సేవించెదరు. నీవు రఘుకులమునకు ధ్వజము వంటివాడవు. వేదమర్యాదల రక్షించువాడవు. కాలమును, కర్మను, స్వభావమును గుణరూపమునగల బంధనమును నాశనము జేయువాడవు.

చౌ॥ తారన తరన హరన సబ దూషన ।
తులసీ దాస ప్రభు త్రిభువన భూషన । 5

తా॥ రామా! నీవు తరించుటయేగాక యితరులనుగూడ తరింపజేయువాడవు. సర్వదోషముల హరించువాడవు త్రిలోకమునకు అలంకారప్రాయుడవు. శ్రీతులసీదాసునకు ప్రభుడవునై యున్నావు.

దో॥ బార బార అస్తుతి కరి ప్రేమ సహిత సిరునాఇ।
ప్రహ్మ భవన సనకాది గే అతి అభీష్ట బరపాఇ॥ 35

తా॥ సనకాది మహర్షులు ప్రేమతో శ్రీరామచంద్రుని స్తుతించి, వారు కోరుకున్న వరములుబొంది బ్రహ్మలోకమునకు వెడలిరి.

చౌ॥ సనకాదిక బిధి లోక సిధా ఏ।
బ్రాతన్హ రామ చరన సిరు నా ఏ॥
పూఛత ప్రభు హి సకల సకుచాహీం।
చితవహిం సబ మారుత సుత పాహీం॥ 1

తా॥ సనకాదిమహర్షులు బ్రహ్మలోకమునకు వెడలిరి. భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు శ్రీరామచంద్రుని పాదములకు నమస్కరించిరి. సోదరులెల్లరు ప్రభువును పలుకరించుటకు సిగ్గుపడుచు, హనుమంతుని వైపు జూచుచుండిరి.

చౌ॥ సునీ చహహిం ప్రభు ముఖ కై బానీ।
జో సునిహోఇ సకల భ్రమ హానీ॥
అంతర జామి ప్రభు సభ జానా।
బూఝత కహహు కావా హనుమానా॥ 2

తా॥ వారు శ్రీరామచంద్రుని మాటలు వినుటకు ఉవ్విళ్ళూరుచుండిరి. శ్రీహరి మాటలు వినిన సర్వవిధములగు భ్రమలు నాశనమగును. సర్వాత్మ స్వరూపుడగు ప్రభువు సర్వమెఱింగి హనుమంతునితో విశేషములు చెప్పుమని అడిగెను.

చౌ॥ జోరి పాని కహ తబ హనుమంతా।
సునహు దీన దయాల భగవంతా॥

నాథ భరత కఛు పూంఛన చహహీం ।
ప్రస్న కరత మన సకుచత అహహీం ॥ 3

తా॥ అప్పుడు హనుమంతుడు రెండుచేతులు జోడించుకొని యిట్లు పలుకసాగెను. దీనజనోద్ధారకా! శ్రీరామా! వినుడు. భరతుడు కొన్ని విషయములు మిమ్ముల నడగదలచి మనస్సునందు సిగ్గుపడుచున్నాడు.

చౌ॥ తుమ్హ జానహు కపి మోర సుభాఉ ।
భరతహి మోహి కఛు అంతర కాఉ ॥
సుని ప్రభు బచన భరత గహే చరనా ।
సునహు నాథ ప్రనత ఆరతి హరనా ॥ 4

తా॥ (భగవంతుడిట్లు పలికెను.) ఓ హనుమంతా! నా స్వభావము నీకు బాగుగ దెలియును. భరతునకు నాకు ఏమాత్రము భేదములేదు. అని పలుక భరతుడు శ్రీరామచంద్రుని పాదములపై బడి శరణాగత రక్షకా! దుఃఖముల నాశనము జేయువాడా! ప్రభూ! నామాటల నాలకింపుడు

దో॥ నాథ న మోహి సందేహ కఛు సపనేహుఁ సోక న మోహ।
కేవల కృపా తుమ్హారిహి కృపానంద సందోహ ॥ 36

తా॥ ప్రభూ! నాకు స్వప్నములోగూడ సందేహముగాని శోకముగాని, మోహముగాని లేదు. దయాసముద్రుడవగు రామా! నీ దివ్యానుగ్రహముచేతనే నాకీ ఫలితము గలిగినది.

చౌ॥ కరఉఁ కృపానిధి ఏక ఢిఠాఈ ।
మైఁ సేవక తుమ్హ జన సుఖ దాఈ ॥
సంతన్హ కై మహిమా రఘురాఈ ।
బహు బిధి బేద పురానన్హ గాఈ ॥ 1

తా॥ కృపాసముద్రుడా! నేను మిమ్ముల పట్టుదలతో అడిగి తెలిసి కొనదలచితిని. నేను సేవకుడను. నీవు సేవకులకు సుఖములు గల్గుగజేయు వాడవు. కనుక నాపట్టుదలను క్షమింపుము. నాప్రశ్నలకు జవాబులజెప్పి నన్నానందింప జేయుము. శ్రీరామచంద్రా! వేదములు, పురాణములలో సాధు మహాత్ముల మహిమలు వివిధ విధముల జెప్పబడెను.

చౌ॥ శ్రీముఖ తుమ్హా పుని కీన్హి బఢాఈ।
తిన్హ పర ప్రభు హి ప్రీతి అధికాఈ॥
సునా చహా ఉం ప్రభు తిన్హ కర లచ్ఛన।
కృపాసింధు గున గ్యాన బిచచ్ఛన॥ 1

తా॥ నీవుగూడ వాటియొక్క గొప్పదనమును వర్ణించితివి. నీకు వానియందు ప్రేమ మిక్కుటముగ గలదు. ప్రభూ! నేను వానియొక్క గొప్పవగు లక్షణముల వినగోరుచుంటిని. దయాసముద్రుడవు. సద్గుణ సంపన్నుడవు జ్ఞాననిపుణుడవు.

చౌ॥ సంత అసంత భేద బిలగాఈ।
ప్రనతపాల మోహి కహాహు బుఝాఈ॥
సంతన్హ కే లచ్ఛన సును భ్రాతా।
అగనిత శ్రృతి పురాన బిఖ్యాతా॥

తా॥ శరణాగత రక్షకా! శ్రీరామా! మహాత్ముల, దుర్మార్గులలోగల భేదభావముల గూర్చి విడివిడిగా దెలియజెప్పుడు. అన (శ్రీరాముడిట్లు జెప్ప సాగెను.) సోదరా! భరతా! సాధుమహాత్ముల లక్షణములు వర్ణించుటకు వీలులేకుండ గలవు. అవి వేదములలో పురాణములలో గొప్పగ జెప్పబడి ఉన్నవి.

చౌ. సంత అసంతన్హి కై అసికరనీ ।
జిమి కుఠార చందన ఆచరనీ ॥
కాటయి పరసు మలయ సును భాఈ ।
నిజ గున దేఇ సుగంధ బసాఈ ॥

తా॥ గొడ్డలి చందన వృక్షమును నరికిన దానికి మంచి గంధపు వాసనలబ్బినట్లు మహాత్ములను దుర్మార్గులాశ్రయించిన సాధువులయ్యెదరు. సోదరా! వినుము. గొడ్డలి చందనవృక్షమును నరుకును. (ఏలన దానిస్వభావము వృక్షముల నరకుటయే) మంచిగంధ స్వభావము దాని విలక్షణమగు సువాసనలందించుటయె.

దో॥ తాతే సుర సీ సన్హ చఢత జగ వల్లభ శ్రీఖండ ।
అనల దాహి పీట త ఘున హి పరసు బదన యహదండ॥

తా॥ ఈ మంచిగంధము దేవతల తలలపై పూయబడును. ప్రపంచమున మిక్కిలిగ గౌరవింపబడునది గొడ్డలిచే నరుకబడి నరుకబడినప్పటికిని అగ్నిలో కాల్చబడినప్పటికిని దాని గొప్పతనము తగ్గలేదు.

చౌ॥ బిషయ అలంపట సీల గునాకర ।
పర దుఖ దుఖ సుఖ సుఖ దేఖే పర ॥
సమ అభూ తరిపు బిమద బిరాగీ ।
లోభా మరష హరష భయ త్యాగీ ॥

తా॥ సాధుమహాత్ములు విషయవాసనలలో తగుల్కొనరు. సద్గుణములకు నిలయులయ్యెదరు. వారు యితరుల దుఃఖముల జూచి దుఃఖించెదరు అదే విధముగ పరులసుఖముల జూచి ఆనందించెదరు. వారు సర్వమును, సర్వకాలమును సమదృష్టులతో జూచెదరు. వారి మనస్సులోగూడ శత్రు

భావన ఉండదు, వారలకు అహంకారముండదు. విరాగత్వముగ నుండెదరు. లోభము, మోహము, క్రోధము, హర్షము, భయమును వీడెదరు.

చౌ॥ కోమల చిత్త దీనన్హ పర దాయా।
మన బచ క్రమ మమ భగతి అమాయా॥
సబహి మానప్రద ఆపు అమానీ।
భరత ప్రాన సమ మమ తే ప్రానీ॥ 2

తా॥ వారల చిత్తము మిక్కిలి కోమలముగ నుండును. వారు దీనుల ననుగ్రహింతురు. మనోవాక్కాయ కర్మలచే నాయందు నిష్కపట భక్తి గలియుందురు. సర్వుల గౌరవింతురు. మానరహితులుగ నుందురు. ఓభరతా! సత్పురుషులు నాకు ప్రాణముతో సమానము.

చౌ॥ బిగత కామ మమ నామ పరాయన।
సాంతి బిరతి బినతీ ముదితాయన॥
సీతలతా సరలతా మయత్ర।
ద్విజ పద ప్రీతి ధర్మ జన యత్రీ॥ 3

తా॥ వారికే కోరికలుండవు. నా నామమునే వారు పారాయణ జేయుదురు. శాంతికి, వైరాగ్యమునకు, వినయసంపదలకు, ప్రసన్నతకు నిలయములు. వారియందు కరుణ, సరళత, ప్రతిదానియందు గౌరవభావము గలిగియుండి బ్రాహ్మణులనిన మిక్కిలిప్రేమ గలిగియుండి ధర్మమునభివృద్ధి పరచెదరు.

చౌ॥ ఎ సబ లచ్ఛన బసహిం జాసు ఉర।
జానేహు తాత సంత సంతత ఫుర।

సమ దమ నియమ నీతి నహిఁ డోలహిఁ ।
పరుష బచన కబహూఁ నహిఁ బోలహిఁ ॥

తా॥ బిడ్డా! ఈ లక్షణములన్నియు ఎవరి హృదయములలో సించునో వారు సజ్జనులని తెలిసికొనుము. మనోనిగ్రహము, ఇంద్రియ హము, యను నియమములు, నీతిగ ప్రవర్తించుటయందు విచలితులు వారి నోటినుండి కఠోరమైన పలుకులు వినబడవు.

దో॥ నిందా అస్తుతి ఉభయ సమ మమతా మమ పద కం
తే సజ్జన మమ ప్రానప్రియ గున మందిర సుఖపుంజ

తా॥ వారు నిందాస్తుతులను సమముగ భావింతురు. నా చరణకమ లందు వారికి దృఢనమ్మకమును గల్గియుందురు. సద్గుణములకు నిలయ సుఖములు గలిగియుండు సజ్జనులు నాకు ప్రాణప్రియులు.

చౌ॥ సునహు అసంతన్హ కేర సుభాఉ ।
భూలేహుఁ సంగతి కరిఅ న కాఉ ॥
తిన్హ కర సంగ సదా దుఖ దాఈ ।
జిమి కపిలహిఁ ఘూలఇ హరహాఈ ॥

తా॥ దుర్మార్గుల స్వభావముల వినుడు. వారివారి కార్యములు చెదరు. ఏకార్యములు చేయజాలరు. గొడ్డుబోతు ఆవు పాలిచ్చుఆవును స్నేహమువలన నాశనము చేయునట్లు దుర్మార్గులతో స్నేహము సర్వ ములగు దుఃఖములు గలుగజేయును.

చౌ॥ ఖలన్హ హృదయఁ అతి తాప బిసేసీ ।
జరహిఁ సదా పర సంపతి దేఖీ ॥

జహఁ కహుఁ నిందా సునహిఁ పరాఈ ।
హరషహిఁ మనహుఁ పరీ నిధి పాఈ ॥ 2

తా॥ దుర్మార్గుల హృదయములందు అధికముగ సంతాపముండును. వారికి పరుల సంపదల జూచిన బాధలు గలుగును. యితరులను నిందించుట జూచినను, వినినను ఆనందింతురు. వారికి రాజవీధులందు నిధి లభించి నట్లుండును.

చౌ॥ కామ క్రోధ మద లోభ పరాయన ।
నిర్దయ కపటీ కుటిల మలాయన ॥
బయరు అకారణ సబ కాహూ సోఁ ।
జో కరహిత అనహిత అనహిత తాహూ సోఁ ॥ 3

తా॥ కామ, క్రోధ, లోభ, మోహ, మదములకు నిలయులు. నిర్దయులు. కపటులు. మోసగాండ్రు పాపములకు నిలయులు. వారేకారణము లేకయే విరోధములు బెట్టుకొనుచుందురు. ఎవరైనా మంచి కార్యములను జేసినవెంటనె దుష్టకార్యముల జేతురు.

చౌ॥ ఝూఠఇ లేనా ఝూఠఇ దేనా ।
ఝూఠఇ భోజన ఝూఠ చబేనా ॥
బోలహిఁ మధుర బచన జిమి మేరా ।
ఖాఇ మహా అహి హృదయ కఠోరా ॥ 4

తా॥ వారు పాపములు జేయుదురు. పాపకర్మల నంటగట్టెదరు. పాప భోజనము జేయుదురు. వేయించిన శనగలు, పేలాలు తినుచుందురు, లావాదేవీలు జరుపుటలోగూడ అసత్యము నాశ్రయించుచు పరుల కొట్టుచు తిట్టు

చుందురు, అసత్యములు పలుకుచు ఎగతాళిచేయుచు బిగ్గరగా కేకలు వేయుదురు. అంతేగాక మేము లక్షలకొద్ది రూపాయలు కోట్లకొలది మందికి దానధర్మములు జేసితిమి. అని వ్యంగ్యముగ ఒక్కొక్కమాట జెప్పుచు, పేలాలు, శనగలు, రొట్టెలు తినుచు వ్యంగ్యముగఆహారము మాకు విరాగము గలుగజేసినదని పలుకుచుందురు. ప్రతిచిన్న విషయమునందును అసత్యము పలుకుటయే వారిధ్యేయము. వారెంత వినయముగ పైకి కనిపించిననో లోలోపల కుట్రలు పన్నుచుందురు. నెమలికంఠము ఎంత శ్రావ్యముగనున్నను సర్పముల భుజించునట్లు దుర్మార్గులెంత మృదువుగ మాట్లాడినను విషము లనువిషయములచే బాధించెదరు. వారి హృదయము మిక్కిలి కఠోరము.

దో॥ పరద్రోహీ పర దార రత పర ధన పర అపబాద ।
తేనర పాంవర పాపమయ దేహ ధరేం మనుజాద ॥ 39

తా॥ వారు యితరులకు ద్రోహము చేయుదురు. పరాయి స్త్రీలను, పరాయి ధనమును, యితరులను నిందించుటయందు ఆసక్తిని గలిగియుందురు. అట్టివారు పామరులు, పాపమయులు. వారే మానవ శరీరమును ధరించిన రాక్షసులు.

చౌ॥ లోభ ఓఢ ఓఢ లోభ డాసన ।
సిస్నోదర పర జమ పుర త్రాసన ॥
కాహూ కీ జౌం సునహిం బడాఈ ।
స్వాస లేహిం జను జూడీ ఆఈ ॥ 1

తా॥ లోభకారణము వలన ఎల్లపుడు ఆపదలలో పడెదరు. అట్టివారు పశువులు గడ్డిని మేయునట్లు ఆహారమును తినెదరు. వ్యభిచారమందభిరుచి

గలిగి యుందురు. వారికి యమపురమనిన భయములేదు. వారు ఇతరుల గొప్పతనము వినిన బాధలుజెంది పాములు బుసలుకొట్టునట్లు నిట్టూర్పులు విడచెదరు. జూమువారలకు చలిజ్వరము వచ్చెనదా? అనునట్లుండెదరు.

చౌ॥ జబ కాహూకై దేఖహిం బిపతీ ।
సుఖీ భఏ మానహుం జగ నృపతీ ॥
స్వారథ రత పరివార బిరోధీ ।
లంపట కామ లోభ అతి క్రోధీ ॥ 2

తా॥ మరియి యితరులకు గలుగు కష్టముల జూచిన ప్రపంచమును పరిపాలించు రాజులైనట్లు భావింతురు. (అనగా మిక్కిలి సంతోషింతురు,) వారు స్వార్థ పరాయణులు. సమాజములకు విరోధులు. కామ, లోభ కారణమువలన విషయలంపటులై మిక్కిలి క్రోధముగ నుండెదరు.

చౌ॥ మాతు పితా గురు బిప్ర న మానహిం ।
ఆపు గఏ అరు ఘాలహిం ఆనహి ॥
కరహిం మోహ బస ద్రోహ పరావా ।
సంత సంగ హరి కథా న భావా ॥ 3

తా॥ వారు తల్లిదండ్రుల, గురువును, బ్రాహ్మణుల గౌరవింపరు. వారు నష్టపడెదరు. ఇతరుల నష్టపెట్టెదరు. మోహ కారణము వలన ఇతరులకు ద్రోహము దలపెట్టెదరు. వారికి మహాత్ములతో స్నేహమనిన నిష్టము గాదు. భగవానుని కథలనిన వారికి అయిష్టముగ నుండును.

చౌ॥ అవగున సింధు మంద మతి కామీ ।
బేద బిదూషక పరధన స్వామీ ॥

బి[ప ద్రోహ పర ద్రోహ బిసేషా ।
దంభ కపట జియఁ ధరే సుబేషా ॥ 4

తా॥ అట్టివారు అవగుణములకు నిలయులు. మందబుద్ధులు, కాముకులు వేదముల నిందింతురు దౌర్జన్యముచే యితరుల ధనమును దొంగిలింతురు. యితరుల కపకారమును జేయుదురు. బ్రాహ్మణులకు విశేషముగ ద్రోహమును జేతురు వారి హృదయము నిండుగ దంభము, కపటములచే నిండియుండును వారు పైకి గొప్ప గొప్ప వేషములు ధరించెదరు.

దో॥ ఐసే అధమ మనుజఖల కృత జుగ త్రేతా నాహిఁ ।
ద్వాపర కఛుక వృంద బహు హోఇ హహిఁ కలిజుగమాహిఁ ॥ 40

తా॥ యిట్టి నీచమానవులు కృతయుగమందున, త్రేతాయుగమందున లేరు. ద్వాపరయుగమందు కొంతమంది గలరు. కాని, ఈ కలియుగమందు అందరు వారే గుంపులుగుంపులుగ గలరు.

చౌ॥ పరహిత సరిస ధర్మ నహిఁ భాఈ ।
పర పీఢా సమ నహిఁ అధ మాఈ ॥
నిర్ణయ సకల పురాన బేద కర ।
కహిఉఁ తాత జానహిఁ కోవిద పర ॥ 1

తా॥ సోదరా! యితరుల గొప్పతనమును శ్లాఘించుటయే గొప్ప ధర్మము యితరులకు దుఃఖముల గల్గించుటకంటె నీచమగు పాపములేదు. వేద, పురాణముల సారమిదియేనని నీకు తెల్పుచుంటిని. ఈవిషయము పండితులకుబాగుగా దెలియును.

చౌ॥ నర సరీర ధరి జే పరపీరా ।
కరహిఁ తే సహహిఁ మహా భవ భీరా ॥

కరహి మోహా బస నర అఘ నానా ।
స్వారథ రత పరలోక నసానా ॥ 2

తా॥ శరీరమును ధరించిన మానవులు యితరులకు దుఃఖములు గలిగించిన ఎడల గొప్పవైనట్టి చావు పుట్టుకల సంకటములో పడియెదరు. మోహమునకు వశుడైనట్టి మానవుడు స్వార్థపరాయణుడై అనేకములగు పాపములలో బడును. పరలోకబాధలు గలుగును.

చౌ॥ కాలరూప తిన్హ కహఁ మైఁ భ్రాతా ।
సుభ అరు అసుభ కర్మఫల దాతా ॥
అస బిచారి జే పరమ సయానే ॥
భజహిఁ మోహి సంసుత దుఖ జానే ॥ 3

తా॥ సోదరుడా! నేనట్టివారికి భయంకరమగు కాలస్వరూపుడను. వారుచేయు మంచి, చెడ్డకర్మలను బట్టి యధాయోగ్యమగు ఫలితములనిచ్చు వాడనని దెలిసికొన్నట్టి మానవులు చతురులు. వారు ఈసంసార సముద్రము దుఃఖమయమని తెలిసికొని నన్ను భజించెదరు.

చౌ॥ త్యాగహి కర్మ సుభా సుభ దాయక ।
భజహిఁ మోహి సుర నర ముని నాయక ॥
సంత అసంతన్హ కె గున భాషే ।
తే న పరహిఁ భవ జిన్హ లఖి రాఖే ॥ 4

తా॥ వారీ కారణముచే సుభాసుభములగు కార్యములు వదలి దేవతలు, మానవులు, మునిశ్రేష్ఠులు నన్ను భజించెదరు. నేను సాధువుల దుర్మార్గుల గుణముల దెల్పితిని. ఏమానవులు ఈగుణములు దెలిసికొని,

ఆచరణయందుంచెదరో జన్మ మరణ రూపమనెడు సంసార-సముద్రమున బడరు.

దో॥ సునహు తాత మాయాకృత గున అరు దోష అనేక।
గున యహ ఉభయ న దేఖి అహిం దేఖి అ సో అవివేక।

తా॥ సోదరుడా! వినుము. మాయచే అనేక గుణదోషములు గలవు. వీనిలో నిజమగు గుణములు ఏవియులేవు. వీనిలో వివేకావివేక గుణములు గలవు. జూచుటకు వీలుగానివి. వివేకముగూడ అవివేకముగనే యుండును.

చౌ॥ శ్రీముఖ బచన సునత సబ భాఈ।
హరషే ప్రేమ న హృదయఁ సమాఈ॥
కరహిం బినయ అతి బారహిం బారా।
హనుమాన హియఁ హరష అపారా॥ 1

తా॥ భగవానునియొక్క శ్రీముఖమునుండి వచ్చిన పలుకులు విని లక్ష్మణ, భరత, శతృఘ్నులానందించిరి. వారికి గలిగిన ఆనందము వర్ణనాతీతము. వారనేక పర్యాయములు చెప్పుకొనిరి విశేషమగు సంతోషముతో ఆంజనేయుడుండెను.

చౌ॥ పుని రఘుపతి నిజ మందిర గఏ।
ఏహి బిధి చరిత కరత నిజ నఏ॥
బార బార నారదముని ఆవహిం।
చరిత పునీత రామ కే గావహిం॥ 2

తా॥ శ్రీరామచంద్రుడు తనమహలుకు వెడలెను. శ్రీరాముడీవిధముగ క్రొంగ్రొత్త లీలలు జేయుచుండెను. నారదముని అనేకపర్యాయములు అయోధ్యకు వచ్చి శ్రీరామచంద్రులవారి దివ్యచరిత్రలు గానము జేసెను.

చౌ॥ నిత నవ చరిత దేఖి ముని జాహీఁ ।
బ్రహ్మలోక సబ కథా కహాహీఁ ॥
సుని బిరంచి అతిసయ సుఖమానహీఁ ।
పుని పుని తాత కరహు గున గానహీఁ ॥ 3

తా॥ నారదుడు అయోధ్యలో నిత్యము క్రొంగొత్త లీలలు జూచి బ్రహ్మలోకమున కెడలి వారికి సర్వమును దెలియ జెప్పెడువాడు. బ్రహ్మ విని మిక్కిలి ఆనందించెడువాడు. మాటమాటకు శ్రీరామచంద్రుని గుణములు గానము జేయుమని నారదునకు జెప్పెడువాడు.

చౌ॥ సన కాదిక నారదహి సరాహహీఁ ।
జద్యపి బ్రహ్మ నిరత ముని ఆహహీఁ ॥
సుని గున గ్యాన సమాధి బిసారీ ।
సాదర సునహి పరమ అధికారీ ॥ 4

తా॥ సనకాది మహర్షులు నారదుని స్తుతించెడివారు. ఆ మహర్షులు బ్రహ్మనిష్ఠా పరాయణులయినను శ్రీరామచంద్రుని గుణగణములు విని బ్రహ్మసమాధిని మరచెడువారు. ప్రేమతో శ్రీరామచంద్రుని దివ్యకథను వినెడువారు శ్రీరాముని కథను వినుటకు వారే తగిన అధికారులు.

దో॥ జీవనముక్త బ్రహ్మపర చరిత సునహిఁ తజి ధ్యాన్ ।
జే హరి కథాఁ న కరహిఁ రతి తిన్హ కే హియ పాషాన్ ॥

తా॥ సనకాది మహర్షులు జీవన్ముక్తులెట్లో అట్లే బ్రహ్మనిష్ఠాపరాయణులై యుండిరి. అట్టివారు గూడ సమాధిని వదలి శ్రీరామచంద్రుని దివ్యకథలు వినుచుండిరి. యిది తెలిసియుండియు శ్రీరామచంద్రుని కథలు ప్రేమతో విననట్టివారు రాతి హృదయులు (రాతితో సమానమని అర్థము)

చౌ॥ ఏకబార రఘునాథ బోలాఏ।
గుర ద్విజ పురబాసీ సబ ఆఏ॥
బైఠే గురముని అరుద్విజ సజ్జన।
బోలే బచన భగత భవ భంజన॥ 1

తా॥ ఒకపర్యాయము శ్రీరామచంద్రుడు గురువగు వశిష్ఠులవారిని, బ్రాహ్మణులను, నగరములోని యితరులను బిలువనంప వారెల్లరు వచ్చిరి. ఆ వచ్చిన గురువులకు, మహర్షులకు, బ్రాహ్మణులకు, సజ్జనులకు యథోచిత ఆసనములు గల్పింప వానిపై ఆసీనులైరి. భక్తుల జనన–మరణ చక్రము నుండి తప్పించు శ్రీరామచంద్రుడు యిట్లు పలుకసాగెను.

చౌ॥ సునహు సకల పురజన మమ బానీ।
కహఉఁ న కఛు మమతా ఉర ఆనీ॥
నహిఁ అనీతి నహిఁ కఛు ప్రభుతాఈ।
సునహు కరహు జో తుమ్హహి సోహాఈ॥ 2

తా॥ సమస్త జనులారా! పట్టణ నివాసులారా! నామాటలు వినుడు. నేనీమాటలు మోసపూరితమగు ప్రేమతో చెప్పుటలేదు. నీతివిరుద్ధముగ పలుకుటలేదు. వీనిలో నాగొప్పతనము లేదు. సంకోచమును, భయమును వదలి ధ్యానముతో జూడుము. నామాటలు విని మంచియని మీకుతోచిన యెడల వానిని అనుష్ఠింపుము

చౌ॥ సోఇ సేవక ప్రియతమ మమసోఈ।
మమ అను సాసన మానై జోఈ॥
జౌఁ అనీతి కఛు భాషౌ భాఈ।
తౌ మోహి బరజహు భయ బిసరాఈ॥ 3

తా॥ నామాటల నెవరు పాటించెదరో వారే నాసేవకులు, ప్రియులు ప్రియతములై యుండెదరు. నేను నీతికి విరుద్ధములగు మాటలు పలికి యుండిన యెడల భయమును వదలి నన్ను అడ్డుకొనవచ్చును.

చౌ॥ బడే భాగ మానుష తనుపావా ।
సుర దుర్లభ సబ గ్రంద న్హి గావా ॥
సాధన ధామ మోచ్ఛ కర ద్వారా ।
పా ఇ న జేహిం పరలోక సంవారా ॥

తా॥ గొప్ప అదృష్టమువలన మానవ శరీరము లభించినది. ఈశరీర ప్రాప్తి దేవతలకుగూడ దుర్లభమైనట్టిదని వేదములలో. పురాణములలో, వుపనిషత్తులలో జెప్పబడి యుండెను. సాధనకు నిలయమైనది, మోక్షమునకు సింహద్వారము. యిట్టి శరీరమును బొందియు స్వర్గలోకమువేల కోరుకొనవు.

దో॥ సో పరత్ర దుఖ పావఇ సిరధుని ధుని పఛితాఇ ।
కాలహి కర్మహి ఈశ్వరహి మిథ్యా దోసలగాఇ ॥ 43

తా॥ అట్టివాడు పరలోకమందు దుఃఖముల బొందును ఆతడు తన తప్పులెరుంగక కాలమును, ఈశ్వరుని నిందించును. వారికి దోషములంటగట్టును.

చౌ॥ ఎహి తన కర ఫల బిషయ న భాఈ ।
స్వర్గఉ స్వల్ప అంత దుఖదాఈ ॥
నర తను పాఇ బిషయం మన దేహీం ।
ఫలటి సుధా తే సఠ బిష లేహీం ॥

తా॥ ఈ శరీరము లభించినది విషయభోగములు అనుభవించుటకు గాదు. ఈ జగత్తులోగల భోగములేమిటి స్వర్గభోగములుగూడ తుచ్ఛములు అంతమందు దుఃఖమును గలిగించునట్టివే. కావున సోదరుడా! మానవశరీరము బొందియు విషయలంపటమందు నీమనస్సు చిక్కినేని అమృతభాండమునొదలి విషభాండమును బొందుటయే అట్టివాడు పరమమూర్ఖుడు

చౌ॥ తాహి కబహుఁ భల కహఇ న కోఈ ।
గుంజా గ్రహఇ పరస మని ఖోఈ ॥
ఆకర చారి లచ్ఛ చౌరాసీ ।
జోని భ్రమత యహ జీవ అవినాసీ ॥

తా॥ పరుసవేదినిచ్చి గురుగింజలు తీసుకొనమని బుద్ధిమంతుడెవరికి చెప్పడు. జీవుడు అవినాశి. యెనుబది నాలుగులక్షల యోనులలో తిరుగుచు యుండును.

చౌ॥ ఫిరత సదా మాయాకర ప్రేరా ।
కాల కర్మ సుభాఉ గున ఘేరా ॥
కబహుఁక కరి కరునా నర దేహీ ।
దేత ఈస బిను హేతు సనేహీ ॥

తా॥ మాయాప్రేరణ ప్రభావమువలన కాలము, కర్మ, స్వభావము గుణములు వీని వశమున ఉండును. ఇవి యెల్లప్పుడు తిరుగుచు యుండును. కారణము లేకుండగనే ఈశ్వరుడనుగ్రహించి మానవశరీరము నిచ్చెను.

చౌ॥ నర తను భవ వారిధి కహుఁ బేరో ।
సన్ముఖ మరుత అనుగ్రహ మేరో ।

కరన ధార సదగురు ధృడ నావా ।
దుర్లభ సాజ సులభ కరి పావా ॥ 4

తా॥ ఈ మానవశరీరము సంసార సముద్రమును దాటుటకు పడవ వంటిది, నాఅనుగ్రహామే అనుకూలమగునట్టి తెరచాప. ఈ దృఢమగు పడవకు చుక్కానివంటి వాడు సద్గురువు కఠినమైనట్టి సాధనలుగూడ భగవానుని అనుగ్రహము వలన సుగమమగును.

దో॥ జో న తరై భవ సాగర నర సమాజ అస పాఇ ।
సో కృత నిందక మందమతి ఆత్మాహాన గతి జాఇ ॥ 44

తా॥ ఏ మానవుడిట్టి అవకాశమును బొందిగూడ సంసారసముద్రము నుండి తరించుటకు ప్రయత్నించడో అట్టివాడు కృతఘ్నుడు, మందబుద్ధియునై యున్నాడు. ఆత్మహత్యఁ గావించుకొనువారు పొందునట్టి నీచ స్థానమునుబొందుదురు.

చౌ॥ జౌఁ పరలోక ఇహాఁ సుఖ చహహూఁ ।
సుని మమ బచన హృదయఁ దృఢ గహహూఁ ॥
సులభ సుఖద మారగ యహ భాఈ ।
భగతి మోరి పురాన శృతి గాఈ ॥ 1

తా॥ (పరలోకము, భూలోకము అను రెండులోకములు గలవు.) సుఖము, సంతోషము గావలెనన్న కోరిక గలిగియుండునేని నామాటలు విని వానిని హృదయమందు దృఢముగ పెట్టుకొనుము సోదరుడా! భక్తిమార్గముతో నన్నుజేరుట సులభము. సుఖదాయకము. వేదములు, పురాణములు శాస్త్రములలోగూడ చెప్పబడియుండెను

చౌ॥ గ్యాన అగమ ప్రత్యూహ అనేకా।
సాధన కఠిన న మన కహుఁ టేకా।
కరత కష్ట బహు పావఇ కోఊ॥
భక్తి హీన మోహి ప్రియ నహిఁ సోఊ॥

తా॥ జ్ఞానమార్గము అగమ్యమైనది. దానిని బొందవలెనన్న అనేక విఘ్నములు గలుగును. సాధించుట కఠినాతికఠినము. దానియందు మనస్సున కాధారము లభింపదు, మిక్కిలి కష్టపడినవారు మాత్రమే దానిని పొందెదరు అట్లు పొందినవారిలో భక్తి లేనియెడల నాకు ప్రియులుగారు.

చౌ॥ భక్తి సుతంత్ర సకల సుఖ ఖానీ।
బిను సత సంగ న పావహిఁ ప్రానీ॥
పున్య పుంజ బిను మిలహిఁ న సంతా।
సత సంగతి సంసృతి కర అంతా॥ 3

తా॥ భక్తి సర్వస్వతంత్రమైనది. సర్వవిధములగు సుఖములకు నిలయమైనది. కాని సత్సంగము లేనియెడల ఏ ప్రాణియు దీనిని బొంద జాలదు. ఎంతో పుణ్యముండినగాని మహాత్ములతో సాంగత్యము లభింపదు. మహాత్ములతో స్నేహము జనన - మరణ చక్రమునుండి తప్పించును. అంతముచేయును.

చౌ॥ పున్య ఎక జగ మహుఁ నహిఁ దూజా।
మన క్రమ బచన విప్ర పద పూజా॥
సానుకూల తేహి పర ముని దేవా।
జో తజి కపటు కరఇ ద్విజ సేవా॥

తా॥ ప్రపంచమందు పుణ్యముతో సమానమైనదేదియు లేదు మనో వాక్కాయ కర్మలద్వారా బ్రాహ్మణ చరణముల పూజింపవలెను కపటము నొదలి బ్రాహ్మణ సేవలుజేసిన వారలను దేవతలనుగ్రహించెదరు

దో॥ ఔర ఉ ఎక గుపుత మత సబహి కహఉఁ కర జోరి ।
శంకర భజన బినా నర భగతి న పావఇ మోరి ॥ 5

తా॥ దీనియందొక రహస్యము గలదు నేనారహస్యమును మీకు నమస్కరించుచు జెప్పుచున్నాను శంకరుని భజించని మానవులు నాభక్తిని బొందలేరు.

చౌ॥ కహహు భగవతి పథ కవన ప్రయాసా ।
జోగ నమఖ జప తప ఉప వాసా ॥
సరల సుభాఉ న మన కుటిల లాఈ ।
జథా లాభ సంతోష సదాఈ ॥ 1

తా॥ భక్తిమార్గమందు ఎట్టి కష్టముగలదో చెప్పుడు. దీనికి యోగము చేయవలసిన పనిలేదు. యజ్ఞముగాని, జపముగాని, తపస్సుగాని చేయవలసిన పనేలేదు. వుపవాసమక్కరలేదు, దీనికి గావలసినది సరళ స్వభావము, కుటిలతలేకుండ వుండుటయును, యధాలాభ సంతోషము గలిగి యుండుటయే భక్తికి గారణము.

చౌ॥ మోరదాస కహాఇ నర ఆసా ।
కరఇ తౌ కహహు కహా బిస్వాసా ॥
బహుత కహఉఁ కా కథా బఢాఈ ।
ఏహి ఆచరన బస్య మైం భాఈ ॥ 2

తా॥ నా దాసులని జెప్పుకొని కొందరు ఎన్నో ఆశలు జూపెదరు అట్టివారికి నాపై ఏమివిశ్వాసముండునో నీవేజెప్పుము. (అట్టివారికి నా యందు దృఢసమ్యకము. శ్రద్ధా వుండదు.) నేను చాలవిషయములు జెప్పితిని. ఇంకేమి చెప్పగలను. సోదరుడా! నేజెప్పినవి ఆచరించినయెడల వశుడ నయ్యెదనని తెలిసికొనుము.

చౌ॥ వైర న విగ్రహా ఆస న త్రాసా।
సుఖ మయ తాహి సదా సబ ఆసా॥
అనారంభ అనికేత అమానీ।
అనఘ అరోష దచ్ఛ బిగ్యానీ॥ 8

తా॥ ఎవరితోను విరోధించకుము. దెబ్బలాటలు — తగవులాడకుండుము. ఆశజూపకుము. భయపెట్టకుము అట్టివారికి సర్వదిశలందు, సర్వకాలములందు సుఖముగ నుండును. ఫలాపేక్ష రహితుడును, తన యింటియందు మమకారము లేనివాడును, అభిమానము లేనివాడును, పాపము లేనివాడును, కోపము లేనివాడునునై యుండిన భక్తుడు నిపుణుడును, జ్ఞానియునైయున్నాడు.

చౌ॥ ప్రీతి సదా సజ్జన సంసర్గా।
తృన సము బిషయ స్వర్గ అపవర్గా॥
భగతి పచ్ఛ హాఠ నహిం సఠ తాఈ।
దుష్ట తర్క సబ దూరి బహాఈ॥ 4

తా॥ మహాత్ముల ప్రేమించువారలకు, వారితో కాలము గడపువారలకు స్వర్గము ముక్తులుగూడ తృణమువలె దోచును భక్తిగలవారు యితరమత ఘుల ఖండింపరు. కుతర్కాలోచనలు జేయరు.

దో॥ మమ గున గ్రామ నామరత గత మమతా మద మోహా।
తాకర సుఖ సోఇ జానఇ పరానంద సందోహా॥ 46



తా॥ యెవరు నా నామమును, గుణసమూహములను గానము జేయుదురో అట్టివారలకు మమత్వము, మదము, మోహములేకుండ యుండెదరు. ఆసుఖము వారనుభవించును. పరమ సంతోషమును బొందును.

చౌ॥ సునత సుధా సమ వచన రాముకే।
గహే సబని పద కృపా ధాముకే॥
జనని జనక బంధు హమారే।
కృపానిధాన ప్రాన తే ప్యారే॥ 1

తా॥ శ్రీరామచంద్రుని అమృతపు పలుకులువిని వారెల్లరు ఆదయా సముద్రుని పాదములు పట్టుకొని యిట్లుపలికిరి. ఓదయాసముద్రుడా! నీవు మాకుతల్లివి, తండ్రివి, గురుడవు, సోదరుడవు, దైవమునైయుంటివి. ప్రాణములకంటె మాకు అధికప్రియుడవు.

చౌ॥ తను ధను ధామ రామ హితకారీ।
సబ బిధి తుమ్హ ప్రనతారితి హారీ॥
అసిసిఖ తుమ్హ బిను దేఇ న కోఉ।
మాతు పితా స్వారథ రత కోఉ॥ 1

తా॥ శరణాగతుల దుఃఖముల నాశనముజేయు దశరథరామా! నీవే మాశరీరము, ధనము, ఇల్లు-ద్వారమునై యుంటివి. సర్వవిధముల మేలు జేయువాడవునై యున్నావు. ఇదే నీవిధానము. దీనికి వ్యతిరేకముగ ఏమియు

జరుగదు. తల్లిదండ్రులవలె మేలుగోరువాడవు నీవే. కాని తల్లి-తండ్రుల స్వార్థపరాయణులై సత్క్రమమగునట్టి శిక్షణను యివ్వరు.

చౌ॥ హేతు రహిత జగ జుగ ఉపకారీ।
తుమ్హ తుమ్హార సేవక అసురారీ॥
స్వారథ మీత సకల జగమాహీం।
సపనేహుఁ ప్రభు పరమారథ నాహీం॥ 3

తా॥ రాక్షసనాశకుడా! శ్రీరామా! నీవు కారణములేకయే స్వార్థరహితుడవై ఉపకారమును జేయువాడవు. ఇతరులు నీసేవకులు. ఈ ప్రపంచములోని వారెల్లరు స్వార్థపరులే. దానికే వారుమిత్రులు. వారియందు స్వప్నములోగూడ పరమాత్మ భావనలుండవు.

చౌ॥ సబకే బచన ప్రేమ రస సానే।
సుని రఘు నాథ హృదయఁ హరషానే॥
నిజ నిజ గృహ గయే ఆయసు పాఈ।
బరనత ప్రభు బత కహీ సుహాఈ॥ 4

తా॥ వారెల్లరియొక్క ప్రేమరసవాక్కులు విని శ్రీరామచంద్రుడు మిక్కిలి ఆనందించెను. వారెల్లరు శ్రీరామచంద్రుని ఆజ్ఞనుపొంది శ్రీవారి గొప్పవియగు గుణగణముల వర్ణించుకొనుచు వారివారి గృహములకు బయలుదేరిరి.

దో॥ ఉమా అవధ వాసీ నర నారీ కృతారథ రూప।
బ్రహ్మ సచ్చిదానంద ఘన రఘు నాయక జహఁభూప॥

తా॥ (శివుడు పార్వతితో యిట్లు చెప్పుచున్నాడు.) ఓఉమా! శ్రీ అయోధ్యాపురములో నివసించు స్త్రీపురుషులు కృతార్థులు. ధన్యస్వరూపులు. సచ్చిదానంద స్వరూపుడు, పరబ్రహ్మయునగు శ్రీరామచంద్ర మహారాజా పురమునకు రాజై యుండెను.

చౌ॥ ఏక బార బసిష్ట ముని ఆఏ।
జహాఁ రామ సుఖధామ సుహాఏ॥
అతి ఆదర రఘునాథ కీన్హా।
పద పఖారి పాదోదక లీన్హా॥ 1

తా॥ సుందరాకారుడు సర్వసుఖములకు నిలయుడునగు శ్రీరామ చంద్ర మహారాజులవారున్న ప్రదేశమునకు ఒకపర్యాయము శ్రీవశిష్ఠుల వారు వేంచేసిరి. శ్రీరాముడా కులగురువగు వశిష్ఠులవారిని ప్రేమతో ఆదర-సత్కారములు జరిపి పాదప్రక్షాళన జరిపి ఆ చరణామృతమును స్వీకరించెను.

చౌ॥ రామ సునహు ముని కహ కరజోరీ।
కృపాసింధు బినతీ కఛు మోరీ॥
దేఖి దేఖి ఆచరన తుమ్హారా।
హోత మోహ మమ హృదయఁ అపారా॥ 2

తా॥ వశిష్ఠ మహర్షులవారు రెండుచేతులు జోడించుకొని దయాసముద్రుడగు శ్రీరామచంద్రులవారితో నిట్లు పలుకసాగెను. దశరథరామా! నా విన్నపముల నాలించుము. మీ మానవాచరణలు చరిత్రలు చూడగాచూడగా నామనస్సున అపారమగు మోహము గలుగుచున్నది.

చౌ॥ మహిమా అమిత వేద నహిఁజానా ।
మై కేహి భాంతి కహఉఁ భగవానా ॥
ఉప రోహిత్య కర్మ అతి మందా ॥
బేద పురాన స్మృతి కర నిందా ॥

తా॥ ఓరామా! నీమహిమలకు అవధులులేవు. వానిని వేదములు గూడ సాంతముగ ఎరుంగలేకుండెను. దానిని నేనెట్లు వర్ణించగలను? పురోహితకార్యము మిక్కిలి నీచమైనదని వేదములు, పురాణములు, స్మృతుల మొదలుగాగల శాస్త్రములన్నియు నిందించుచున్నవి,

చౌ॥ జబ న లేఉఁ మైఁ తబ బిధి మోహీ ।
కహా లాభ ఆగేఁ సుత తోహీఁ ॥
పరమాత్మా బ్రహ్మ నర రూపా ।
హోఇహి రఘుకుల భూషన భూపా ॥

తా॥ సూర్యవంశమునకు పురోహితకార్యములు చేయుటకు నేనొక పర్యాయము ఒప్పుకొనలేదు. అప్పుడు బ్రహ్మ నాకిట్లుజెప్పెను. ఓపుత్రా! నీవు దీనిని స్వీకరించిన కొంతకాలమునకు మిక్కిలి లాభముగలఁగును. స్వయముగ పరబ్రహ్మ మానుషరూపమును ధరించి రఘుకులభూషణుడై రాజగును.

దో॥ తబమై హృదయఁ బిచారా జోగ జగ్య వ్రత దాన ।
జా కహుఁ కరియ సో పైహఉఁ ధర్మ న ఎహి సమ ఆన॥

తా॥ యోగ, యజ్ఞ, వ్రత, జప, దానములుచేసి, ఏఫలితమును పొందుచున్నారో అట్టి ఫలితమును నేను నాకర్మలద్వారా సులభముగ పొంద

వచ్చునని నిశ్చయించికొంటిని. దీనికంటె సులభమైన ధర్మము యింకొటి లేదని నిశ్చయించితిని.

చౌ॥ జప తప నియమ జోగ నిజ ధర్మా ।
శృతి సంభవ నానా శుభ కర్మా ॥
గ్యాన దయా దమ తీరథ మజ్జన ।
జహఁ లగి ధర్మ కహాత శృతి సజ్జన ॥ 1

తా॥ జప, తప, నియమ, యోగములగూర్చి వారి–వారి వర్ణాశ్రమ ధర్మములగూర్చి వేదములలో మిక్కుటముగ జెప్పబడియుండెను. శుభ కర్మల, జ్ఞానమును, దయా, సత్యమును యింద్రియనిగ్రహమును, తీర్థస్నానములను, వాటివలన గలుగుమహాత్తులను, వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, సత్పురుషులు జెప్పిరి, చెప్పుచుండిరి.

చౌ॥ ఆగమ నిగమ పురాన అనేకా ।
పఢె సునే కర ఫల ప్రభువేకా ॥
తవ పద పంకజ ప్రీతి నిరంతర ।
సబ సాధన కర యహ ఫల సుందర ॥ 2

తా॥ ప్రభూ! అనేక శాస్త్రములు, వేదపురాణములు చదివినను విన్నను ఉత్తమఫలిత మొకటియే. సర్వసాధనలు జేసినను సుందరమగు ఫలిత మొకటిగ్గియేయున్నది. అదే నీచరణములయందు సర్వదాగలుగు ప్రేమ.

చౌ॥ ఛూటు యి మలకి మలహి కేధోఏఁ ।
ఘృత కిపావ కోఇ బారి బిలోఏఁ ॥

ప్రేమ భగతి జల బిను రఘురాఈ ।
అభిఅ అంతర మల కబహుఁ న జాఈ ॥

తా॥ మురికిని మురికిచేత కడిగిన ఆ మైల తొలగునా? నీటిని మథించిన నేయివచ్చునా? అదేవిధముగ దశరథరామా! ప్రేమ భక్తియను నిర్మలజలములు లేకుండగ అంతఃకరణమునగల మైలతొలగి మురికిపోదు, (అనగా మనస్సును ప్రేమ భక్తియను నిర్మలజలముతో గడిగననేని మాలిన్యము నశించును.

చౌ॥ సోఇ సర్వగ్య తగ్య సోఇ పండిత ।
సోఇ గున గృహ బిగ్యాన అఖండిత ॥
దచ్ఛ సకల లచ్ఛన జుత సోఈ ।
జాకే పద సరోజ రతి హోఈ ॥

తా॥ శ్రీరామా! నీ చరణకమలములందు ప్రేమ ఉండువాడే సర్వజ్ఞుడు. అతడే తత్త్వజ్ఞుడు, పండితుడు, సర్వసద్గుణసంపన్నుడు; విజ్ఞానవంతుడు. చతురుడును సర్వసుఖలక్షణ సంపన్నుండునునై యుండును.

దో॥ నాథ ఏక వర మాగఉఁ రామ కృపా కరి దేహు ।
జన్మ జన్మ ప్రభు పద కమల కబహుఁ ఘటై జని నేహు ॥

తా॥ శ్రీరామా! నేనొక వరమడుగుచున్నాను. దయతో అనుగ్రహింపుము. సర్వకాల సర్వావస్థలలో, జన్మ-జన్మలయందు నీచరణములయందు ప్రేమగలుగునట్లు చెదరని భక్తిని ప్రసాదింపుము.

చౌ॥ అస కహి ముని బసిష్ఠ గృహ ఆఏ ।
కృపా సింధు కేమన అతిభాఏ ॥

హనుమాన భరతాదిక భ్రాతా ।
సంగ లియే సేవక సుఖదాతా ॥ 1

తా॥ అని పలికి వశిష్ఠమహర్షులవారు గృహమునకు వెడలిరి. దయా సముద్రుడగు శ్రీరామచంద్ర మహారాజు మిక్కిలి ఆనందించెను. తదనంతరము భక్తోద్ధారకుడగు శ్రీరామచంద్రుడు ఆంజనేయుని తమ్ములగు భరత లక్ష్మణ, శతృఘ్నుల వెంటనిడుకొని,

చౌ॥ పుని కృపాల పుర బాహేర గఏ ।
గజ రథ తురగ మగావత భఏ ॥
దేఖి కృపాకరి సకల సరాహే ।
దిఏ ఉచిత జహ జిన్హ తేఇ చాహె ॥ 1

తా॥ అయోధ్యానగరము వెలుపలకు బయలుదేరి ఏనుగుల, గుఱ్ఱములు, రథముల దెప్పించి వారివారి యిష్టానుసారముగ అధిరోహించిరి.

చౌ॥ హరన సకల శ్రమ ప్రభు శ్రమపాఈ ।
గఏ జహాఁ సీతల అవఁరాఈ ॥
భరత దీన్హ నిజ బసన డసాఈ ।
బైఠే ప్రభు సేవహిఁ సబ భాఈ ॥ 3

తా॥ జనన-మరణ చక్రబంధములనుండి తప్పించు శ్రీరామచంద్ర ప్రభువులవారు ఏనుగులకు, గుఱ్ఱములకు, ఒంటెలకు గలిగిన బడలికను పోగొట్టుటకై చల్లని నీడలచే అలరారుచున్న మామిడి తోటలలోనికి వెడలిరి. అచ్చట ప్రభువు కూర్చుండుటకై భరతుడు తన వస్త్రమును పరచెను. శ్రీరామచంద్రులవారు ఆవస్త్రముపై కూర్చుండ సోదరులెల్లరు సేవలుచేయ సాగిరి.

చౌ॥ మారుత సుత తబ మారుత కరఈ।
పులక బపుష లోచన జల భరఈ॥
హనుమాన సమ నహిం బడ భాగీ।
నహిం కోఉ రామ చరన అనురాగీ॥ 4
గిరిజా జాసు ప్రీతి సేవకాఈ।
బార బార ప్రభు నిజ ముఖ గాఈ॥ 5

తా॥ ఆసమయముననే పవనపుత్రుడు విసనకఱ్ఱతో గాలిని విసరుచుండెను. ఆతని శరీరము పులకరించుచుండెను. నేత్రములు ప్రేమాశ్రువు ధారలచే నిండియుండెను. (శివుడిట్లు జెప్పుచున్నాడు) ఓపార్వతీ! హనుమంతునితో సమానుడైన అదృష్టవంతుడు లేడు శ్రీరాముని యందంతటి భక్తిగల పురుషులులేరు. సేవకుడగు ఆంజనేయుని శ్రీరామచంద్రుడనేక పర్యాయములు కీర్తించెను.

దో॥ తేహి అవసర ముని నారద ఆఏ కరతని బీనా।
గావన లగే రామ కలకీరతి సదానవీనా॥

తా॥ ఆసమయమున నారదుడు చేతితో వీణనుమీటుచు బయలుదేరి వచ్చెను. సుందరుడు, నిత్యకళ్యాణము పచ్చతోరణముగనుండు శ్రీరామచంద్రుని గీర్తించుచుండెను.

చౌ॥ మామవ లోకయ పంకజ లోచన।
కృపా బిలోకని సోచ బిమోచన॥
నీల తామరస స్యామ కామ అరి।
హృదయ కంజ మకరంద మధుప హరి॥ 1

తా॥ దయాసముద్రుడగు శ్రీరామచంద్రుడు చూపులచేతనే దుఃఖమును, బాధలహరించు పద్మనయనుడా! నన్ను అనుగ్రహించుడు నాపై శోక పర్యాయము జూడుడు. ఓహరీ! నీవు నీలకమలమువంటి శ్యామల వర్ణము గలవాడవు మదనాంతకుడగు పరమశివుని హృదయకమలములలో గల మకరందమును (ప్రేమామృతమును) పానముచేయుటయందు భ్రమరమువంటి వాడవు,

చౌ॥ జాతుధాన బరూథ బలభంజన।
ముని సజ్జన రంజన అఘ గంజన॥
భూసుర ససి నవ బృంద బలాహక।
అసరన శరన దీన జన గాహక॥ 2

తా॥ రామా! నీవు రాక్షససేనలకు గల బలమును నాశనము జేయువాడవు. మునీశ్వరులకు సత్పురుషులకు ఆనందమును గలుగుజేయువాడవు. పాపముల నాశనము జేయువాడవు. రామా! నీవు బ్రాహ్మణ రూపమునగల పొలమునకు, పంటకు మేఘముల వంటివాడవు. రక్షణలేనివారికి రక్షణలు గల్పించువాడవు. దీనజనులను రక్షించువాడవు.

చౌ॥ భుజబల బిపుల భార మహి ఖండిత।
ఖరదూషణ బిరాధ వధ పండిత॥
రావనారి సుఖ రూప భూపవర।
జయ దశరథ కుల కుముద సుధాకర॥ 3

తా॥ శ్రీరామా! నీభుజబలముచే గొప్పదగు భూభారమును హరించువాడవు. ఖర-దూషణ-విరాధుల వధించుటయందు నేర్పుగలవాడవు. రావణాంతకా! ఆనందస్వరూపా! రాజశ్రేష్ఠా! దశరథుని కులరూపమనునట్టి

తామర పుష్పముల వికసింపజేయు చంద్రమా! శ్రీరామచంద్రా! నీకు జయమగు గాక ! జయమగుగాక.

చౌ॥ సుజస పురాన బిదిత నిగమాగమ ।
గావత సుర ముని సంత సమాగమ ॥
కారునీక వ్యలీక మద ఖండన
సబ బిధి కుసల కోసలా మండన ॥

తా॥ నీదివ్యమగు కీర్తిపురాణములలోను. తంత్రాది శాస్త్రములలోను కీర్తింపబడియున్నది దేవతలు మునులు, సత్పురుషులు, మహాత్ములు నిన్నెపుడును కీర్తించుచుందురు. నీవు దయా సముద్రుడవు అసత్యమును మదమును నాశనము జేయువాడవు. సర్వవిధముల ఆరితేరినవాడవు. అయోధ్యాపురమునకు మణివంటివాడవు

చౌ॥ కలి మల మథన నామ మమ తాహన ।
తులసీ దాస ప్రభు పాహి ప్రనతజన ॥ 5

తా॥ నీనామము కలియుగ పాపముల నశింపజేయును. మమతను చంపును. తులసీదాసునకు ప్రభువగు దశరథరామా! శరణాగతుల రక్షింపుము.

దో॥ ప్రేమ సహిత ముని నారద బరని రామ గునగ్రామ ।
శోభాసింధు హృదయఁ ధరి గఏ జహాఁ బిధి ధామ ॥ 49

తా॥ శ్రీరామచంద్రుని యొక్క అనంతకళ్యాణ గుణముల ప్రేమతో గానముజేసి మునిశ్రేష్ఠుడగు నారదుడు ప్రభువును హృదయమందు ధరించి బ్రహ్మలోకమునకు వెడలెను.

చౌ॥ గిరిజా సునహు బి సద యహ కథా ।
మై సబ కహీ మోరిమతి జథా ॥
రామ చరిత సతకోటి అ పారా ।
శృతి సారదా న బరనై పారా ॥

తా॥ (శివుడు చెప్పుచున్నాడు) ఓపార్వతీ! వినుము. నేనీ ఉజ్జ్వల మగునట్టి శ్రీరామకథను నాబుద్ధిననుసరించి చెప్పితిని. శ్రీరాముని చరిత్రలు నూఱుకోట్ల శ్లోకములతోనిండి అపారముగ వర్ణింపబడియున్నది. నాలుగు వేదములు, సరస్వతి, అనంతశేషుడుగూడ వర్ణింపలేరు.

చౌ॥ రామ అనంత అనంత గునానీ ।
జనమ కర్మ అనంత నామానీ ।
జలసీ కర మహి రజ గని జాహీం ।
రఘుపతి చరిత న బరని సిరాహీం ॥ 2.

తా॥ భగవానుడగు శ్రీరామచంద్రుడు అనంతుడు. ఆతని గుణములు అనంతములు. జన్మలు, కర్మలు, నామములు అనంతములు. సముద్రములోని నీటితుంపరల, భూమియందుగల ధూళిరేణువుల లెక్కించ ఎవరికి సాధ్య మగును? ఆదేవిధముగ శ్రీరామచంద్రుని కధలువర్ణింప ఎవరికిని శక్యము గాదు.

చౌ॥ బిమల కథా హరి పద దాయనీ ।
భగతి హోఇ సుని అనపాయనీ ॥
ఉమా కహఉఁ సబ కథా సుహాఈ ।
జో భుసుండి ఖగపతిహి సునాఈ ॥ 3.

తా॥ పరమ పవిత్రమగుకథ భగవానుని పరమపదము నిచ్చునదై యున్నది. ఈదివ్యమగు కథను వినిన చలనములేని భక్తి గలుగును. ఉమా! కాకభుశుండి గరుడునకు జెప్పిన సుందరము, దివ్యమునగు శ్రీరామ కథను నీకు జెప్పితిని.

చౌ॥ కఛుక రామ గున కహేఉఁ బఖానీ ।
అబ కా కహేఁ సో కహహు భవానీ ॥
సుని సుభకథా ఉమా హరషానీ ।
బోలీ అతి బినీతి మృదు బానీ ॥ 5

తా॥ ఓ పార్వతీ! శ్రీరామచంద్రుని గుణముల, కథలు కొద్దిపాటి జెప్పితిని. నీ కిప్పుడేమికావలెనో చెప్పుము? మంగళకరమగు శ్రీరామ చంద్రుని దివ్యకథలు వినుటచే పార్వతీదేవికి మిక్కిలి ఆనందము గలిగి వినయముగ నిట్లు పలుకసాగెను.

చౌ॥ ధన్య ధన్య మై ధన్య పురారీ ।
సునేఁ రామ గున భవ భయ హారీ ।

తా॥ ఓ త్రిపురారీ! నేను ధన్యురాలను. జనన-మరణ భయమును దొలగించు శ్రీరామచంద్రుని దివ్యకథలు వింటిని.

దో॥ తుమ్హరీ కృపాఁ కృపాయతన అబ కృత కృత్య న మోహ।
జానే ఉఁ రామ ప్రతాప ప్రభు చిదానంద సందోహ॥52

తా॥ దయాసముద్రుడవగు రామా! నీయొక్క దివ్యానుగ్రహము వలన మేమదృష్టవంతులమైతిమి. ఇప్పుడు నాకేమాత్రము మోహములేదు. ప్రభూ! సచ్చిదానంద స్వరూపుడగు శ్రీరామచంద్రుని దివ్యప్రభావమును తెలిసికొన్నదాననైతిని.

దో॥ నాథ తవానన ససి స్రవత కథా సుధా రఘుబీర ।
శ్రవన పుటన్హి మన పాన కరి సహిం అఘాత మతిధీర ॥

తా॥ నాథా! నీయొక్క ముఖరూపమనెడు చంద్రునినుండి శ్రీరఘు వీరునియొక్క కథారూపమనెడు అమృతముయొక్క ధారలు స్రవహించు చున్నవి. ఓవరమప్రియా! శంకరా! మతిధీరా! నామనస్సు చెవులద్వారా పానము చేయుచున్నాను. తృప్తి చెందుటలేదు.

చౌ॥ రామ చరిత జే సునత అఘాహీం ।
రస బిసేష జానా తిన్హ నాహీం ॥
జీవన ముక్త మహా ముని జే ఊ ।
హరి గున సునహిం నిరంతర తే ఊ ॥ 1

తా॥ శ్రీరామచంద్రుని దివ్యకథలు విని-విని తృప్తిచెందువారికి విశేషమగు ఆనందము లభించదు. జీవన్ముక్తులగు మహాత్ములు ముని శ్రేష్ఠులు భగవానుని గుణములు నిరంతరము వినుచునేయుందురు.

చౌ॥ భవ సాగర చహ పార జో పావా ।
రామ కథా తా కహం దృఢ నావా ॥
బిష ఇన్హ కహం పునిహరి గునగ్రామా ।
శ్రవన సుఖద అరు మన అభిరామా ॥ 2

తా॥ సంసారసముద్రమునుండి తరింపవలెననెడి కోర్కెగలవారికి శ్రీరామచంద్రుని దివ్యమగు కథలు దృఢమగునట్టి నౌకతో సమానము. శ్రీ హరి గుణములు విషయానందలోలురకు గూడ సుఖసంతోషములు గలుగ జేయును. మనస్సునానందపరచును.

చౌ॥ శ్రవన వంత అ సకో జగమాహీం ।
జాహి న రఘుపతి చరిత సోహాహీం ॥
తే జఢ జీవ నిజాత్మక ఘాతీ ।
జిన్హహి న రఘుపతి కథా సోహాతీ ॥ 3

తా॥ ఈ ప్రపంచమున శ్రీరఘు రాముని కథలు ఎవరు వినరో, విని ఆనందించరో అట్టివారు పరమమూర్ఖులు. వారు ఆత్మహత్య గావించుకొన్న వారే.

చౌ॥ హరి చరిత్ర మానస తుమ్హ గావా ।
సుని మై నాథ అమిత సుఖ పావా ॥
తుమ్హ జో కహీ యహ కథా సుహాఈ ।
కాక భుశుండి గరుడ ప్రతి గాఈ ॥ 4

తా॥ ఓ నాధా ! నీవు శ్రీరామచంద్రుని కథలు గానము చేసితివి. వానిని విని నేను మిక్కిలి ఆనందపడితిని. సుఖము గలిగినది. నీవు నాకు జెప్పిన ఈ శ్రీరామచరిత మానసకధను కాకభుశుండి గరుడునకు జెప్పి యుండెను.

దో॥ బిరతి గ్యాన బిగ్యాన దృఢ రామ చరన అతి నేహ ।
బాయస తన రఘుపతి భగతి మోహి పరమ సందేహ ॥

తా॥ కాకిశరీరమును బొందియు కాకభుశుండి వైరాగ్యమును, జ్ఞాన విజ్ఞానముల సంపన్నుడు. ఆతనికి శ్రీరామచంద్రుని దివ్యచరణములందు భక్తి లభించెననుటలోనే సందేహము గలదు.

చౌ॥ నర సహస్ర మహం సునహు పురారీ ।
కోఉ ఎక హోఇ ధర్మ వ్రతధారీ ॥

ధర్మసీల కోటికక మహఁ కోఈ ।
బిషయ బిముఖ బిరాగ రతహోఈ ॥ 1

తా॥ ఓ త్రిపురాంతకా! దయచేసి వినుము. కొన్ని వేలమంది మానవులలో ఒక్కడుమాత్రమే ధర్మవ్రత పాలనమొనర్చును. కోట్లకొలది ధర్మాత్ములలో ఒకడుమాత్రమే విషయవిముఖుడును వైరాగ్యవంతుడునై యుండును.

చౌ॥ కోటి బిరక్త మధ్య శ్రుతి కహఈ ।
సమ్యక గ్యాన సకృత కోఉ లహఈ ॥
గ్యానవంత కోటికక మహఁ కోఊ ।
జీవన ముక్త బ్రహ్మ పరప్రానీ ॥ 3

తా॥ వేలమంది జీవన్ముక్తులలోగూడ సర్వసుఖములకు నిలయులు బ్రహ్మయందేలీనులు, విజ్ఞానవంతులగు పురుషులుండుటగూడ దుర్లభము. ధర్మాత్ములు, వైరాగ్యవంతులు, జ్ఞానులు, జీవన్ముక్తులు, భగవల్లీనులు—

చౌ॥ సబతేసో దుర్లభ సురరాయా ।
రామ భగతి రత గత మద మాయా ॥
సోహరి భగతి కాగ కిమి పాఈ ।
బిస్వ నాథ మోహి కహహు బుఝాఈ ॥ 4

తా॥ దేవాదిదేవ! మహాదేవా! వీరందరుగూడ అత్యంతదుర్లభులే. వారు మద, మాయారహితులే. శ్రీరామచంద్రునియొక్క శ్రేష్ఠమగుభక్తులే. అయిననూ ఓచంద్రమౌళీశ్వరా! అట్టి దుర్లభమగు హరిభక్తి కాకికి ఎట్లు లభించినదో నాకు తెలియజెప్పుము,

దో॥ రామ పరాయన గ్యాన నరత గునాగార మతి ధీర ।
నాథ కహహు కేహి కారన పాయఉ కాక సరీర ॥ 54

తా॥ ఓనాథా! శ్రీరామభక్తుడు, జ్ఞాననిరతుడు, గుణనిలయుడు, ధీశాలియగు కాకభుశుండి కాకిశరీరమునవే కారణమున పొందెనో తెలియ జెప్పుడు.

చౌ॥ యహ ప్రభు చరిత పవిత్ర సుహావా ।
కహహు కృపాల కాగ కహఁ పావా ॥
తుమ్హ కేహి భాంతి సునా మదనారీ ।
కహహు మోహి అతి కౌతుక భారీ ॥ 1

తా॥ దయాసాగరా! ఆకాకి ప్రభువుయొక్క దివ్యము, పవిత్రము సుందరమునగు కథలనెచ్చటనుండి పొందెనో దెలియజెప్పుడు. ఒమదనాంత కారీ! నాకు చాలాకుతూహలముగ నున్నది. వీనిని గురించి నీవెచ్చట ఎట్లు తెలిసికొంటివి.

చౌ॥ గరుఢ మహాగ్యానీ గున రాసీ ।
హరి సేవక అతి నికట నివాసీ ॥
తేహిఁ కేహి హేతు కాగ సన జాఈ ।
సునీ కథా ముని నికర బిహాఈ ॥ 7

తా॥ గరుడుడు మహాజ్ఞానియు సద్గుణనిలయుడునై యున్నాడు. శ్రీహరికి సేవకుడు. వాహనుడు. అట్టివాడు మునిశ్రేష్ఠసముదాయముల నొదలి కాకివద్దకెదలి హరికథలనే కారణమున వినెను.

చౌ॥ కహహు కవన బిధి భాసంబాదా ।
దో ఉ హరి భగత కాగ ఉరగాదా ॥
గౌరి గిరా సుని సరల సుహాఈ ।
బోలే సివ సాదర సుఖ పాఈ ॥ 3

తా॥ కాకభుశుండి, గరుడుడు యిరువురు హరిభక్తులే. వారివారి సంభాషణలెట్లుండినవో చెప్పుము. పార్వతీదేవి యొక్క సుందరము, సరళమునైన ఈ ప్రశ్నను పరమశివుడు విని ఆనందించి ప్రేమతో నిట్లు పలుకసాగెను.

చౌ॥ ధన్య సతీ పావన మతి తోరీ ।
రఘుపతి చరన ప్రీతి నహి థోరీ ॥
సునహు పరమ పునీత ఇతిహాసా ।
జో సుని సకల లోక భ్రమ నాసా ॥ 2

తా॥ ఓసతీ! నీవు ధన్యురాలవు. నీబుద్ధి పవిత్రవంతమైనది. శ్రీరఘురాముని చరణములందు నీకు అత్యంత ప్రేమగలదు. ఆ పరమపవిత్రమగు ఇతిహాసమును వినుము. ఆ దివ్యమగు కథనువినిన భూనభోంతరాళములలో గల సందేహములన్నియు నశించును.

చౌ॥ ఉపజఇ రామ చరన బిస్వాసా ।
భవ నిధి తర నర బినహిం ప్రయాసా ॥ 5

తా॥ అట్లే శ్రీరామచంద్రుని చరణములందు ప్రేమ ఉత్పన్నమగును. కష్టములేకయే మానవుడు సంసారరూపమనెడు సముద్రమునుండి తరించవచ్చును.

దో॥ ఐ సియ ప్రశ్న బిహంగ పతి కీన్హి కాగ సన జాఇ ।
సోసబ సాదర కహిహఉఁ సునహు ఉమా మనలాఇ॥

తా॥ పక్షిరాజగు గరుడుడుగూడ మొదటలో కాకభుశుండివద్ద కెడలినప్పుడిదే ప్రశ్నను అడిగెను ఓఉమా! నేను నీకు ప్రేమతో చెప్పెదను. మనస్సు నటునిటు మరల్పక జాగరూకురాలవై వినుము.

చౌ॥ మైఁ జిమి కథా సునీ భవ మోచని ।
సో ప్రసంగ సును సుముఖి సులోచని ॥
ప్రథమ దచ్ఛ గృహ తవ అవతారా ।
సతీ నామ తబ రహా తుమ్హారా ॥ 1

తా॥ నేనెట్లు జనన-మరణ చక్రమునుండి తప్పించు భగవానుని కథలు వింటినో ఓసుముఖీ! ఓసులోచనీ! ఆప్రసంగమును జాగ్రత్తగ వినుము. మొదట నీవు దక్షుని గృహమందు జన్మించితివి. అప్పుడు నీ నామము సతీదేవి.

చౌ॥ దచ్ఛ జగ్య తవ భా అపమానా ।
తుమ్హ అతిక్రోధ తజే తబ ప్రానా ॥
మమ అను చరన్హ కీన్హ మఖ భంగా ।
జానహు తుమ్హ సో సకల ప్రసంగా ॥ 2

తా॥ ఆ దక్షుని యజ్ఞమునందు నీకవమానము జరిగెను. నీకు మిక్కిలి కోపమువచ్చుటచే ప్రాణత్యాగము జేసితివి. అప్పుడు నాసేవకులు ఆయజ్ఞమును ధ్వంసముజేసిరి. ఆ కథావృత్తాంతంతయు నీకు దెలియును.

గలదు. దానిలోగల మణుల వరుసల శోభను జూచుటచే, మనస్సు మోహ
మును జెందును,

దో॥ సీతల అమల మధుర జల జలజ బిపుల బహురంగ ।
కూజత కలరవ హంస గన గుంజత మంజుల భృంగ ॥

తా॥ ఆ తటాకములోని నీరు చల్లగ, నిర్మలముగ తియ్యగనుండును.
వివిధరకములగు పుష్పములచే విరాజిల్లుచుండును. హంసల సముదాయములు
మధుర స్వరములతో మాట్లాడుకొనుచుండును. తుమ్మెదలు తమ తమ మధుర
కంఠములలో గుంజారవ నాదముల జేయుచుండును.

చౌ॥ తేహిం గిరి రూచిర బసఇ ఖగ సోఈ ।
తాసునాస కల్పాంత న హోఇ ।
మాయా కృత గున దోష అనేకా ।
మోహ మనోజ ఆది అవివేకా ॥

తా॥ ఆపర్వతముపైననే శ్రీకాకభుశుండి నివాసముజేయును. ఈ
కల్పాంతమువరకు ఆతనికి చావులేదు. మాయాప్రేరణల వలన వివిధ విధ
ములగు గుణ-దోషములు, మోహము, కామము, అవివేకము మొదలుగా
గల —

చౌ॥ రహే బ్యాపి సమస్త జగమాహీం ।
తేహిం గిరి నికట కబహుఁ నహిఁ జాహీం ।
తహఁ బసి హరిహి భజఇ జిమి కాగా ।
సో సును ఉమా సహిత అనురాగా ॥ 2

తా॥ అవగుణములు ఈజగత్తున నిండుగ వ్యాపించియున్నవి. ఈ
అవగుణము లాపర్వతముపైపు ప్రవేశింపజాలవు. అక్కడను కాకభుశుండి

గలదు. దానిలోగల మణుల వరుసల శోభను జూచుటచే మనస్సు మోహ మును జెందును,

దో॥ సీతల అమల మధుర జల జలజ బిపుల బహురంగ।
కూజత కలరవ హంస గన గుంజత మంజుల భృంగ॥

తా॥ ఆ తటాకములోని నీరు చల్లగ, నిర్మలముగ తియ్యగనుండును వివిధరకములగు పుష్పములచే విరాజిల్లుచుండును. హంసల సముదాయముల మధుర స్వరములతో మాట్లాడుకొనుచుండును. తుమ్మెదలు తమ తమ మధుర కంఠములలో గుంజారవ నాదముల జేయుచుండును.

చౌ॥ తేహిం గిరి రూచిర బసఇ ఖగ సోఈ।
తాసునాస కల్పాంత న హోఇ।
మాయా కృత గున దోష అనేకా।
మోహ మనోజ ఆది అవివేకా॥

తా॥ ఆపర్వతముపైననే శ్రీకాకభుశుండి నివాసముజేయును. ఈ కల్పాంతమువరకు ఆతనికి చావులేదు. మాయాప్రేరణల వలన వివిధ విధ ములగు గుణ-దోషములు, మోహము, కామము, అవివేకము మొదలుగా గల —

చౌ॥ రహే బ్యాపి సమస్త జగమాహీం।
తేహిం గిరి నికట కబహుం నహిం జాహీం।
తహం బసి హరిహి భజఇ జిమి కాగా।
సో సును ఉమా సహిత అనురాగా॥

తా॥ అవగుణములు ఈజగత్తున నిండుగ వ్యాపించియున్నవి. ఈ అవగుణము లాపర్వతముపైపు ప్రవేశింపజాలవు. అక్కడను కాకభుశుండి

నివసించుచు, భగవానుని భజించసాగెను ఓఉమా! అతడెట్లు భజించినది తెల్పెద. ప్రేమతో వినుము.

చౌ॥ పీపర తరూ తర ధ్యాన సో ధరఈ ।
జాప జగ్య పాకరి తర కరఈ ॥
ఆవఁ ఛాఁహా కర మానస పూజా ।
తజి హరి భజను కాజు నహిఁ దూజా ॥ 3

తా॥ అతడు రావి వృక్షముక్రింద ధ్యానముజేయును. జువ్వివృక్షము నీడన జపయజ్ఞములు జేయును. మామిడి చెట్టుక్రింద మానసిక పూజలు జేయును. శ్రీహరి భజనాది కార్యములుదప్ప వేరేపనియు జేయడు.

చౌ॥ బర తర కహ హరికథా ప్రసంగా ।
ఆవహిఁ సునహిఁ అనేక బిహంగా ॥
రామచరిత బిచిత్ర బిధి నానా ।
ప్రేమ సహిత కర సాదరగానా ॥ 4

తా॥ మఱ్ఱి చెట్టుక్రింద శ్రీహరియొక్క కథలతోగూడిన ప్రసంగములు జరుగును. అచ్చటకు వివిధరకములగు పక్షులువచ్చి ఆకథలు వినుచుండును. ఆ విచిత్రములగు రామకథలు వివిధవిధముల ప్రేమతో ఆదరముగ గానముచేయును.

చౌ॥ సునహిఁ సకల మతి బిమల మరాలా ।
బసహిఁ నిరంతర జే తేహిఁ తాలా ॥
జబ మైఁ జాఇ సో కౌతుక దేఖా ।
ఉర ఉపజా ఆనంద బిసేషా ॥ 5

తా॥ నిశ్చల మనస్సుగల హంసలు సర్వకాలములలో ఆ తటాకము వొడ్డున నివసించును. ఆ దృశ్యమును నేనొకపర్యాయము ఆశ్చర్యముగ జూచుటచే నాహృదయమునందు విశేషమగు ఆనందము గలిగెను.

దో॥ తబ కఛుకాల మరాల తనుధరి తహఁ కీన్హ నివాస।
సాదర సుని రఘుపతి గునపుని ఆయఉఁ కైలాస॥ 57

తా॥ అప్పుడు నేను హంసశరీరమును ధరించి కొంతకాలము అచ్చట ఉంటిని శ్రీరఘురాముని గుణముల ప్రేమతో విని వెంటనే కైలాసమునకు వచ్చితిని.

చౌ॥ గిరిజా కహేఉఁ సోసబ ఇతిహాసా।
మైజేహి సమయ గయఉఁ ఖగపాసా॥
అబసో కథా సునహు జేహి హేతూ।
గయఉ కాగ పహిఁ ఖగకుల కేతూ॥ 1

తా॥ ఓపార్వతీ! నేను కాకభుశుండి వద్దకు వెడలిన వృత్తాంతము నీకు జెప్పితిని. ఏకారణమువలన పక్షిరాజు గరుడుడు కాకభుశుండి వారి వద్దకు వెడలెనో ఆవృత్తాంతమును జెప్పెద, వినుడు.

చౌ॥ జబరఘునాథ కీన్హి రనక్రీడా।
సముఝత చరిత హోతి మోహిఁ బ్రీడా॥
ఇంద్రజీత కర ఆపు బంధాయో।
తబ నారద ముని గరుడ పఠాయో॥ 2

తా॥ శ్రీరఘునాథుని రణలీలలు స్మరించుకొనిన నాకు లజ్జగలుగుచున్నది. మేఘనాధుడు స్వయముగ శ్రీరాముని బంధించెను, అప్పుడు నారదుడు గరుడుని పంపెను.

చౌ॥ బంధన కాటి గయో ఉరగాదా ।
ఉపజా హృదయఁ ప్రచండ బిషాదా ॥
ప్రభు బంధన సముఝుత బహు భాంతీ ॥
కరత బిచార ఉరగ ఆరాతీ ॥ 3

తా॥ సర్పభక్షకుడగు గరుడుడు ప్రభువుయొక్క బంధముల కొరికి వెడలెను. అప్పుడతనికి హృదయమందు మిక్కిలి దుఃఖముగలిగెను ప్రభువుయొక్క బంధముల స్మరించుకొని గరుడుడు చింతించసాగెను.

చౌ॥ జ్యాపక బ్రహ్మ బిరజ బాగీసా ।
మాయా మోహా పార పరమీసా ॥
సో అవతార సునఉఁ జగమాహీఁ ।
దేఖేఉ సో ప్రభాఉఁ కఛునాహీఁ ॥

తా॥ వ్యాపకుడు, వికారగుణములు లేనివాడు, సరస్వతీదేవికి భర్త యగు బ్రహ్మ మాయా-మోహరూపముల దాటినవాడని వింటిని. ఆతని అవతారమే యీరామావతారమని వింటిని. కాని దాని ప్రభావమునేమాత్రమును జూడలేదు.

దో॥ భవబంధనతే చూటహిఁ నరజపి జాకర నామ్ ।
సర్వ నిసాచర బాంధేఉ నాగపాస సోఇ రామ్ ॥ 58

తా॥ ఎవనియొక్క నామమును జపించి మానవులు సంసారసముద్రమును దాటెదరో. అట్టివాడగు రామచంద్రునొక తుచ్ఛమగు రాక్షసుడు నాగపాశముచే బంధించెను.

చౌ॥ నానాభాంతి మనహి సముఝావా ।
ప్రగట న గ్యాన హృదయఁ భ్రమ ఛావా ॥
ఖేద ఖిన్న మన తర్క బఢాఈ ।
భయఉ మోహబస తుమ్హరిహిఁ నాఈ ॥ 1

తా॥ గరుడుడు అనేక పర్యాయములుగ ఆలోచింపసాగెను. కాని ఆతని హృదయమున జ్ఞానముత్పన్నముగాలేదు. హృదయమందాతని భ్రమనిండుగ వ్యాపించియున్నది. మిక్కిలిగ దుఃఖితుడై కుతర్కాలోచనం చేయుచు మోహముచే నిండియుండెను.

చౌ॥ బ్యాకుల గయఉ దేవరిషి పాహీఁ ।
కహేసి జో సంసయ నిజమన మాహీఁ ॥
సుని నారదహి లాగి అతి దాయా ।
సును ఖగ ప్రబల రామకై మాయా ! 2

తా॥ గరుడుడు వ్యాకులుడై దేవర్షియగు నారదునివద్దకు వచ్చి తన సందేహములన్నియు జెప్పెను. అది వినుటచే వానిపై మిక్కిలి దయగలిగి యిట్లు చెప్పసాగెను. ఓగరుడుడా! శ్రీరామచంద్రుని మాయ మిక్కిలి బలవత్తరమైనది.

చౌ॥ జో గ్యానిన్హ కర చిత అపహరఈ ।
బరిఆఈ బిమోహ మన కరఈ ॥
జేహిఁ బహుబార నచావా మోహీ ।
సోఇ బ్యాపీ బిహంగపతి తోహీఁ ॥

తా॥ ఎవరు జ్ఞానుల చిత్తమునుగూడ నేర్పుతో హరించుచున్నాదో, వారలయొక్క మనస్సులలోగూడ ఉద్రేకములు గలిగించుచున్నాదో,

మోహమును అభివృద్ధిచేయునో, ఆతడు నన్నుగూడ అనేక పర్యాయాలు మాయాజాలములో పడవేసినాట్య మాడించినాడు. ఓపక్షిరాజా! ఆమాయే నీకును వ్యాపించినది.

చౌ॥ మహామోహా ఉపజా ఉర తోరేం ।
మిటహి న బేగి కహేం ఖగ మోరేం ॥
చతురానన పహిం జాహు ఖగేసా ।
సోఇ కరేహు జేహి హోఇ నిదేసా ॥ 4

తా॥ ఓగరుడుడా! నీహృదయమున మోహముత్పన్నమైనది. అది నాసమక్షముననే నీకు తొలగును. బ్రహ్మవద్దకు వెడలుము. ఆతడే కార్యము జెప్పిన దానినాచరింపుము.

దో॥ అసకహి చలే దేవరిషి కరత రామ గున గాన ।
హరి మాయా బల బరన తపు నివుని పరమ సుజాన ॥

తా॥ అట్లుచెప్పి పరమజ్ఞానియగు నారదుడు శ్రీరామచంద్రుని గుణములు గానముచేయుచు, శ్రీహరియొక్క మాయాజాలమును వర్ణించుకొనుచు బయలుదేరెను.

చౌ॥ తబ ఖగపతి బిరంచి పహిం గయఉ ।
నిజ సందేహ సునావత భయఉ ॥
సుని బిరంచి రామహి సిరు నావా ।
సముఝి ప్రతాప ప్రేమ అతిభావా ॥ 1

తా॥ పక్షిరాజగు గరుడుడు బ్రహ్మవద్దకువెడలి తన సందేహము నాతనికి వినిపించెను. బ్రహ్మ శ్రీరామచంద్రునకు తలవంచి నమస్కరించి ఆతని గొప్పతనమును దెలిసికొని అమితప్రేమలో మునిగియుండెను.

చౌ॥ మన మహుఁ కరఇ బిచార బిధాతా ।
మాయా బస కవికోవిద గ్యాతా ॥
హరి మాయాకర అమిత ప్రభావా ।
బిపుల బార జేహిఁ మోహి న చావా ॥ 2

తా॥ కవులు, కోవిదులు, జ్ఞానులుగూడ మాయకు వశులని బ్రహ్మ తెలిసికొనెను. భగవానునిమాయకు అవధులులేవు నన్నుగూడా అది అనేక పర్యాయములు మాయలో పడవేసినది

చౌ॥ అగ జగమయ జగ మమ ఉపరాజా ।
నహిఁ ఆచరజ మోహా ఖగరాజా ॥
తబ బోలే బిధి గిరా సుహాఈ ।
జాన మహేశ రామప్రభు తాఈ ॥ 3

తా॥ నేను పదునాలుగు భువనములను సృష్టించితిని మాయకు వశుడను. పక్షిరాజగు గరుడుడు మోహమునందు బడుట ఆశ్చర్యమేమున్నది. బ్రహ్మ సుందరములగు పలుకులతో ఓగరుడుడా! శ్రీరామచంద్రునియొక్క మహిమలు పరమశివునకు బాగుగ దెలియునని పలికెను

చౌ॥ బైన తేయ శంకర పహిఁ జాహూ ।
తాత అనత పూఛహు జనికాహూ ॥
తహఁ హోఇహి తవ సంసయ హానీ ।
చలేఉ బిహంగ సునతబిధి బానీ ॥ 4

తా॥ ఓ గరుడుడా! నీవు శంకరునివద్దకు వెడలుము. ఈవిషయము నీవెవరిని అడుగవద్దు. నీసందేహములన్నియు నచ్చటతీరును. బ్రహ్మ యొక్క మాటలువిని గరుడుడచటకు వెడలెను.

దో॥ పరమాతుర బిహంగపతి ఆయ ఉ తబ మో పాస ।
జాత రహేఉఁ కుబేర గృహ రహిహు ఉమాకైలాస ॥

తా॥ పక్షిరాజగు గరుడుడు ఆతురతతో నావద్దకువచ్చెనని శివుడు పార్వతితో జెప్పెను. ఉమా ! ఆసమయమున నేను కుబేరుని యింటియొద్ద యుంటిని. నీవు కైలాసమువద్ద యుంటివి.

చౌ॥ తేహి మమపద సాదర సిరు నావా ।
పుని ఆపన సందేహ సునావా ॥
సుని తా కరి బినతీ మృదు బానీ ।
ప్రేమ సహిత మై కహేఉఁ భవానీ ॥ 1

తా॥ గరుడుడు ఆదరముతో నాపాదములపై వ్రాలెను. ఆతని సందేహమును నాకు వినిపించెను. ఓపార్వతీ! ఆతని పలుకులు విని ప్రేమతో నిట్లు పలికితిని.

చౌ॥ మిలేహు గరుఢ మారగ మహఁ మోహీ ।
కవన భాంతి సముఝావౌఁ తోహీ॥
తబ హి హోఇ సంసయ భంగా ।
జబ బహు కాల కరిఅ సతసంగా॥

తా॥ ఓగరుడుడా ! నీవు నన్ను మార్గమధ్యమున గలుసుకుంటివి. నీకెట్లు చెప్పగలను. సర్వవిధములగు సందేహములు నశించవలెనన్న దీర్ఘకాలము సత్సంగమున గడుపుము.

చౌ॥ సునిఅ తహాఁ హరి కథా సుహాఈ ।
నానా భాంతి మునిన్హ జో గాఈ ॥

కేహి ముహూం ఆదిమధ్య అవసానా ।
ప్రభు ప్రతిపాద్య రామ భగవానా ॥ 2

తా॥ అంతేగాదు. ఆ సత్సంగమునందు సుందరమగు హరికథలు వినుటచే మునీశ్వరులు వాని ననేకవిధముల కీర్తించెదరు కీర్తించుచు ఆదిలో మధ్యమందున, అంతమునగూడ శ్రీరామునే దర్శించుచుందురు

చౌ॥ నితహరి కథా హోతి జహాఁ భాఈ ।
పఠవఉఁ తహాఁ సునహు తుమ్హ జాఈ ॥
జాఇహి సునత సకల సందేహా ।
రామ చరన హోఇహి అతి నేహా ॥ 4

తా॥ సోదరుడా! ప్రతిదినము భగవల్లీలలు వర్ణించు ప్రదేశమునకు పంపెదను. నీవచ్చటకు వెడలి జాగ్రత్తగ వినుము. అట్లు నీవు వినియెద వేని సందేహములన్నియు నశించును. నీకు శ్రీరామచంద్రుని చరణము లందు అత్యంతమగు ప్రేమ యేర్పడును.

దో॥ బిను సతసంగ న హరి కథా తేహి బిను మోహ న భాగ।
మోహ గఏఁ బిను రామపద హోఇ న దృఢ అనురాగ ॥

తా॥ సత్సంగము లేకుండగ భగవానుని దివ్యలీలలు వినుట సంభ వింపదు మోహము నశింపనిది శ్రీరామచంద్రుని చరణములందు దివ్యాను రాగము గలుగదు అచలమగు ప్రేమ యేర్పడదు.

చౌ॥ మిలహిఁ న రఘుపతి బిను అనురాగా ।
కిఏఁ జోగ తప గ్యాన బిరాగా ॥

ఉత్తర దిసి సుందర గిరి నీలా ।
తహఁ రహ కాక భు శుండి సుశీలా ॥ 1

తా॥ యోగము, తపస్సు జ్ఞానము, వైరాగ్యము మొదలుగా గలిగి సద్గుణములున్నను ప్రేమలేనిది శ్రీరామచంద్రుడు లభింపడు. కావున నీవు సత్సంగముకొరకు మనకు ఉత్తర దిశయందుగల నీలపర్వతము వద్దకు వెళలుము. అచ్చట పరమజ్ఞానియు, నిశ్చలవంతుడునగు శ్రీకాకభుశుండి నివసించుచున్నాడు.

చౌ॥ రామ భగతి పథ పరమ ప్రబీనా ।
గ్యానీ గున గృహ బహు కాలీనా ॥
రామ కథా సో కహఇ నిరంత ర ।
సాదర సునహిఁ బివిధ బిహంగవర ॥ 2

తా॥ కాకభుశుండి రామభక్తిమార్గమున పరమప్రవీణుడు. మహా జ్ఞాని. సద్గుణనిలయుడు. వయోవృద్ధుడు. ప్రతిదినము శ్రీరాముని దివ్య లీలలు, కథలు వర్ణించుచునేయుండును. ఆదివ్యలీలలు వినుటకై వివిధ విధముల శ్రేష్ఠములగు పక్షిజాతులన్నియు ప్రేమతో వచ్చును.

చౌ॥ జా ఇ సునహు తహఁ హరిగున భూరీ ।
హోఇహి మోహ జనిత దుఖ దూరీ ॥
మై జబ తేహి సబ కహా బుఝాఈ ।
చలేఉ హరష మమపద సిరు నాఈ ॥ 3

తా॥ కనుక నీవచ్చటకు వెడలి శ్రీహరికథలు వినుము. నీవాకథలు విన్నటచే నీలోగలిగిన మోహ, దుఃఖములు నశించును. అని నేనావృత్తాం

తమునంతయు చెప్పుటతోడనే గరుడుడు నాపాదములకు నమస్కరించి సంతోషముతో బయలుదేరెను

చౌ॥ తాతే ఉమా న మైఁ సముఝావా।
రఘుపతి కృపాఁ మరము మై పావా॥
హోఇహి కీన్హ కబహుఁ అభిమానా।
సోఖోవై చహ కృపానిధానా॥ 4

తా॥ ఓ ఉమా! నేనువానికి జెప్పినదేమియులేదు. శ్రీరామచంద్రుని దివ్యానుగ్రహముచేత వానికి మర్మముదెలియుటచే అజ్ఞానము నశించినది. వానికి పూర్వమున అభిమాన మెక్కువనుండినది. యిప్పుడది శ్రీరామ చంద్రుని కృపవలన నశించినది.

చౌ॥ కఛు తేహి తే పుని మైఁ నహిఁ రాఖా।
సముఝఇ ఖగ ఖగహీ కై భాషా॥
ప్రభు మాయా బలవంత భవానీ।
జాహి న మోహ కవన అసగ్యానీ॥ 5

తా॥ ఏ జాతివాడా జాతివానికిజెప్పిన బాగుగ అర్థవంతమగునని ఈ పక్షిని ఆపక్షివద్దకు పంపితిని. ఓ భవానీ! భగవానునిమాయ బలవత్తర మైనది. మోహముచెందని జ్ఞాని ఎవడుగలడు.

దో॥ గ్యానీ భగత సిరోమని త్రిభువనపతి కర జాన।
తాహి మోహ మాయా నర పావఁర కరహిఁ గుమాన॥

తా॥ జ్ఞానులలో, భక్తులలో అగ్రగణ్యుండును, త్రిలోకారాధ్యుడును, శ్రీ భగవానునకు వాహనుడునైనట్టి ఆగరుడునకుగూడ మాయా

మోహములు గలిగెను. నీచమానవుడు మూర్ఖమువలన గర్వముగలిగి యుండును.

దో॥ సివ బిరంచి కహుఁ మోహఇ కో హై బపురా ఆన।
అస బియఁ జాని భజహిఁ ముని మాయాపతి భగవాన॥

తా॥ ఈమాయ శివుని, సృష్టికర్తయగు బ్రహ్మనుగూడ మోహమున బడవైచెను. ఆలాంటప్పుడు దిక్కు మొక్కులేని వారిగతేమని తెలిసికొని మునులు, భక్తులు మాయాపతియగు భగవానుని స్మరించుచుండును.

చౌ॥ గయఉ గరుడ జహఁ బసఇ భుసుండా।
మతి అకుంఠ హరి భగతి అఖండా॥
దేఖి శైల ప్రసన్న మన భయఊ।
మాయా మోహ సోచ సబ గయఊ॥ 1

తా॥ వాద వివాదములు లేనట్టివన్ని, పరిపూర్ణమగు భక్తిగలిగినట్టి శ్రీ కాకభుశుండివద్దకు గరుడుడుజేరెను. ఆపర్వతమును జూచుటతోడనే వానికి ఆనందముగలిగెను పరమభక్తుని దర్శించుటవలన మాయామోహములు నశించెను.

చౌ॥ కరి తడాగ మజ్జన జలపానా।
బట తర గయఉ హృదయఁ హరషానా॥
బృద్ధ బృద్ధ బిహంగ తహఁ ఆఏ।
సునై రామకే చరిత సుహాఏ॥ 2

తా॥ సరోవరమందు స్నానముజేసి, మంచినీరుత్రాగి ఉప్పొంగిన సంతోషముతో అవటవృక్షము క్రిందకుజేరెను శ్రీరామచంద్రుని దివ

కధలు వినుటకై వయస్సుమళ్ళిన వృద్ధ-వృద్ధ పక్షిజాతులా వృక్షము క్రిందకువచ్చి యుండెను.

చౌ॥ కథా ఆరంభ కరై సోఇ చాహా ।
తేహిం సమయ గయఉ ఖగనాహా ॥
ఆవత దేఖి సకల ఖగరాజా ।
హరషేఉ బాయస సహిత సమాజా ॥ 3

తా॥ శ్రీకాకభుశుండులవారు శ్రీరామకథను ప్రారంభించుటకు ముందుగానే పక్షిరాజగు గరుడుడచ్చటకు జేరెను. ఆతడచ్చటకు వచ్చుటచే కాకభుశుండియు, పక్షిసమాజములు ఆనందపడెను.

చౌ॥ అతి ఆదర ఖగ పతి కర కీన్హా ।
స్వాగత పూఛి సుఆసన దీన్హా ॥
కరి పూజా సమేత అనురాగా ।
మధుర బచన తబ బోలేఉ కాగా ॥ 4

తా॥ వారు పక్షిరాజగు గరుడుని మిక్కిలిగ ఆదరించి, సత్కరించి క్షేమసమాచారములు తెలిసికొని, కూర్చుండుటకై సుందరమగు ఆసనమునిచ్చి గౌరవించిరి. తదుపరి కాకభుశుండిలవారు మధురములగు పలుకులిట్లు పలుకసాగెను.

దో॥ నాథ కృతారథ భయఉఁ మైఁ తవ దరసన ఖగరాజ ।
ఆయసు దేహు సో కరౌఁ అబ ప్రభు ఆయహు కేహి కాజ ॥

తా॥ ఓ పక్షిరాజా ! మీదర్శన ప్రభావమున నేడు మేము కృతార్థులమైతిమి, నీఆజ్ఞ ఎట్లున్న అట్లుమేము నడుచుకొందుము. ఓ ప్రభూ ! మీరే కారణమువలన యిచ్చటకు వచ్చితిరి.

దో॥ సదాకృతా రఘరూప తుమ్హ కహా మృదు బచన ఖగేస ।
జేహి కై అస్తుతి సాదర నిజముఖ కీన్హి మహేస ॥ 64

తా॥ (పక్షిరాజగు గరుడుడు మృదువగుపలుకుల నిట్లుపలికెను.) ఓ కాకభుశుండీ నీవు కృతార్థుండవు పరమశివుడు స్వయముగ నీ గొప్పతన మును కీర్తించినాడు.

చౌ॥ సునహు తాత జేహి కారన ఆయఉఁ ।
సో సబ భయఉ దరస తవపాయఉఁ ॥
దేఖి పరమ పావన తవ ఆశ్రమ ।
గయఉ మోహా సంసయ నానాభ్రమ ॥ 1

తా॥ దయతో వినుము! నేను వచ్చిన కార్యములన్నియు యిచ్చ టకు వచ్చుటతోడనే నెరవేరినవి: ఆమోఘంబగు మీదివ్య దర్శనము లభించి నది. పరమపవిత్రము, దివ్యమునగు మీఆశ్రమమును జూచుటచే నాలో గలిగిన మోహమును, సందేహమును, భ్రమయును నశించినది.

చౌ॥ అబ శ్రీ రామకథా అతిపావని ।
సదా సుఖద దుఖపుంజ నసావని ॥
సాదర తాత సునావహు మోహీ ।
బారబార బినవఉఁ ప్రభు తోహీ ॥ 2

తా॥ ఓ కాకభుశుండీ! నాకిప్పుడు పరమపవిత్రము గలుగజేయు నట్టియు, సర్వకాల సర్వావస్థలలో సుఖ-సంతోషములు గలుగజేయునట్టియు, దుఃఖసమూహముల నాశనము జేయునట్టియు, దివ్యము, సుందరమునగు శ్రీరామచంద్రుని కథలు వినిపింపవని మాటిమాటికి ప్రార్థించుచున్నాను.

చౌ॥ సునత గరుడకై గిరా బినీతా ।
సరల సుప్రేమ సుఖద సుపునీతా ॥
భయఉ తాసు మన పరమ ఉఛాహా ।
లాగ కహై రఘుపతి గున గాహా ॥ 3

తా॥ వినమ్రము, సరళము సుందరము, ప్రేమతో గూడినట్టియు, సుఖ సంతోషములు గల్గించునట్టియు, పరమపవిత్రమునగుగరుడుని మాటలు వినుటచే కాకభుశుండిల వారికి ఆనందము గలిగి దివ్యము, చిన్మయమునగు శ్రీరామచంద్ర మహారాజులవారి కథను జెప్పుట ప్రారంభించెను.

చౌ॥ ప్రథమహిఁ అతి అనురాగ భవానీ ।
రామచరిత సరకహేసి బఖానీ ॥
పుని నారద కర మోహా అపారా ।
కహేసి బహురి రావన అవతారా ॥ 4

తా॥ ఓ పార్వతీ! మొదట శ్రీరామ చరితమానస సరోవరము యొక్క స్వరూపమునుగూర్చి తదనంతరము నారదునకు గలిగిన అపారమగు మోహమును, రావణుడు జన్మించుటకుగల కారణమును శ్రీకాకభుశుండి గరుడునకు ప్రేమతోజెప్పెను.

చౌ॥ ప్రభు అవతార కథా పునిగాఈ ।
తబసిసు చరిత కహేసి మనలాఈ ॥ 5

తా॥ తరువాత శ్రీరామచంద్ర మహారాజు అవతారమునుగూర్చియు, మనస్సును స్వాధీనముసందుంచుకొని శ్రీరఘురాముని బాలలీలలు వర్ణించెను.

దో॥ బాలచరిత కహి బివిధబిధిమనమహఁ పరమ ఉఛాహ ।
రిషిఆగవన కహేసి పుని శ్రీరఘుబీర బిబాహు ॥ 64

తా॥ మనస్సునందు సంతోషముగలవాడై వివిధ ప్రకారముల శ్రీ రాముని బాలలీలలు జెప్పి, విశ్వామిత్రులవారు అయోధ్యా పురమునకు వచ్చుటయును శ్రీరఘువీరునకు వివాహము జరిగిన విధమును వర్ణించెను.

చౌ॥ బహురి రామ అభిషేక ప్రసంగా ।
పుని నృప బచన రాజరస భంగా ॥
పురబసిన్హ కర బిరహ బిషాదా ।
కహేసి రామ లఛిమన సంబాదా ॥

తా॥ తదనంతరము శ్రీరామచంద్ర మహారాజుకు రాజ్యాభిషేక ప్రసంగము దశరథ మహారాజుయొక్క మాటప్రకారము రాజ్యాభిషేకానంద సమయమున భంగమగుటయు, అయోధ్యానగర నివాసుల విరహవేదనము, దుఃఖము, శ్రీరామ-లక్ష్మణ సంవాదమును వర్ణించెను.

చౌ॥ బిపిన గవన కేవట అనురాగా ।
సురసరి ఉతరి నివాస ప్రయాగా ॥
బాల్మీకి ప్రభు మిలన బఖానా ।
చిత్రకూట జిమి బసే భగవానా ॥ 2

తా॥ శ్రీరామచంద్రుని వనవాసము గుహుని ప్రేమభక్తి గంగానదిని దాటి ప్రయాగయందు నివాసము. శ్రీవాల్మీకిహర్షియు శ్రీరామచంద్రులవారి కలయికచిత్రకూటమందు నివసించిన విధానమును పూర్తిగ జెప్పెను.

చౌ॥ సచివాగవన నగర నృపమరనా ।
భరతాగవన ప్రేమ బహు బరనా ॥
కరి నృపక్రియా సంగ పురబాసీ ।
భరత గఏ జహఁ ప్రభు సుఖ రాసీ ॥ 3

తా॥ మంత్రియగు సుమంత్రుడు అయోధ్యాపురమునకు వెంటనే వచ్చుటయును, దశరథ మహారాజు మరణమును, భరతుడు అయోధ్యాపురమునకు వచ్చుటయును, వారికిగల ప్రేమయు మిక్కిలిగ వర్ణించెను. దశరథ మహారాజునకు అంత్యక్రియలు జరిపిన తరువాత భరతుడు అయోధ్యాపురప్రజలు వెంటనడచుచుండ సర్వసుఖసంపదలకు నిలయుండగు శ్రీరామచంద్రమహారాజున్న ప్రదేశమునకు నడచెను.

చౌ॥ పుని రఘుపతి బహుబిధి సముఝాఏ ।
లై పాదుకా అవధి పుర ఆఏ ॥
భరత రహని సురపతి సుతకరనీ ।
ప్రభు అరు అత్రిభేంట పుని బరనీ ॥ ౪

తా॥ శ్రీరామచంద్రుడనేక పర్యాయములు దెలియజెప్పిన పిదప భరతుడు శ్రీవారి పాదుకలు దీసుకొనివచ్చుటను గూర్చియు, నందిగ్రామమున ఉండినవిధము, ఇంద్రుని పుత్రుండగు జయంతుడు జేసిన నీచకార్యమును, శ్రీరామచంద్ర మహారాజు అత్రిమహామునిని గలియుటయును వర్ణించి వివరముగ జెప్పెను.

దో॥ కహి బిరాధబధ జేహిబిధి దేహ తజీ సరభంగ ।
బరని సుతీక్షణ ప్రీతి పుని ప్రభు అగస్తి సత్సంగ ॥ ౯

తా॥ ఏవిధముగా విరాధుని సంహరించినదియు. శరభంగ మహర్షి శరీరమును వదలిన విధమును, సుతీక్షణ మహర్షి ప్రేమ, భక్తిని వర్ణించి అగస్త్య మహాముని యొక్క సత్సంగ వృత్తాంతమును దెలియజెప్పెను.

చౌ॥ కహి దండకవన పావన తాఈ ।
గీధ మయిత్రీ పుని తేహిఁ గాఈ ॥

పుని ప్రభు పంచవట్టీ కృత వాసా ।
భంజీ సకల మునీన్హ కీ త్రాసా ॥ 1

తా॥ దండకవనము పవిత్రమైన విధంబును గృధ్రరాజగు జటాయు వుతో స్నేహముజరిపిన విధమును శ్రీరామచంద్రుడెట్లు పంచవటిలో నివ సించినది మునులభయమును పోగొట్టినవిధమును వర్ణించెను.

చౌ॥ పుని లఛిమన ఉపదేస అనూపా ।
సూపనఖా జిమి కీన్హి కురూపా ॥
ఖర దూషన బధ బహురి బఖానా ।
జిమి సబ మరము దసానన జానా ॥ 2

తా॥ లక్ష్మణునకు ఉపమారహితమగు నుపదేశమునిచ్చిన విధానముు. శూర్పణఖను కురూపినిగ జేసినవిధానమును వర్ణించెను. తదనంతరము ఖరదూషణులను వధించిన విధానమును రావణునియొక్క సమాచార విషయములను శ్రీరామచంద్రప్రభువు తెలిసికొన్న విధానమును భుజంగ భక్షకుడగు శ్రీ గరుడునకు భక్తశ్రేష్ఠుండగు శ్రీ కాకభుశుండి జెప్పెను.

చౌ॥ దసకంధర మారీచ బతకహీ ।
జేహి బిధి భఈ సో సబ తేహి కహీ ॥
పుని మాయా సీతా కర హరనా ।
శ్రీ రఘుబీర బిరహ కఛు బరనా ॥ 3

తా॥ తదనంతరము రావణ-మారీచులకు జరిగిన వాద-వివాదము లను, మాయాసీతను రావణుడు హరించినవిధానమును శ్రీ రఘువీరునకు సీతలేకుండుటచే గలిగిన విరహవేదనను వర్ణించి గరుడునకు దెలియ జెప్పెను.

చౌ॥ పుని ప్రభుగీధ క్రియా జిమి కీన్హీ ।
బధి కబంధ సబరిహి గతి దీన్హీ ॥
బహురి బిరహ బరనత రఘుబీరా ।
జేహి బిధి గఏ సరోవర తీరా ॥

తా॥ జటాయువున కేవిధమున శ్రాద్ధకర్మలు జరిపినవిధానమును, కబంధుని సంహరించిన విధానమును, భక్తశిరోమణి శబరిని పరమగతికి పంపిన రీతిని, శ్రీరఘుకుల తిలకుడు పంపా సరోవరతీరమునకు జేరిన వృత్తాంతమును వినిపించెను.

దో॥ ప్రభు నారద సంబాద కహి మారుతి మిలన ప్రసంగు ।
పుని సుగ్రీవ మితాఈ బాలి ప్రాన కర భంగ ॥ 66

తా॥ శ్రీరామచంద్ర ప్రభువునకును, నారదునకును సంవాదముజరిగిన విధానమును ఆంజనేయుని పంపాసరోవరమున కలుసుకొన్న విధానమును, సుగ్రీవునితో స్నేహముజరిగిన విధానమును, వానిని సంహరించిన విధానమును వర్ణించి జెప్పెను.

దో॥ కపిహి తిలకకరి ప్రభుకృత సైల ప్రవర్షన బాస ।
బరనన బర్షా సరద అరు రామ రోష కపి త్రాస ॥ 66

తా॥ సుగ్రీవునకు రాజ్యాభిషేకము జరిపించి ప్రవర్షణ పర్వతముపై శ్రీరామచంద్రుడు నివసించిన విధానమును, తరువాత వర్షఋతువు శరదృతువుల వర్ణలను, దశరధరామునకు సుగ్రీవునిపై కోపమువచ్చిన విధమును, సుగ్రీవునకుగలిగిన భయమును మొదలుగాగల ఘట్టములు జెప్పెను.

చౌ॥ జేహి బిధి కపిపతి కీస పఠాఏ ।
సీతా ఖోజ సకల దిసి ధాఏ ॥

బిబర ప్రబేస కీన్హా జేహి భాంతీ ।
కపీన్హా బహోరి మిలా సంపాతీ ॥

తా॥ కపిశ్రేష్ఠుండగు సుగ్రీవుడెట్లు వానరసేనను పంపిన విధానమును, వారు సీతాదేవిని దశదిశలలో వెదికిన తీరును, వానరులెట్లు కొండబిలములో ప్రవేశించిన విధానమును, సంపాతిని కలిసికొన్న విధానమును గరుడునకు తెలియజెప్పెను

చౌ॥ సుని సబకథా సమీరకుమారా ।
నాఘత భయుఉ పయోధి అపారా ॥
లంకాం కపిప్రవేశ జిమి కీన్హా ।
పునిసీతహి ధీరజు జిమిదీన్హా ॥

తా॥ సంపాతివలన సర్వవృత్తాంతమును విని పవనపుత్రుడగు హనుమంతుడు సముద్రమును లంఘించుటయును, లంకలోనెట్లు ప్రవేశించినదియు, శ్రీసీతామాతకు ధైర్యోక్తులు జెప్పిన విధమును జెప్పెను.

చౌ॥ బనఉజారి రావనహి ప్రబోధీ ।
పురదహి నాఘేఉ బహురి పయోధీ ॥
ఆఏ కపిసబ జహాఁ రఘురాఈ ।
వైదేహీ కీ కుసల సునాఈ । 3

తా॥ అశోకవనమును నాశనముజేయుట, రావణుని తెలిసికొనుట, లంకాపురమును దహించుట, హనుమంతుడు మరల సముద్రమును దాటుట, వానరులెల్లరు శ్రీరాముడున్న ప్రదేశమునకువచ్చి శ్రీజానకీమాత క్షేమ సమాచారములు విన్నవించుట,

చౌ॥ సేనసమేత జథా రఘుబీరా ।
ఉతరే జాఇ వారి నిధి తీరా ॥
మిలా బిభీషన జేహి బిధి ఆఈ ।
సాగర నిగ్రహ కథా సునాఈ ॥

తా॥ శ్రీరామచంద్రుడెట్లు సేనాసహితుడై దయలుదేరి సముద్రపు ఒడ్డునకు జేరినదియు, విభీషణుడెట్లు వచ్చి శ్రీరాముని దర్శించుకొనిన విధమును, సముద్రముపై వానరులు వంతెన గట్టినవిధానమును గరుడునకు శ్రీకాకభుశుండిల వారు వినిపించిరి

దో॥ సేతు బాంధి కపిసేన జిమి ఉతరీ సాగరపార ।
గయఉ బసీఠి బీరబర జేహి బిధి బాలికుమార ॥ ౬౭

తా॥ సముద్రమున వంతెన నిర్మించుట, దానిపైనుండి దాటుటయును, వీరాధివీరుడు వాలిపుత్రుడగు అంగదుని దూతగ పంపిన విధమును జెప్పెను.

దో॥ నిసి చరకీస లరాఈ బరనిసి బిబిధ ప్రకార ।
కుంభకరన ఘననాద కరబలపౌరుష సంఘార ॥ ౬౭

తా॥ రాక్షసులతో వానరులు యుద్ధము జరిపిన విధమును అనేక ప్రకారముల వర్ణించి చెప్పెను, తదనంతరము కుంభకర్ణుని యొక్కయు, ఇంద్రజిత్తుని బలపౌరుష వర్ణనలను, వారిని శ్రీరాముడు యుద్ధములో సంహరించిన విధానమును జెప్పెను.

చౌ॥ నిసిచర నికర మరణ బిధి నానా ।
రఘుపతి రావన సమర బఖానా ।
రావన బధ మందోదరి సోకా ।
రాజ బిభీషన దేవ అసోకా ॥

తా॥ వివిధప్రకారముల రాక్షసులు మరణించిన విధానము శ్రీరామ చంద్రునకు రావణునకు జరిగిన యుద్ధవర్ణనలు వర్ణించెను. రావణుడు చచ్చుట, మండోదరి శోకవర్ణన, విభీషణునియొక్క రాజ్యాభిషేకోత్సవమును, దేవతలయొక్క దుఃఖమునెట్లు హరించినదియు,

చౌ॥ సీతా రఘుపతి మిలన బహోరీ ॥
సురన్హ కీన్హి అస్తుతి కర జోరీ ।
పుని పుష్పక చఢి కపిన్హ సమేతా ।
అవధ చలే ప్రభు కృపా నికేత ॥ 2

తా॥ సీతాదేవి శ్రీరాముని కలుసుకున్న విధానమును జెప్పెను. వానరులు పుష్పకవిమానముపై నెక్కుట, కృపాసముద్రుడగు శ్రీరాముడయోధ్య వచ్చినదియు జెప్పెను.

చౌ॥ జేహి బిధి రామ నగర నిజ ఆఏ ।
బాయస బిసద చరిత సబగాఏ ॥
కహేసి బహోరి రామ అభిషేకా ।
పుర బరనత నృపనీతి అనేకా ॥ 3

తా॥ శ్రీరామచంద్ర మహారాజెట్లు తన నగరమగు అయోధ్యాపురమునకు వచ్చినదియు మొదలుగాగల వృత్తాంతములన్నింటిని గరుడునకు కాకభుశుండి మహర్షివారు విస్తారముగ జెప్పిరి. శ్రీరామచంద్రునకు రాజ్యాభిషేకోత్సవము వర్ణించుచుండెను.

చౌ॥ కథా సమస్త భుసుండి బఖానీ ।
జో మైం తుమ్హ సనకహీ భవానీ ॥

సుని సబ రామ కథా ఖగనాహా ।
కహత బచన మన పరమ ఉఛాహా ॥

తా॥ ఓ భవానీ ! కాకభుశుండిమహర్షి జరిగిన వృత్తాంతమంతయు జెప్ప నేను వినినది జెప్పితిని. పక్షిరాజగు గరుడుడువిని మిక్కిలి ఆనందించి యిట్లు పలుకసాగెను.

సో॥ గయఉ మోర సందేహ సునేఉఁ సకల రఘుపతి చరిత ।
భయఉ రామపద నేహ తవ ప్రసాద బాయసతిలక ॥ 68

తా॥ శ్రీరామునికథలు నేవినుటవల్ల నాలోగల సందేహములు నశించెను. ఓ కాకభూషణా ! మీ అపారమగు నీఅనుగ్రహమువలన నా సందేహములు నశించి శ్రీరామచంద్రుని చరణములందు నాకు ప్రేమగలిగెను.

దో॥ మోహిభయఉ అతి మోహ ప్రభుబంధనరనమహుఁనిరఖి
చిదానంద సందోహ రామ బికల కారన కవన ॥ 68

తా॥ ఆయుద్ధమందు శ్రీరామచంద్రుడు నాగపాశబద్ధుడగుటను జూచి నేను మోహమును జెందితిని, జగత్ప్రభువు సచ్చిదానంద స్వరూపుడైన ఏల వ్యాకులత జెందుచున్నాడు.

చౌ॥ దేఖి చరిత అతి నర అనుసారీ ।
భయఉఁ హృదయఁ మమ సంసయ భారీ ॥
సోఇ భ్రమ అబహిత కరి మైఁ మానా ।
కీన్హ అనుగ్రహ కృపా నిధానా ॥

తా॥ లౌకికులగు మానవుల చరిత్రలు జూచుటచే నాహృదయమున సందేహముత్పన్నమయ్యెను. నాకప్పుడు గలిగినసందేహము మేలునకని

తెలిసికొంటిని. కృపానిధానుడగు శ్రీరామచంద్రునకు నాపై మిక్కిలి ప్రేమగలదు.

చౌ॥ జో అతి ఆతప వ్యాకుల హోఈ।
తరూ ఛాయా సుఖ జానఇ సోఈ॥
జౌం నహిం హోత మోహ అతి మోహీ।
మిలతేఉం తాత కవన బిధి తోహీ॥

తా॥ ఎండవలన వ్యాకులతజెందువాడు వృక్షముయొక్క నీడన సుఖమును తెలిసికొనలేనట్లు నేను మోహితుడనగుటచే మీవలన రామ కథవినుటను సంభవించినది.

చౌ॥ సునతేఉం కిమి హరికథా సుహాఈ।
అతి బిచిత్ర బహుబిధి తుమ్హ గాఈ॥
నిగమాగమ పురాన మత ఏహా।
కహహిం సిద్ధముని నహిం సందేహా॥ 3

తా॥ ఇంత సుందరమైన హరికథను ఎట్లు వింటిని। అత డెట్లు వివిధ విధములుగ పాడెను ? వేదపురాణ శాస్త్ర ధర్మమిదియేనని మునీశ్వరులు, ఋషిశ్రేష్ఠులు, సిద్ధులు చెప్పుదురు. ఇందేమాత్రము సందేహము లేదు.

చౌ॥ సంత బిసుద్ధ మిలహిం పరితేహీ।
చితవహిం రామకృపా కరి జేహీ॥
రామకృపాం తవ దరసన భయఊ।
తవ ప్రసాద సబ సంసయ గయఊ॥

తా॥ సాధుమహాత్ములు శ్రీరామానుగ్రహమువలన వారిని దర్శింతురు. కలిసికొనియెదరు. జానకీపతి అనుగ్రహమువలన నేడు నాకు మీ దర్శనము లభించినది. మీ అనుగ్రహముచే నా సందేహములు నశించినవి

దో॥ సుని బిహంగపతి బానీ సహిత బినయ అనురాగ ।
పులకితగాత లోచన సజల మనహరషేఉ అతి భాగ ॥

తా॥ పక్షిరాజగు గరుడుని వినయముతోగూడిన ప్రేమయుక్తములగు పలుకులు విని కాకభుశుండి తన్మయుడయ్యెను. శరీరము పులకరించెను. కనులనుండి ఆనందబాష్పములు స్రవించసాగెను మనస్సునందు అత్యంత ఆనందము గలిగెను.

దో॥ శ్రోతా సుమతి సుసీల సుచికథా రసిక హరిదాస ।
పాఇ ఉమా అతి గోప్యమపి సజ్జన కరహిం ప్రకాశ ॥ 69

తా॥ ఓ ఉమా ! మంచి బుద్ధిమంతుడు, సుశీలుడు, పవిత్రమగు కథా ప్రేమికుడు, భగవానుని సేవకుడగు శ్రోతయు . సజ్జనుడును, గొప్ప ధనమును ప్రకటింపరు, రహస్యముగ జెప్పెదరు.

చౌ॥ బోలేఉ కాకభుసుండ బహోరీ ।
నభగ నాథ పర ప్రీతిన థోరీ ॥
సబ బిధి నాథ పూజ్య తుమమేరే ।
కృపా పాత్ర రఘునాయక కేరే ॥

తా॥ కాకభుశుండి మహర్షి పక్షిరాజగు గరుడునిపై మిక్కిలి ప్రేమతో నీవు నాకు పరమపూజనీయుడవు శ్రీరామచంద్రునియొక్క అనుగ్రహమునకు పాత్రుడవైనవాడవని ఇట్లు పలికెను.

చౌ॥ తుమ్హ హి న సంశయ మోహ న మాయా ।
మోపర నాథ కీన్హి తుమ దాయా ॥
పఠఇ మోహ మిసి ఖగపతి తోహీ ।
రఘుపతి దీన్హి బడాఈ మోహీ ॥ 2

తా॥ నీకు మోహము లేదు సందేహము లేదు. మాయాలంపటు డవు గావు ; ఓ పక్షిరాజా ; నీకు నాపై మిక్కిలి దయగలదు. శ్రీరామ చంద్రుడు నిన్నిచటకు బంపి నాకు గొప్పదనము గలుగజేసినాడు.

చౌ॥ తుమ్హ నిజ మోహ కహీ ఖగసాఈ ।
సో నహిఁ కఛు ఆచరజ గోసాఈ ।
నారద భవ బిరంచి సనకాదీ ।
జో మునినాయక ఆతమ బాదీ ॥ 3

తా॥ ఓ పక్షిరాజా ; నీకు మోహమున్నట్లు జెప్పినావు. ఓగోసాయి యిందులో ఆశ్చర్యమేమియు లేదు. నారదుడు. శివుడు, బ్రహ్మ, సనకాది మహర్షులు ఆత్మతత్త్వమును బాగుగ ఎరింగినవారు, విపులముగ చెప్ప గలరు, వారే శ్రేష్ఠమగు మునులు.

చౌ॥ మోహన అంధ కీన్హ కేహి కేహీ ।
కో జగ కామ న చావ న జేహీ ॥
తృష్ణాఁ కేహి న కీన్హ బౌరాహా ॥
కేహికర హృదయ క్రోధ నహిఁ దాహా ॥ 4

తా॥ అట్టివారిలో గూడ మోహము లేకుండునా ? జగమందంతటి గొప్పవారెవరు గలరు ? వారికి కోర్కెలు లేవా ? తృష్ణకు ఎవరు దాసుల గాలేదు ? కోపాగ్నిచే ఎవరి హృదయమును దహింపకుండును ?

దో॥ గ్యానీ తాపస సూర కవి కోవిద గున ఆగార ।
కేహి కై లోభ బిడంబనా కీన్హి న ఎహిం సంసార ॥ 70

తా॥ ఈ జగమందు జ్ఞానిని, తపస్విని, శూరవీరుని, కవిని, విద్యావంతుని గుణనిలయుని లోభము పరిహసించును.

దో॥ శ్రీమద బక్ర న కీన్హ కేహి ప్రభుతా బధిర న కాహి।
మృగలోచని కే నైన సర కో అసలాగ న జాహి ॥ 70

తా॥ లక్ష్మీసంపన్నులు కఠినులు. వారెవరిని లెక్కింపరు ? యువతుల జూపులకు లొంగని పురుషు లెవరు గలరు ?

చౌ॥ గున కృత సన్యపాత నహిం కేహీ ।
కో ఉపమాన మద తజేఉ నిజేహీ ॥
జోబన జ్వర కేహి నహిం బలకావా ।
మమతా కేహి కర జస న నసావా ॥ 1

తా॥ రజస్సు, తమస్సు గుణముల సన్నిపాత మెవరికి కలుగలేదు ? అభిమానమునకు, మదమునకు ఎవరు దూరముగా వున్నారు? యౌవనదశ యందు ఉద్రేకమును చంపుకొని ఎవరుండగలరు ? మమత్వము ఎవరి కీర్తి ప్రతిష్ఠలు నాశనము జేయదు ?

చౌ॥ మచ్ఛర కాహి కలంక నలావా ।
కాహిన సోక సమీర డోలావా ॥

చింతా సాంపిని కో నహిం ఖాయా।
కో జగ జాహి నబ్యాపీ మాయా॥ 2

తా॥ మత్సరము ఎవరికి కళంకము గలుగజేయదు? దుఃఖము ఎవరిని కాంతిహీనుని జేయదు? ఆలోచనా రూపమనెడు సర్పము ఎవరిని మింగకుండును? వీటికి వశులుగానివారీ ప్రపంచమందెవరు గలరు? మాయ వ్యాపించని వారెవరు?

చౌ॥ కీట మనోరథ దారూ సరీరా।
జేహి నలాగ ఘునకో అసధీరా॥
సుత బిత లోక ఈషనా తీనీ।
కేహికై మతి ఇన్హ కృత నమలీన॥ 3

తా॥ సంకల్పములే పురుగులు. శరీరమే కర్ర. ఎవరి శరీరమందు కోరికలనెడు పురుగులు లేకుండ జేయు ధైర్యవంతు డెవడు గలడు? పుత్రవ్యామోహము, ధనవ్యామోహము లోకమందు కీర్తిప్రతిష్ఠలకు లొంబడని మానవుడెవడు గలడు?

చౌ॥ యహ సబమాయా కర పరివారా।
ప్రబల అమితి కో బరనై పారా॥
సివ చతురానన జాహి డేరాహీం।
అపర జీవ కేహి లేఖె మాహీం॥ 4

తా॥ ఇవన్నియు బలమగు మాయ పరివారములు. వీనికి హద్దులు లేవు. వీటిప్రభావము వర్ణింపనలవిగాదు. పరమశివుడు, బ్రహ్మయు ఈ మాయాపరివారమును జూచి భయపడుచుండ యితరులెక లెక్క?

దో॥ బ్యాపి రహేఉ సంసార మహుఁ మాయా కటక ప్రచండ।
సేనాపతి కామాది భట దంభ కపట పాషండ ॥ 71

తా॥ మాయకు ప్రచండమగు సేనలు సర్వత్రా నిండియున్నవి. కామ, క్రోధ, లోభములే వానికి సేనాపతులు. దంభము కపటము, యుద్ధ భటులు.

దో॥ సో దాసీ రఘుబీర కై సముఝేఁ మిథ్యా సోపి।
ఛూటన రామ కృపా బిను నాథ కహఉఁ పదరోపి । 71

తా॥ మాయాపరివారములే శ్రీరామచంద్రునకు దాసీలు, యిదంతయు బూటకముగనేయుండును. శ్రీరామచంద్రుని అనుగ్రహములేనిదే నశింపదని ప్రతిజ్ఞాపూర్వకము జెప్పుచుంటిని.

చౌ॥ జో మాయా సబ జగహి నచావా।
జాసు చరిత లఖి కాహుఁ న పావా॥
సోఇ ప్రభు భ్రూబిలాస ఖగరాజా।
నాచ నటీ ఇవ సహిత సమాజా॥ 1

తా॥ మాయ సర్వజగముల నాట్యమాడించుచున్నది. దాని విధి విధానము తెలుసుకున్నవారు లేరు. ఓపక్షిరాజా। అట్టిమాయా, దాని పరివారము శ్రీరామచంద్రుని కనురెప్పల ముందు నటునివలె నాట్యమాడుచుండును.

దో॥ సోఇ సచ్చిదానంద ఘన రామా।
అజ బిగ్యానా రూపబల ధామా॥
బ్యాపక బ్యాప్య అఖండ అనంతా।
అఖిల అమోఘశక్తి భగవంతా॥

తా॥ సచ్చిదానంద ఘనస్వరూపుడు, అజన్ముడు, విజ్ఞానస్వరూపుడు, ఆనందములకు, బలసంపదలకు నిలయుడు. సర్వవ్యాపకుడు, సర్వరూప ధారి, అఖండుడు. అనంతుడు. సంపూర్ణుడు. అమోఘశక్తి సంపన్నుడు, షడ్గుణైశ్వర్య సంపన్నుండు అతడే భగవానుడు.

చౌ॥ అగున అదభ్ర గిరా గోతీతా।
సబ దరసీ అనవద్య అజీతా॥
నిర్మమ నిరాకార నిరమోహా
నిత్య నిరంజన సుఖ సందోహా॥

తా॥ నిర్గుణుడు, మాయాగుణరహితుడు, గొప్పవాడు, వాక్కుద్వారా, ఇంద్రియములద్వారా వర్ణనాతీతుడు, కోర్కెల నెరవేర్చువాడు, దోషరహితుడు, అజేయుడు కోర్కెలులేనివాడు, నిరాకారుడు, మోహము లేనివాడు, సర్వకాల సర్వావస్థలలో నుండువాడు. మాయారహితుడు, సర్వ సుఖములకు నిలయుడు,

చౌ॥ ప్రకృతి పార ప్రభు సబ ఉరవాసీ।
బ్రహ్మ నిరీహ బిరజ అబినాసీ॥
ఇహాఁ మోహ కర కారన నాహీఁ।
రవి సన్ముఖ తమ కబహుఁ కి జాహీఁ

తా॥ అవధులులేనివాడు, సమర్థవంతుడు, ప్రభువు. సర్వకాలము లలో సర్వజీవరాసుల హృదయములలో నివసించువాడు కోర్కెలు వికార గుణములు లేనివాడు, నాశనములేని పరబ్రహ్మయునై యున్నాడు. సూర్యుని ఎదుట చీకట్లుండనట్లు శ్రీరామునిలో మోహముండుటకు అవ కాశము లేదు.

దో॥ భగతహేతు భగవాన్ ప్రభు రామధరే ఉతరు భూప।
కిఏ చరిత పావన పరమ ప్రాకృత నర అనూపా॥ 7॥

తా॥ శ్రీరామచంద్రప్రభువు భక్తుల కాపాడుట నిమిత్తమై దశరథ మహారాజు పుత్రుండై జన్మించి, సాధారణ మానవునివలె పవిత్రము లగు కార్యములు జేసెను.

దో॥ జథా అనేక భేవ ధరి నృత్య్ కరిఇ నటకోఇ।
సోఇ సోఇ భావ దేఖావఇ ఆపనుహోఇ నసోఇ॥ 7॥

తా॥ వేషము ననుసరించి నటకుడు నాట్యమాడుచుండునట్లు, భగవానుడు ఆయా అవతారములు ధరించి ప్రజారంజకముగ నడచుకొను చుండును. వాని లీలలు ఎవరికిని దెలియవు.

చౌ॥ అసి రఘుపతి లీలా ఉరగారీ।
దనుజ బి మోహాని జన సుఖకారీ॥
జేమతి మలిన బిషయ బసకామీ।
ప్రభు పర మోహా ధరహిం ఇమి స్వామీ॥

తా॥ ఓ గరుడుడా। రాక్షసులను మోహమున బడవేయుట, భక్తులకు సుఖముల కలుగజేయుట శ్రీరామచంద్రుని లీలలై యున్నవి. మానవుని హృదయమున మలినము నిండియున్నదో, విషయలోలుడై యుండునో, కాముకుడో అట్టివాడు ప్రభువును నిందించును.

చౌ॥ నయన దోవ జాకహం జబహోఈ।
పీత బరన ససి కహుం కహ సోఈ॥
జబ జేహి దిసి భ్రమ హోఇ ఖగేసా।
సో కహ పచ్ఛిమ ఉయఉ దినేసా॥

తా॥ పచ్చ కామెర్ల వ్యాధి గలవాడు చంద్రుని కాంతిహీనుడని చెప్పును. ఓ పక్షిరాజా! దిక్కులు తెలియనట్టివాడు సూర్యుడు పడమట ఉదయించుచున్నాడని పలుకును.

చౌ॥ నౌకారూఢ చలత జగదేఖా ।
    అచల మోహా వశ ఆపుహి లేఖా ॥
    బాలక భ్రమహిం న భ్రమహిం గృహాదీ ।
    కహహిం పరస్పర మిథ్యావాదీ ॥ 3

తా॥ ఓడలో ప్రయాణము చేయువారు భూమి తిరుగుచున్నట్లు భావించును. మోహమునకు వశుడగుటవలన కూర్చున్నట్లు భావింపడు. బాలుడు గుండ్రముగ తిరుగుచున్నపుడు గృహములు తిరుగుచున్నట్లు కనిపించినను నవి తిరుగవు. వారుభయులు అసత్యమునే చెప్పుదురు.

చౌ॥ హరి బిషఇక అస మోహా బిహంగా ।
    సపనేహుం నహిం అగ్యానా ప్రసంగా ॥
    మాయా వస మతి మంద అభాగీ ।
    హృదయం జమనికా బహువిధ లాగీ ॥ 4

తా॥ ఓ గరుడుడా ! శ్రీహరి లీలలు అనంతములు. మోహమును కల్పించుటయందు ఆరితేరి యుండును. శ్రీహరికి అజ్ఞాన ప్రసంగములతో నవసరముండదు. మాయకు వశులైనవారున్నూ, మందబుద్ధిగలవారున్నూ, దురదృష్టవంతులున్నూ భగవానుని దూషించుచుందురు.

చౌ॥ తే సఠ హఠ బస సంసయా కరహీం ।
    నిజ అగ్యాన రామ పర ధరహీం ॥ 5

తా॥ మూర్ఖులు సందేహముతో నుందెదరు, వారి అజ్ఞానము శ్రీరామునిపై ఆరోపించెదరు.

దో॥ కామ క్రోధ మద లోభ రత గృహాసక్త దుఖరూప।
తే కిమి జానహిఁ రఘుపతిహి మూఢ పరే తమకూప॥

తా॥ కామ, క్రోధ, లోభ, మోహ, మదములు దుఃఖస్వరూపమగు గృహమునందాసక్తి గలవారు శ్రీరామచంద్రుని ఎట్లు తెలుసుకొనగలరు? వారు అంధకారరూపమున గల భావిలో పడెదరు.

దో॥ నిర్గుణ రూప సులభ అతి సగున జాన నహిఁ కోఇ।
సుగమ అగమ నానా చరిత సుని ముని మన భ్రమ హోఇ॥

తా॥ నిర్గుణరూపము సులభము. కాని సగుణరూపము నెవరును తెలిసికొనజాలరు. కావుననే ఆ సగుణభగవానుని అగోచరమగు కథను విని మునుల మనస్సులుగూడ భ్రమను జెందుచున్నవి.

చౌ॥ సును ఖగేస రఘుపతి ప్రభు తాఈ।
కహఉఁ జథామతి కథా సుహాఈ॥
జేహి బిధి మోహ భయఉ ప్రభు మోహీ।
సోఉ సబ కథా సనావఉఁ తోహీ॥

తా॥ గరుడుడా! శ్రీరఘురాముని గొప్పతనమును వినుము. నా బుద్ధి ననుసరించి దివ్యమగు కథను వర్ణించెదను. మోహమున కెట్లు వశుడనైనది దెలిపెదను.

చౌ॥ రామకృపా భాజన తుమ్హ తాత।
హరి గున ప్రీతి మోహి సుఖ దాతా॥

తాతే నహిఁ కఛు తుమ్హ దురావఉఁ ।
పరమ రహస్య మనోహర గావఉఁ ॥

తా॥ ఓ స్వామీ! నీవు శ్రీరామచంద్రుని అనుగ్రహమునకు పాత్రుడవు శ్రీహరి గుణములందు నీకు ప్రేమగలదు. నన్ను మిక్కిలి సంతోషపరచితివి. అత్యంత రహస్యమగు విషయములు కీర్తించి నీకు వినిపించుచుంటిని.

చౌ॥ సునహు రామ కర సహజ సుభాఉఁ ।
జన అభిమాన న రాఖహిఁ కాఉ ॥
సంసృత మూలసూల ప్రద నానా ।
సకల సోకదాయక అభిమానా ॥

తా॥ శ్రీరామచంద్రునియొక్క సహజ స్వభావమును వినుము. తన భక్తులలో అభిమాన ముండనీయడు. అభిమానము జన్మ మరణ రూప సంసారమునకు మూలమైనది. అది అనేకవిధములగు కష్టనష్టములను, దుఃఖములను గలుగజేయును.

చౌ॥ తాతే కరహిఁ కృపానిధి దూరీ ।
సేవక పరమమతా అతి భూరీ ॥
జిమిసిసు తన వ్రన హోఇ గోసాఇఁ ।
మాతు చరావ కఠిని కీ నాఈఁ ॥

తా॥ పిల్లవాడు కురుపులతో బాధపడుచుండిన తల్లి కఠోర హృదయురాలైననూ, బాధ చెందునుగదా? దయాసముద్రుడగు భగవానుడు భక్తుల బాధలను సహింపజేయును. భక్తుడనిన శ్రీహరికి మిక్కిలి ప్రేమ యుండును.

దో॥ జదపి ప్రథమ దుఖ పావ ఇ రోవఇ బాల అధీర।
వ్యాధి నాస హిత జననీ గనతి న సో సిసు పీర॥ 74

తా॥ బాలుడు మొదట వుండు బాధకు తట్టుకొనలేక స్వాధీనము తప్పి ఏడ్చును. ఆ బాధ తగ్గిన తదుపరి పిల్లవాని బాధను తల్లి స్మరించదు.

దో॥ తిమి రఘుపతి నిజ దాసకర హరహిఁ మానహిత లాగి।
తులసీ దాస ఐసే ప్రభుహి కస న భజహు భ్రమ త్యాగి।

తా॥ అదేవిధముగ శ్రీరఘురాముడు తన దాసులకు గల్గిన గర్వమును, అభిమానమును వారివారి శుభములకొరకై నశింపజేయును. అట్టి ప్రభువగు శ్రీరాముని ఏల భజింపరని శ్రీ తులసీదాసుగారడుగుచున్నారు.

చౌ॥ రామ కృపా ఆపని జడ తాఈ।
కహఁఉ ఖగేస సునహు మనలాఈ॥
జబ జబ రామ మనుజ తను ధరహీ।
భక్త హేతు లీలా బహు కరహీ॥ 1

తా॥ ఓ పక్షిరాజా! శ్రీరామచంద్రుని దివ్యానుగ్రహమున్నూ నా మూర్ఖత్వమున్నూ జెప్పుచున్నాను. ఏకాగ్రతతో వినుము భగవానుడగు శ్రీరామచంద్రుడు మనుజశరీరమును ధరించినప్పుడెల్లను భక్తులకొరకై వివిధ లీలలను జేయును.

చౌ॥ తబ తబ అవధపురీ మైఁ జాఊఁ
బాలచరిత బిలోకి హరషాఊఁ॥

జన్మ మహోత్సవ దేఖఉఁ జాఈ ।
బరష పాఁచ తహఁ రహఉఁ లోభాఈ ॥

తా॥ అప్పుడప్పుడు నేను అయోధ్యాపురమునకు వెళ్ళి దివ్యమగు బాలలీలలు, జన్మదినవేడుకల జూచుచు ఆనందముగ ఐదు సంవత్సరము లచ్చటనే యుందును.

చౌ॥ ఇష్టదేవ మమ బాలక రామా ।
సోభా బపుష కోటి సత కామా ॥
నిజ ప్రభు బదన నిహారి నిహారీ ।
లోచన సుఫల కరఉఁ ఉరగారీ ॥ 3

తా॥ బాలస్వరూపుడగు శ్రీరామచంద్రుడు నా ఇష్టదేవత. కోట్ల కొలది మన్మధులకంటె అందమైనవాడు. ఓ గరుడుడా! నా ప్రభువు యొక్క దివ్యముఖారవిందమును జూచి జూచి నా నేత్రముల సఫలము గావించుకొందును.

చౌ॥ లఘు బాయస బపు ధరి హరి సంగా ।
దేఖఉఁ బాలచరిత బహు రంగా ॥ 4

తా॥ నేనీ చిన్న కాకి శరీరమును ధరించి భగవానునివెంట దిరుగుచు బాలలీలలు జూచుచుందును.

దో॥ లరికాఇఁ జహఁ జహఁ ఫిరహిఁ తహఁ తహఁ సంగ ఉడాఉఁ ।
జూఠని పరఇ అజిర మహఁ సో ఉఠాఇ కరి ఖాఉఁ ॥

తా॥ భగవానుడు చిన్నతనమం దెచ్చటెచ్చట దిరుగుచుండునో అచ్చటచ్చటకు నే నెగురుచు బాలరాము దొదలిన ఉచ్ఛిష్ట పదార్థముల నేరుకొని తినుచుందును.

దో॥ ఏకబార అతి నయ సబ చరిత కిఏ రఘుబీర ।
సుమిరత ప్రభు లీలా సోఇ పులకిత భయఉ సరీర ॥ 75

తా॥ శ్రీరామచంద్రుడు దొక పర్యాయము లీలలు ప్రదర్శించెను. కాకభుశుండి భగవానుని లీలలు జెప్పుచు నేత్రముల ఆనందబాష్పములు కార్చుచుండెను. శరీరము పులకరించెను. ప్రేమోన్మత్తుడై యుండెను.

చౌ॥ కహఇ భుసుండ సునహు ఖగనాయక ।
రామ చరిత సేవక సుఖదాయక ॥
నృపమందిర సుందర సబ భాంతీ ।
ఖచిత కనకమని నానా జాతీ ॥

తా॥ ఓ పక్షిరాజా ! గరుడుడా ! దయతో వినుడు. శ్రీరాముని దివ్యకథలు దాసులకు సుఖము గలుగజేయును. అయోధ్యలో శ్రీరాముడు నివసించు రాజమహలు సుందరమైనది. బంగారముచే నిర్మింపబడిన ఆ మహలునందు దక్కడక్కడ వివిధ విధములగు దివ్యకాంతుల నెదజల్లు రత్నములు పొదగబడి యున్నవి.

చౌ॥ బరని న జాఇ రుచిర అంగనాఈ ।
జహఁ ఖేలహిఁ నిత చారిఉ భాఈ ॥
బాల బినోద కరత రఘురాఈ ।
బిచరత అజిర జనని సుఖదాఈ ॥

తా॥ శ్రీరాముడుండు దివ్యాంగణమును వర్ణించలేము. అచట నల్గురన్నదములు నిత్యమాడుకొనుచుందురు. సంతోషమును గలుగజేయుచు శ్రీరామచంద్రు డాడుకొనుచుండును.

చౌ॥ మరకత మృదుల కలేవర శ్యామా ।
అంగ అంగ ప్రతి ఛబి బహు కామా ॥
నవ రాజీవ అరున మృదు చరనా ।
పదజ రుచిర నఖ ససి దుతి హరనా ॥ 3

తా॥ మరకతమణులు, మృదువైన, నీలమేఘమువంటి శరీరముగల వాడును, తేజమున కోట్లకొలది మన్మథులను మించియున్నవాడును, ఎఱ్ఱని పద్మములకంటె కోమలమగు పాదములుగలవాడును, సుందరమగు వ్రేళ్ళు గలవాడును, పూర్ణచంద్రుని ధిక్కరించు కాంతిగల గోళ్ళుగలవాడును,

చౌ॥ లలిత అంక కులిసాదిక చారీ ।
నూపుర చారు మధుర రవకారీ ॥
చారు పురట మనిరచిత బనాఈ ।
కటి కింకిని కల ముఖర సుహాఈ ॥ 4

తా॥ వజ్రము, అంకుశము, ధ్వజము, కమలములుగల చిహ్నములు గలవాడును, పాదములకు గజ్జెలుధరించినవాడును రత్నములచే పొదగ బడిన, బంగారుచే నిర్మితమైన, సుందరమైన తాళధ్వనులు ఆనందమును గలిగించుచుండెను.

దో॥ రేఖా త్రయ సుందర ఉదర నాభిరుచిర గంభీర ।
ఉర ఆయత భ్రాజత బిబిధి బాల బిభూషన చీర ॥ 76

తా॥ పొట్టమీద సుందరములగు మూడురేఖలు గలవాడును, అంద ములోగూడిన బొడ్డుగలవాడునై యుండెను. విశాలమగు హృదయమున వివిధ విధములగు ఆభరణములు, వస్త్రములు శోభతో నుండెను.

చౌ॥ అరున పాని నఖ కరజ మనోహర ।
బాహు బిసాల బిభూషన సుందర ॥
కంధ బాల కేహరి పద గ్రీవా ।
చారు చిబుక ఆనన ఛబి సీంవా ॥ 1

తా॥ ఎఱ్ఱని చేతులు, గోళ్ళు, వ్రేళ్ళు మనస్సుల హరించునట్లుండెను. విశాలములగు భుజములు బంగారు ఆభరణములచే శోభిల్లుచుండెను సింహపు పిల్ల వంటి నడుముగలవాడును, శంఖాకృతిగల కంఠమున మూడు రేఖలు, అందమైన గడ్డము ముఖముతో శోభించుచుండెను.

చౌ॥ కలబల బచన అధుర అరునారే ।
దుఇ దుఇ దసన బిసద బరబారే ॥
లలిత కపోల మనోహర నాసా ।
సకల సుఖద ససికర సమహాసా ॥ 2

తా॥ మధురములగు చిలుకపలుకులును, ఎఱ్ఱని పెదవులు గలిగియుండెను చిన్ని, చిన్ని పలువరుసలును, సుందరమగు కంఠము, మనోహరమగు ముక్కు, సుఖమును ఆనందమును గలుగజేయుచుండెను. పూర్ణచంద్రుని వలె చిరునవ్వు గలిగినవాడును,

చౌ॥ నీలకంజలోచన భవమోచన ।
భ్రాజత భాల తిలక గోరోచన ॥
బికట భృకుటి సమ శ్రవన సుహాఏ ।
కుంచిత కచ మేచక ఛబి ఛాఏ ॥ 3

తా॥ నీలకమలములతో సమానములగు నేత్రములు గలవాడును, జనన-మరణ చక్రబంధమునుండి రక్షించువాడును, నుదిటిపై ఎఱ్ఱని తిలక

మును ధరించినవాడును, నల్లని కనురెప్పలు గలవాడును, సుందరములగు చెవులు గలవాడును, నల్లని ఉంగరాల జుట్టుతో మంచి అందముగనున్న వాడును

చౌ॥ పీత ఝీని ఝుంగులీ తన సోహీ ।
కిల కని చితవని భావతి మోహీ ॥
రూప రాసినృప అజిర బిహారీ ।
నాచహిఁ నిజ ప్రతి బింబ నిహారీ ॥ 4

తా॥ పట్టంచుగలిగిన పసుపువచ్చ వర్ణముగల వస్త్రమును ధరించి నన్ను మోహింపజేయునట్లుండెను. దశరథుని ప్రాంగణములో విహరించు రూపరాశియగు శ్రీరామచంద్రుడు తన నీడనుజూచి ఆడుకొనుచుండెను

చౌ॥ మోహి సన కరహిఁ బిబిధ బిధి క్రీడా ।
బరనత మోహి హోతి అతి బ్రీడా ॥
కిలకత మోహి ధరన జబ ధావహి ।
చలఉఁ భాగి తవ పూప దేఖావహి ॥

తా॥ నాతో బహువిధములగు నాటలు ఆడిరి. వారి దివ్యమగు కథలు వర్ణించుటకు నాకు సిగ్గగుచున్నది. కొట్టబోవునపుడు, పట్టుకొనబోవునపుడు నేనెగిరిపోయెడివాడను అప్పుడు నావైపు జూచెడివాడు

దో॥ ఆవత నికటహఁ సహి ప్రభు భాజతరుదనకరాహిఁ ।
జాఉఁ సమీప గవన పద ఫిరి ఫిరి చితఇ పరాహిఁ ॥ 77

తా॥ నేను దగ్గరకు వచ్చినపుడు ప్రభువునవ్వును, దూరముగ పరుగిడినపుడేడ్చును. నేనాయన పాదముల స్పృశించుట కెడలినపుడు వెను దిరిగి నావైపు జూచుచు పరుగిడును.

దో॥ ప్రాకృత సిసు ఇవలీలా దేఖి బయఉ మోహిమోహ
కవన చరిత్రకరత ప్రభు చిదానంద సందోహ ॥ 7।

తా॥ పిల్లలుజేయు కార్యములెట్లు ఆనందముగనుండునో, ప్రభువు జేయులీలలు మోహమును గలుగ జేయచుండెను

చౌ॥ ఏతనామన ఆనత ఖగరాయా ।
రఘుపతి ప్రేరిత బ్యాపీమాయా ॥
సోమాయా న దుఖద మోహి కాహీం ।
ఆన జీవ ఇవ సంసృత నాహీం ॥ 1

తా॥ ఓ పక్షిరాజా ! శ్రీరఘురాముని ప్రేరణవలన మాయ నన్ను ఆవరించి నిరుత్సాహమును గలుగజేసినది. ఆమాయా దుఃఖములు గలుగ జేయువాడు నన్ను సంసార దుఃఖమున బడనీయలేదు.

చౌ॥ నాథ ఇహాం కఛు కారన ఆనిరా
సునహు సో సావధాన హరిజానా ॥
గ్యాన అఖండ ఏక సీతాబర ।
మాయా బస్య జీవ సచరాచర ॥ 2

తా॥ ఓప్రభూ ! గరుడుడా ! రెండవకారణము గలదు. జాగ్రత్తగ వినుము. సీతాపతియగు శ్రీరామచంద్రుడొక్కడే అఖండమైన జ్ఞానసంపద లకు నిలయుడు. చరాచర జీవులన్నియు మాయకు వశమైనట్టివే.

చౌ॥ జౌం సబకేం-రహాగ్యాన ఏకరస ।
ఈశ్వర జీవహి భేద కహహు కస ॥

మాయావస్య జీవ అభిమానీ ।
ఈస వస్య మాయాగుణ ఖానీ ॥ 3

తా॥ జ్ఞానమును జీవులు గలిగియుండిన జీవేశ్వరునకు భేదముదెలియు టెట్లు? అభిమానముగల జీవులు మాయకు సత్వ, రజో, తమో గుణము లకు నిలయులయ్యేదరు. మాయ భగవానునికి వశమైయుండును.

చౌ॥ పరవశ జీవ స్వవస భగవంతా ।
జీవ అనేక ఏక శ్రీకంతా ॥
ముధా భేద జద్యపికృత మాయా ।
బిను హరి జాఇ నకోటి ఉపాయా ॥ 4

తా॥ జీవులు అస్వతంత్రులు. భగవానుడు సర్వస్వతంత్రుడు, జీవులు అనేకులు, భగవానుడు ఒక్కడు. మాయా ప్రభావముగల అసత్యమునుండి తప్పించుకొనుటకు హరిభజనము దప్ప కోటి ఉపాయములు ఉన్నను తప్పించుకొనలేవు

దో॥ రామచంద్రకే భజన బినుజో చహ పద నిర్వాన ।
గ్యానవంత అపిసోనర పసుబిను పూంఛ బిషాన ॥ 78

తా॥ శ్రీరామచంద్రుని భజింపక మోక్షమును గోరుకొనువారు జ్ఞాన వంతులయినప్పటికిని తోక, కొమ్ములులేని పశువుతో సమానుడు.

దో॥ రాకాపతిషోడస ఉఅహిం తారాగన సముదాఇ ।
సకలగిరిన్హ దవలాఇ అ బిను రవి రాతి నజాఇ ॥ 78

తా॥ నక్షత్రమండలములన్నింటితోను పదునారు కళలుగల చంద్రుడుదయించినను, పర్వత సముదాయములన్నియును దావాగ్నిచే దగ్ధమగుచున్నను, సూర్యుడుదయించనిదే రాత్రి నశించదు.

చౌ॥ ఐసేహిం హరిబిను భజను ఖగేసా ।
మిటఇ న జీవన్హ కర కలేసా ॥
హరిసేవకహి న బ్యాపు అవిద్యా
ప్రభు ప్రేరిత బ్యాపఇ తేహిబిద్యా ॥

తా॥ ఓ పక్షిరాజా ! ఈ విధముగ శ్రీహరి భజనాదులు లేనియెడల జీవులకు దుఃఖము నశింపదు. శ్రీమన్నారాయణుని సేవకులకు అవిద్య గలుగదు. భగవానుని ప్రేరణవలన విద్యావ్యాప్తి గలుగును.

చౌ॥ తాతే నాస నహోఇ దాసకర ।
భేద భగతి బాఢఇ బిహంగ బర ॥
భ్రమ తే చకిత రామమోహి దేఖా ।
బిహంసే సో సును చరిత బిసేషా ॥

తా॥ పక్షిశ్రేష్ఠా ! అందువలన భక్తునకు నాశనము లేదు; భక్తి అభివృద్ధియగును. నా భ్రమను జూచి శ్రీరామచంద్రుడు ఆశ్చర్యమును పొంది నవ్వెను. ఆ విశేషమగు కథలు వినుము.

చౌ॥ తేహి కౌతుక కర మరము నకాహూ ।
జానా అనుజ నమాతు పితాహూ ॥
జాని పాని ధాఎ మోహి ధరనా ।
స్యామల గాత అరునకర చరనా ॥

తా॥ ఆ ఆటలోని మర్మము మునులకు, తలిదండ్రులకు ఇతరులకు తెలియదు. నీలమేఘశ్యాముడును, ఎఱ్ఱని అరచేతులును, ఎఱ్ఱని పాదములు గల బాలరాముడు నన్ను బట్టుకొనుటకై పరుగిడెను.

చౌ॥ తబ మైఁ భాగి చలేఉఁ ఉరగారీ ।
రామ గహన కహఁ భుజా పసారీ ॥
జిమి జిమి దూరి ఉడాఉఁ అకాసా ।
తహఁ భుజ హరి దేఖఉఁ నిజపాసా ॥

తా॥ ఓ సర్పనాశకా! గరుడుడా! నేనప్పుడు పరుగిడెడివాడను. శ్రీరామచంద్రుడప్పుడు నన్ను పట్టుకొనుటకై రెండు చేతులు జాచును. నే నాకాశమార్గమున దూరముగ వెడలుచుండ ఆతని రెండుచేతులు నా దగ్గరగ ఉండుటను జూచితిని.

దో॥ బ్రహ్మలోకలగి గయఉఁ మైఁ చితయఉఁ పాఛ ఉడాత ।
జుగ అంగుల కరబీచ సబ రామభుజహి మోహి తాత ॥

తా॥ నేను బ్రహ్మలోకమున కెడలి వెనుదిరిగి జూచితిని. ఓ గరుడుడా! శ్రీరామచంద్రుని రెండుచేతులు కేవలము నాకు రెండు అంగుళముల దూరమున మాత్రమే గలవు.

దో॥ సప్తావరన భేదకరి జహాఁ లగేఁ గతి మోరి ।
గయఉఁ తహాఁ ప్రభుభుజ నిరఖి బ్యాకులభయఉఁ బహోరి ॥

తా॥ సప్తావరణలు దాటి నే పోగల్గినంతదూరము పోతిని. అప్పటను శ్రీరామచంద్ర ప్రభువుయొక్క రెండుచేతులును నావెంట వచ్చుటను జూచి వ్యాకులతను జెందితిని.

చౌ॥ మూలాఁదేఉఁ నయన త్రసిత జబ భయఉఁ।
పుని చితవత కోసల పుర గయఉఁ॥
మోహిఁ బిలోకి రామ మునుకాహీఁ।
బిహఁ సత తురత గయఉఁ ముఖ మాహీఁ॥

తా॥ భయము చెందినవాడనై రెండు కన్నులు మూసికొని వెంటనే దెరచిజూడ అయోధ్యాపురమందుంటిని. నన్నప్పుడు శ్రీరామచంద్రుడు జూచి ముసిముసి నవ్వుల వ్వెను. నవ్వు నప్పుడా నోటిలోనికి జొరబడితిని.

చౌ॥ ఉదర మాఝు సును అండజ రాయా।
దేఖేఉఁ బహు బ్రహ్మాండ నికాయా॥
అతిబిచిత్ర తహఁలోక అనేకా।
రచనా అధిక ఏక తే ఏకా॥ 2

తా॥ ఓ పక్షిరాజా! దయతో వినుడు. నే నాయన గర్భమందనేక బ్రహ్మాండములు జూచితిని, అచ్చట వివిధ విధములగు విచిత్రములైనటు వంటి లోకములు గలవు. వాని రచనా నిర్మాణము ఒకదానిని మించి వేరొకటి గలదు.

చౌ॥ కోటిన చతురానన గౌరీసా।
అగనిత ఉడగన రవి రజనీసా॥
అగనిత లోకపాల జమకాలా।
అగనిత భూధర భూమి బిసాలా॥ 3

తా॥ కోట్లకొలది బ్రహ్మలును, శివులును, లెక్కించుటకు వీలు గాని నక్షత్రములును, సూర్యులును, చంద్రులును, లోకపాలురగు యములు, కాలమును అనేక పర్వత సర్వసముదాయములును, భూమియు

చౌ॥ సాగర సరిస రబి సీస అపారా।
నానా భాంతి సృష్టి బిస్తారా॥
సురముని సిద్ధ నాగ నర కిన్నర।
చారి ప్రకార జీవ సచరాచర॥ 4

తా॥ అసంఖ్యాకములగు సముద్రములు, నదులు, చెరువులు, వనములతో గూడినట్టి వివిధరకములగు సృష్టి నిర్మాణముల జూచితిని. దేవతల, మునుల, సిద్ధుల, నాగుల, మనుష్యుల, కిన్నరుల, నాలుగు విధములైనట్టి జడ, చేతనములగు జీవుల జూచితిని.

దో॥ జో నహిఁ దేఖా నహిఁ సునా జో మనహూఁ న సమాఇ।
సో సబ అద్భుత దేఖేఉఁ బరని కవని బిధి జాఇ॥ 80

తా॥ జూడని, వినని, ఊహింపజాలనట్టి అద్భుతమగు సృష్టి నిర్మాణమును జూచితిని. నే నా సృష్టి నిర్మాణము నెట్లు వర్ణింపగలను,

దో॥ ఏక ఏక బ్రహ్మాండ మహుఁ రహూఉఁ బరష శత ఏక।
ఏహి బిధి దేఖత ఫిరఉఁ మైఁ అండ కటాహ అనేక॥ 80

తా॥ నే నొక్కొక్క బ్రహ్మాండములో నూరు, నూరు సంవత్సరము లుంటిని ఆ బ్రహ్మాండములన్నిటిని జూచుచు తిరుగుచుంటిని.

చౌ॥ లోక లోక ప్రతి భిన్న బిధాతా।
భిన్న బిష్ణు సివ మను దిసిత్రాతా॥

నర గంధర్వ భూత బేతాలా ।
కిన్నర నిసిచర పసు ఖగ బ్యాలా ॥

తా॥ ఒక్కొక్క లోకమునకు ఒక్కొక్క బ్రహ్మయును విష్ణువును, శివుడును, మనువును, దిక్పాలురును, మనుష్యులును, గంధర్వులును, భూత, భేతాళురును, కిన్నరులు. రాక్షసులు, పశువులు, పక్షుల, సర్పాదులును.

చౌ॥ దేవ దనుజ గన నానా జాతీ ।
సకల జీవ తహఁ ఆనహి భాంతీ ॥
మహి సరి సాగర సర గిరి నానా ।
సబ ప్రపంచ తహఁ ఆనఇ ఆ నా ॥

తా॥ నానావిధ జాతులతో గూడిన దేవతలు, రాక్షసు లచ్చట ఉండిరి. ఆ ప్రాణులెల్లరు యితరచోట్ల గల జీవులుండినట్లుండిరి. అనేకములగు భూమండలములు, నదులు, సముద్రములు, చెరువులు, పర్వతముల, సృష్టి నిర్మాణమంతయు ఒకదానిని బోలి ఒకటి యుండెను.

చౌ॥ అండకోస ప్రతి ప్రతి నిజరూపా ।
దేఖేఉఁ జినస అనేక అనూపా ॥
అవధ పురీ ప్రతిభువన నివారీ ।
సరజూ భిన్న భిన్న నర నారీ ॥

తా॥ బ్రహ్మండములలో నేను నానారూపములను, ఉపమారహితములగు వస్తువులను జూచితిని. ఒక్కొక్క భువనమునందొక్కొక్క అయోధ్యాపురమును, భిన్నభిన్నములగు సరయూ నదులను, భిన్నభిన్న రూపులగు స్త్రీపురుషులను జూచితిని.

చౌ॥ దశరథ కౌసల్యా సుని తాతా ।
బిబిధ రూప భరతాది క భ్రాతా ॥
ప్రతి బ్రహ్మాండ రామ అవతారా ।
దేఖే ఉఁ బాలబినోద అపారా ॥ 4

తా॥ గరుడుడా ! దయతో నాలకింపుము. అనేకమంది దశరథులతో, కౌసల్యామాతల, భరతాది సోదరుల వివిధరూపధారులై యుండుటను జూచితిని. ఒక్కొక్క బ్రహ్మాండమునందు శ్రీరాముని అవతారమును, అపారములగు బాలలీలలు జూచుచు తిరుగుచుంటిని.

దో॥ భిన్న భిన్న మైఁ దీఖ సబు అతి బిచిత్ర హరిజాన ।
అగనిత భువన ఫిరఉఁ ప్రభు రామన దేఖేఉఁ ఆన ॥ 81

తా॥ ఓ విష్ణువాహనుడా ! వివిధ విధములగు, భిన్న-భిన్నములైనట్టి అత్యంత మనోహరములైన విచిత్రములను జూచితిని. నేననేకములైన బ్రహ్మాండములను జూచితిని. శ్రీరామచంద్ర ప్రభువును వేరొక విధమున జూడలేదు.

దో॥ సోఇ సిసు పన సోఇ సోభా సోఇ కృపాల రఘు బీర ।
భువన భువన దేఖత ఫిరఉఁ ప్రేరిత మోహ సమీర ॥

తా॥ సర్వత్రను ఆతడే బాలరూపరాముడు దయాసముద్రుడై యుండెను. నేనీ ప్రకారము మోహరూపమనెడు వాయువులచే ప్రేరితుడనై బ్రహ్మాండములను జూచుచు దిరుగుచుంటిని.

చౌ॥ భ్రమత మోహి బ్రహ్మాండ అనేకా ।
బీతే మనహుఁ కల్పసత ఏకా ॥

ఫిరత ఫిరత నిజ ఆశ్రమ ఆయఉఁ ।
తహఁ పుని రహి కఛు కాల గవాయఉఁ 1

తా॥ ఆ బ్రహ్మాండములలో మూరు కల్పముల కాలము దిరిగి నా నిజ ఆశ్రమమునకు వచ్చి, కొంతకాలమచ్చటుంటిని.

చౌ॥ నిజ ప్రభు జన్మ అవధ సుని పాయఉఁ ।
నిర్భర ప్రేమ హరషి ఉఠి ధాయఉఁ ॥
దేఖఉఁ జన్మ మహోత్సవ జాఈ ।
జేహి బిధి ప్రథమ కహా మైఁ గాఈ ॥ 2

తా॥ శ్రీరామచంద్రమహారాజుఅయోధ్యాపురములో జన్మించినట్లుతెలిసికొని సంతోషముతో ఆపట్టణమునకు పరుగిడితిని. జన్మదనోత్సవమునందు పాల్గొని, ఆనందించి నీకు చెప్పిన విషయములన్నియు కీర్తించితిని.

చౌ॥ రామ ఉదర దేఖేఉఁ జగ నానా ।
దేఖత బనఇ నజాఇ బఖానా ॥
తహఁ పుని దేఖేఉఁ రామ సుజానా ।
మాయాపతి కృపాల భగవానా ॥ 3

తా॥ శ్రీరామచంద్రుని గర్భములో నేననేకబ్రహ్మాండముల, జూచి తిరిగితిని. అవి వర్ణనాతీతము. మాయాపతియు, సర్వము నెరింగినవాడును, దయాసముద్రుడునగు శ్రీరామచంద్ర భగవానుని నేనచ్చట --చితివి.

చౌ॥ కరఉఁ బిచార బహోరి బహోరీ ।
మోహ కలిల బ్యాపిత మతి మోరీ ॥

ఉభయ ఘరీ మహఁ మై సబ దేఖా ।
భయఉ భ్రమిత మన మోహా బిసేషా ॥

తా॥ నాబుద్ధి మోహరూపమనెడు భ్రమచే నిండియున్నదని దెలిసి కుంటిని. ఈ భువనబ్రహ్మాండంబులనన్నింటిని రెండుగంటల కాలములో జూచితిని. నా మనస్సున విశేషముగ మోహము వ్యాపించుటచే భ్రమలో పడితిని.

దో॥ దేఖి కృపాల బికల మోహి బిహఁసే తబ రఘు బీర ।
బిహఁసతహీఁ ముఖ బాహేర ఆయఉఁ సునుమతి ధీర ॥

తా॥ నా వ్యాకులతను జూచి శ్రీరామచంద్రుడు నవ్వెను ధైర్యశాలీ! ధీశాలీ! దయతో వినుడు. ఆ ప్రభువు నవ్వుటతోడనే నే నాతని నోటిలోనుండి బయటపడితిని.

దో॥ సోఇ లరికాఈ మోసన కరన లగే పుని రామ ।
కోటి భాంతి సముఝావఉఁ మను నలహాఇ బిశ్రామ ॥

తా॥ శ్రీరామచంద్రుడు మరల నావైపుకు దిరిగి బాల్యచేష్టలు జేయ సాగెను. నేననేక కోట్లపర్యాయములు మనస్సును స్వాధీనతకు తెచ్చుకొనుటకు ప్రయత్నించితిని. కాని శాంతి లభింపలేదు.

చౌ॥ దేఖిచరిత యహసో ప్రభుతాఈ ।
సముఝత దేహ దసా బిసరాఈ ॥
ధరని పరేఉఁ ముఖ ఆవ నబాతా ।
త్రాహి త్రాహి ఆరత జన త్రాతా ॥ 1

తా॥ శ్రీరామచంద్రుని గర్భమందా బాలచరిత్రలు జూచితిని. వానిని స్మరించినయెడల నా శరీరము స్వాధీనత దప్పుచున్నది. శరణాగత

రక్షకా ! రక్షింపుము రక్షింపుమని కేకలిడి భూమిపై బడితివి. నోటివెంట మాటలు వచ్చుటలేదు.

చౌ॥ ప్రేమాకుల ప్రభు మోహి బిలోకీ ।
నిజమాయా ప్రభుతా తబ రోకీ ॥
కర సరోజ ప్రభు మమ సిర ధరేఉ ।
దీన దయాల సకల దుఖ హరేఉ ॥ 2

తా॥ శ్రీరామచంద్రుడు నా ప్రేమను వికలతను జూచి మాయా ప్రభావమును దొలగించెను. తన రెండుచేతులు నా నెత్తిపై నుంచెను. దీనజన బాంధవుడగు ఆ ప్రభువు నా దుఃఖమును సంపూర్ణముగ హరించెను.

చౌ॥ కీన్హ రామ మోహి బిగత బిమోహా ।
సేవక సుఖద కృపా సందోహా ॥
ప్రభుతా ప్రథమ బిచారి బిచారీ ।
మన మహఁ హోఇ హరష అతిభారీ ॥

తా॥ తన సేవకులకు సుఖముల గలుగజేయునట్టియు, దయా సముద్రుడగునట్టి ఆ శ్రీరామచంద్ర భగవానుడు నాకావరించిన మోహమును పూర్తిగ దొలగించినాడు. ఆయన మొదట చేసిన లీలలు, ప్రభుతను అనేక పర్యాయములు జ్ఞప్తికి దెచ్చుకొనుటచే నాలోగల దుఃఖము నాశనమైనది.

చౌ॥ భగత బత్సలతా ప్రభుకై దేఖీ ।
ఉపజీ మమ ఉర ప్రీతి బిసేషీ ॥

సజల నయన పులకిత కరజోరీ ।
కీన్హిఉఁ బహు బిధి బినయ బహోరీ ॥

తా॥ శ్రీరామచంద్రునకు భక్తులయందు గల ప్రేమను జూచుటచే నాకు హృదయమందు సంతోషము గలిగెను. నేత్రములు ఆనందబాష్పములచే నిండినవి. శరీరము పులకరించినది. రెండుచేతులు జోడించి వివిధ ప్రకారముల నే పలికిన,

దో॥ సుని స ప్రేమ మమ బానీ దేఖి దీన నిజదాస ।
బచన సుఖద గంభీర మృదు బోలే రమానివాస ॥

తా॥ ప్రేమామృతపు పలుకులు విని, నా దీనత్వమును జూచి, సీతాపతియగు శ్రీరామచంద్రుడు గంభీరములగు సుఖసంతోషములు గలుగ జేయు పలుకులు యిట్లు పలికెను.

దో॥ కాకభుశుండి మాగు బర అతి ప్రసన్న మోహిజాని ।
అనిమాదికసిద్ధి అపర రిధి మోచ్ఛ సకల సుఖ ఖాని ॥ 87

తా॥ ఓ కాకభుశుండీ! ప్రసన్నుడనైతిని. వరమడుగుము. అణిమాది అష్టసిద్ధులును. మోక్షమును, సర్వసుఖములకు నిలయము.

చౌ॥ గ్యాన బిబేక బిరతి బిగ్యానా ।
ముని దుర్లభ గున జే జగ నానా ॥
ఆజు దేఉఁ సబ సంసయ నాహీం ।
మాగు జో తోహి భావ మన మాహీఁ ॥ ।

తా॥ జగమునందు మునిశ్రేష్ఠులకుగూడ దుర్లభమైనట్టి జ్ఞాన, వివేక, వైరాగ్య, విజ్ఞానములు సద్గుణములు నేడు నీవు పొందితివి, యి

యథార్థమైన విషయము సందేహ మిందేమాత్రమును లేదు నీ యిష్ట మొచ్చిన వరః అడుగుము. నెరవేర్చెద మనెను.

చౌ॥ సుని ప్రభు బచన అధిక అనురాగేఉఁ ।
మన అనుమాన కరన తబ లాగేఉ ॥
ప్రభు కహా దేన సకల సుఖ సహీ ।
భగతి ఆపనీ దేన న కహీ ॥ ౪

తా॥ శ్రీరామచంద్రప్రభువు పలికిన పలుకులు విని ఆనందించితిని అప్పుడు నామనస్సునందనుమానము పొడసూపెను. ప్రభువు సర్వసుఖములనిత్తునని చెప్పినాడు. ఇది సత్యము. నాకు భక్తి నిచ్చెదననుమాట చెప్పలేదు.

చౌ॥ భగతి హీన గున సబ సుఖ ఐసే ।
లవన బినా బహు బింజన జైసే ॥
భజన హీన సుఖ కవనే కాజా ।
అస బిచారి బోలేఉఁ ఖగరాజా ॥ ౫

తా॥ ఉప్పులేని ఆహారపదార్థములు రుచించనట్లు సద్గుణములున్నను, సుఖములున్నను, భక్తిలేనిదే రాణించవు. భజనాదులు లేని సుఖము ప్రయోజనము లేదని ఆలోచించి నేనిట్లు పల్కితిని.

చౌ॥ జౌఁ ప్రభు హోఇ ప్రసన్న బర దేహూ ।
మోపర కరహు కృపా అరు నేహూ ॥
మన భావత బర మాగఉఁ స్వామీ ।
తుమ్హ ఉదార ఉర అంతర జామీ ॥ ౬

తా॥ ఓ ప్రభూ ! నీవు ప్రసన్నుడవై వరమును దయచేసితివి. నాతో స్నేహము చేసితివి. ఓ స్వామీ! నాచనస్సు ననుసరించి వరము నడుగుచుంటిని నీకు ఉదారస్వభావము గలదు సర్వజీవుల హృదయముల లోని రహస్యములు దెలిసికొనగలవాడవు.

దో॥ అవిరల భగతి బిసుద్ధ తవ శ్రుతిపురాన జో గావ ।
జేహి ఖోజత జోగీస మునిప్రభు ప్రసాదకోఉ పావ ॥ 84

తా॥ నీయొక్క ప్రగాఢమైన విశుద్ధమైన, నిష్కామమైన భక్తి ప్రభావమును శృతులు, పురాణములు కీర్తించినవి. ఆ దివ్యమగు భక్తినె మునీశ్వరులు, యోగులు వెదుకుచుందురు వారు పొందు భక్తిని మాకు దయతో అనుగ్రహించుము.

దో॥ భగత కల్ప తరుప్రనత హిత కృపాసింధు సుఖ దామ ।
సోఇ నిజ భగతిమోహి ప్రభు దేహుదయాకరిరాము ॥

తా॥ భక్తుల మనోవాంఛితములు నెరవేర్చుటకు కల్పవృక్షము వంటి వాడవు శరణాగతుల రక్షించువాడవు. దయాసాగరుడవు, సుఖము లకు నిలయుడవగు శ్రీరామా! దయయుంచి నాకు నీయందు అనురాగ ముందు భక్తిని ప్రసాదింపుడని ప్రార్థించుచున్నాను.

చౌ॥ ఏవమస్తు కహి రఘుకుల నాయక ।
బోలె బచన పరమ సుఖ దాయక ॥
సును బాయస తైఁ సహజ సయానా ।
కాహే న మాగసి అస వరదానా ॥ 1

తా॥ అట్లే అగుగాక అని పలికి, శ్రీరామచంద్రుడు సుఖమున, ఆనందమును గలుగజేయుచు ఓ కాకమా, నీవు స్వభావసిద్ధముగనే సద్గుణ రాశివి. అట్టి వరములేల నీవడుగుకుందువు?

చౌ॥ సబ సుఖ ఖాని భగతి తైం మాఁగీ।
నహిఁ జగ కోఉ తోహి సమబడభాగీ॥
జో మునికోటి జతన నహిఁ లహహీఁ।
జే జప జోగ అనల తన దహహీఁ॥ 2

తా॥ సర్వసుఖములు గలుగజేయునట్టి భక్తినడిగితివి. నీతో సమానదగు అదృష్టవంతుడీ జగమున లేడు. మహర్షులు జప, తప యోగముల ద్వారా వారివారి శరీరముల మండింపజేతురు. కొన్నికోట్ల ప్రయత్నముల జేసినమా వారు ఈ పరమపదభక్తిని పొందలేరు.

చౌ॥ రీఝెఉఁ దేఖి తోరి చతురాఈ।
మాఁగేహు భగతి మోహి అతి భాఈ॥
సును బిహంగ ప్రసాద అబ మోరేఁ।
సబ సుభ గున బసిహహిఁ ఉర తోరేఁ॥ 3

తా॥ అట్టి భక్తిని నీవడిగితివి. నీచతురతకు నేను ముగ్ధుడనైతిని. నీ నేర్పరితనమునకు నేను సంతోషించితిని. నాయొక్క దివ్యానుగ్రహము వలన సర్వసుఖములు, శుభగుణములు నీహృదయమందు నిలచియుండును.

చౌ॥ భగతి గ్యాన బిగ్యాన బిరాగా।
జోగ చరిత్ర రహస్య బిభాగా॥

జానబ త్రై సబహీం కర భేదా ।
మమ ప్రసాద నహిఁ సాధన ఖేదా ॥ 4

తా॥ భక్తి, జ్ఞానము, విజ్ఞానము, విరాగము, యోగములే నాలీలలు అనే సారహస్యములు ఆమర్మములన్నియు నాదివ్యానుగ్రహముచే నీకు తెలియును. నీవు కష్టపడకయే సర్వమును బొందితివి.

దో॥ మాయా సంభవ భ్రమ సబ అబన బ్యాపిహహిఁ తోహీ।
జానేసు బ్రహ్మ అనాది అజ అగుణ గుణాకర మోహీ ॥

తా॥ మాయచే ఉత్పన్నమైన భ్రమలు నిన్నంటవు. నేననాదివాడను. అగుణుడను, గుణాతీతుడను. దివ్యుడను సర్వగుణములకు నిలయుడను, బ్రహ్మనని తెలిసికొనుము.

దో॥ మోహి భగత ప్రియ సంతత అస బిచారి సును కాగ ।
కాయఁ బచన మనమమ పద కరెసు అచల అనురాగ ॥

తా॥ ఓకాకభుశుండీ। భక్తులనిన నాకు ప్రియము వారు మనోవాక్కాయకర్మల నన్నే నమ్మి అచంచలమగు విశ్వాసముతో నుందురు.

చౌ॥ అబ సును పరమ బిమల మమ బానీ ।
సత్య సుగమ నిగమాది బఖానీ ॥
నిజ సిద్ధాంత సునావ ఉఁ తోహీ ।
సును మన ధరు సబ తజి భజు మోహీ ॥ 1

తా॥ సత్యముద్వారా నన్ను జేరుట సులభమని వేదములలో జెప్పబడిన వాణిని వినుము. నేను నీకు నానిజమగు ఆచరణలు వినుపించు

చున్నాను. వానిని మనస్సున ధారణజేసి సర్వకాలముల నాభజవాది. కొ॥
ములలో నుండుము.

చౌ॥ మమమాయా సంభవ సంసారా ।
జీవ చరాచర బివిధ ప్రకారా ॥
సబ మమ ప్రియ సబ మమ ఉపజాఏ ।
సబతే అధిక మనుజ మోహిఁ భాఏ ॥

తా॥ సర్వ జగత్తులున్నూ నామాయచే సృష్టింపబడినవి. ఈ ప్రపం
మునందనేక రకములగు జీవులు గలవు. అజీవులన్నియు నాచేసృష్టిం
బడినవే అవియనిన నాకు ప్రియము. మానవులయందు దయ అధికము
నుండును.

చౌ॥ తిన్హ మహఁ ద్విజ ద్విజమహఁ శ్రుతిధారీ ।
తిన్హ మహుఁ నిగమ ధరమ అనుసారీ ॥
తిన్హ మహఁ ప్రియ బిరక్త పుని గ్యానీ ।
గ్యానిహుతే అతి ప్రియ బిగ్యానీ ॥

తా॥ మానవులలోకూడ బ్రాహ్మణులు, వారిలోగూడ వేదముల
కంఠస్థం చేసినవారు, వేదశాస్త్రము ప్రకారము నడచుకొనువారు, వైరాగ్య
జీవితము గడుపువారు నాకు మిక్కిలి యిష్టము.

చౌ॥ తిన్హ తేపుని మోహిఁ ప్రియ నిజ దాసా ।
జేహిఁగతి మోరి న దూసరి ఆసా ॥
పుని పుని సత్య కహఉఁ తోహి పాహీఁ ।
మోహి సేవక సమ ప్రియ కోఉ నాహీఁ ॥ 4

చున్నాను. వానిని మనస్సున ధారణజేసి సర్వకాలముల నాథజవాది. కార్యములలో నుండుము.

చౌ॥ మమమాయా సంభవ సంసారా ।
జీవ చరాచర బివిధ ప్రకారా ॥
సబ మమప్రియ సబ మమ ఉపజాఏ ।
సబతే అధిక మనుజమోహి భాఏ ॥ 2

తా॥ సర్వ జగత్తులున్నూ నామాయచే సృష్టింపబడినవి. ఈ ప్రపంచమునందనేక రకములగు జీవులు గలవు. ఆజీవులన్నియు నాచే సృష్టింపబడినవే అవియనిన నాకు ప్రియము. మానవులయందు దయ అధికముగ నుండును.

చౌ॥ తిన్హ మహఁ ద్విజ ద్విజమహఁ శ్రుతిధారీ ।
తిన్హ మహుఁ నిగమ ధరమ అనుసారీ ॥
తిన్హ మహఁప్రియ బిరక్త పుని గ్యానీ ।
గ్యానిహుతే అతప్రియ బిగ్యానీ ॥

తా॥ మానవులలోకూడ బ్రాహ్మణులు, వారిలోగూడ వేదముల కంఠస్థం చేసినవారు, వేదశాస్త్రము ప్రకారము నడచుకొనువారు, వైరాగ్య జీవితము గడుపువారు నాకు మిక్కిలి యిష్టము.

చౌ॥ తిన్హ తేపుని మోహిప్రియ నిజ దాసా ।
జేహిఁగతి మోరి న దూసరి ఆసా ॥
పుని పుని సత్య కహఉఁ తోహి పాహీఁ ।
మోహి సేవక సమ ప్రియ కోఉ నాహీఁ ॥ 4

తా॥ విజ్ఞానులకంటెను దాసులనిన నాకు యిష్టము. వారికి నేనే ఆశ్రయము. వేరొక ఆశ యేమియు నుండదు. నీకు సత్యమైన నా సిద్ధాంతము చెప్పుచున్నాను. నాకు సేవకులకంటె ప్రియులెవ్వరును లేరు.

చౌ॥ భగతి హీన బిరంచి కిన హోఈ ।
సబ జీవహు సమ ప్రియ మోహి సోఈ ॥
భగతి వంత అతి నీచ ఉప్రానీ ।
మోహి ప్రాన ప్రియ అసిమను బానీ ॥ 5

తా॥ భక్తిహీనుడగు బ్రహ్మ ప్రాణులందరివంటివాడె. [భక్తిలేని బ్రహ్మత్వమేల ?] భక్తిమార్గమునందుండు నీచప్రాణులయినను నాకు ప్రాణముతో సమానములని, స్నేహపాత్రులని చెప్పుచున్నాను.

దో॥ సుచి సుశీల సేవక సుమతి ప్రియకహు కాహినలాగ ।
శృతి పురానకహ నీతి అసి సావధాన సును కాగ ॥ 86

తా॥ పవిత్రుడు, శీలవంతుడు, బుద్ధిమంతుడు సర్వజీవుల సమానముగ జూచునని వేదములు, పురాణములు చెప్పుచున్నవి. ఓ కాకభుశుండీ ! శ్రద్ధతో వినుము

చౌ॥ ఏకపితాకే బిపు కుమారా ।
హోహిం పృథక గునసీల అచారా ॥
కోఉ పండిత కోఉ తాపస గ్యాతా ।
కోఉ ధనవంత సూరకో ఉదాతా ॥ 1

తా॥ ఒక తండ్రికి అనేకమంది గుణసంపదలు గలిగిన పుత్రులు గలరు. వారు స్వభావముగనే సత్కర్మాచరణలు సలుపుచుంటిరి. వారిలో

కొందరు పండితులు; తపస్సంపన్నులు, జ్ఞానులు, ధనవంతులు, శూర వీరులు, దానధర్మములు జేయువారు.

చౌ॥ కోఉ సర్వగ్య ధర్మరతకోఈ ।
సబ పర పితహి ప్రీతి సమహోఈ ॥
కోఉ పితు భగత బచనమన కర్మా ।
సపనేహుఁ జాన న దూసర ధర్మా ॥ 2

తా॥ వారిలోనే కొందరు సర్వజ్ఞులైరి కొందరు ధర్మపరాయణు లైరి మనోవాక్కాయ కర్మలద్వారా తండ్రియందే భక్తిని గలిగియుండిరి. స్వప్నములోగూడ వారికి వేరొకమార్గము తెలియదు.

చౌ॥ సోసుత ప్రియపితు ప్రాణ సమానా ।
జద్య పి సో సబభాంతి అయానా ॥
ఏ హిఁభిధి జీవ చరాచర జేతే ।
త్రిజగ దేవ నర అసుర సమేత ॥ 3

తా॥ వారికి తండ్రితో సమానుడను. వారు సర్వవిధముల అజ్ఞానులు. ఇట్లే పశుపక్ష్యాదులలో, దేవతలలో, మానవులలో, రాక్షసులలోను, ఎన్ని ప్రాణులు గలవో, జడములు గలవో

చౌ॥ అఖిల విశ్వ యహ మోర ఉపాయా ।
సబ పర మోహి బరాబరి దాయా ॥
తిన్హ మహఁజో పరిహరి మదమాయా ।
భజై మోహిమన బచ అరుకాయా ॥ 4

తా॥ అవన్నియు నాచే పరిపాలింపబడుచున్నవే. సర్వప్రాణు లందును నాకు దయ గలదు. మదమును, మాయను వదలి మనోవాక్కాయ కర్మలద్వారా నన్ను భజించువారు

దో॥ పురుష నపుంసక నారి వా జీవ చరాచర కోఇ ।
సర్వ భావ భజ కపట తజి మోహి పరమ ప్రియ సోఇ ॥

తా॥ పురుషుడైననూ, నపుంసకుడైననూ, స్త్రీయైననూ చరాచర జీవులైననూ కపటమును వదలి సర్వమును నేనేనని తలచి భజించువారు నాకు ప్రియులు.

సో॥ సత్య కహఉఁ ఖగ తోహి సుచి సేవక మమ ప్రాన ప్రియ ।
అస బిచారి భజు మోహి పరిహరి ఆస భరోస సబ ॥87

తా॥ ఓ గరుడుడా ! నీకు సత్యమును జెప్పుచున్నాను. నిష్కామ సేవకులు నాకు యిష్టము. వారిని ప్రాణముతో సమానముగ ప్రేమింతును. వివిధములగు నాశలు వదలి నన్ను భజింపుము.

చౌ॥ కబహూఁ కాల న వ్యాపిహి తోహీ ।
సుమిరేసు భజేసు నిరంతర మోహీ ॥
ప్రభు వచనామృత సుని న అఘాఉఁ ।
తను పులకిత మన అతి హరషాఉఁ ॥ 1

తా॥ నిన్నెప్పుడు కాలమంటదు. నిరంతరము నన్ను స్మరింపుము. భజించుచుండుము. భగవానుని మాటలకు తృప్తి గలుగలేదు. శరీరము పులకరించినది. సంతోషము గలిగినది.

చౌ॥ సో సుఖ జానఇ మన అరు కానా ।
సహిం రసనా కహిం జాఇ బఖానా ॥
ప్రభు సోభా సుఖ జానహిం నయనా ।
కహ కిమి సకహిం తిన్హహి నహిం బయనా ॥ 2

తా॥ ఆ సుఖము మనస్సునకు చెవులకు తెలియును. నాలుకతో సుఖమునుగూర్చి చెప్పజాలము. ప్రభువు అందము నేత్రములకు దెలియును. అవి నోరు లేకపోవుటవలన చెప్పజాలము.

చౌ॥ బహు బిధి మోహి ప్రబోధి సుఖ దేఈ ।
లగే కరన సిసు కౌతుక తేఈ ॥
సజల నయన కఛు ముఖ కరి రూఖా ।
చితఇ మాతు లాగీ అతి భూఖా ॥ 3

తా॥ నన్ను వివిధప్రకారముల బాగుగ నెఱింగినవాడై సర్వసుఖముల గలుగజేయు నా ప్రభువు బాలలీలలు జేయసాగెను. కన్నులవెంట నీరు నింపుకొని ఆకలిగొన్న చూపులచే తల్లివైపు జూచెను. (బిడ్డ ముఖమునుబట్టి తల్లి దెలిసికొనగలదు.)

చౌ॥ దేఖి మాతు ఆతుర ఉఠి ధాఈ ।
కహి మృదు బచన లిఏ ఉరలాఈ ॥
గోద రాఖి కరావ పయపానా ।
రఘుపతి చరిత లలిత కర గానా ॥ 4

తా॥ ఆమెలేచి కోమలములగు పలుకులు పలుకుచు బాలరాముని హృదయమునకు హత్తుకొని. ఒడిలోనికి తీసికొని పాలివ్వసాగెను. శ్రీరామచంద్రుని పాటలు పాడసాగెను.

సో॥ జేహి సుఖ లాగి పురారి అసుభ బేష కృత సివ సుఖద।
అవధపురీ నరనారి తేహి సుఖ మహాఁ సంతత మగన ॥

తా॥ జీవులకు సర్వసుఖముల గలుగజేయునట్టియు, కళ్యాణ స్వరూపు డగునట్టియు, త్రిపురాసురుని సంహారక ర్తయగు పరమశివుడు అశుభవేష మును ధరించి పొందిన సుఖమును అయోధ్యాపురములో స్త్రీ-పురుషులును పొందిరి.

సో॥ సోఈ సుఖ లవలేస జిన్హ బారక సపనేహుఁ లహేఉ
తే నహిం గనహిం ఖగేస బ్రహ్మ సుఖహి సజ్జన సుమతి॥

తా॥ ఓపక్షిరాజా ! స్వప్నములో ఒకపర్యాయము సుఖమును పొందినప్పటికిని సద్బుద్ధిగల సజ్జనుడు ఎదురుగ బ్రహ్మయుండి సర్వసుఖ ముల గలుగజేయుచున్నను లెక్కింపడు.

చౌ॥ మైం పుని అవధ రహేఉఁ కఛు కాలా।
దేఖేఉఁ బాలబినోద రసాలా॥
రామ ప్రసాద భగతి బర పాయఉఁ।
ప్రభు పద బంది నిజాశ్రమ ఆయఉఁ॥ 1

తా॥ నేను కొంతకాలమువరకు అయోధ్యాపురమందుండి రసవత్తరము లగు శ్రీరామచంద్రుని బాలక్రీడలు జూచితిని. భక్తి గలుగునట్లు వరమును పొందితిని. ఆతని దివ్య చరణములకు నమస్కరించి నేను నాఆశ్రమ మునకువచ్చితిని.

చౌ॥ తబ తే మోహి న బ్యాపీ మాయా।
జబ తే రఘునాయక అపనాయా॥

యహ సబ గుప్త చరిత మైఁ గావా ।
హరి మాయాఁ జిమి మోహి నచావా ॥ 2

తా॥ శ్రీరఘురాముని ఆశ్రయించినప్పటినుండి మాయనన్నంటలేదు. శ్రీహరి మాయ నన్నెట్లుఆడించినది క్లుప్తముగ గుప్తముగ చెప్పితిని,

చౌ॥ నిజ అనుభవ అబ కహిఁఉఁ ఖగేసా ।
బిను హరి భజన న జాహిఁ కలేసా ॥
రామ కృపా బిను సును ఖగరాఈ ।
జాని న జాఇ రామ ప్రభుతాఈ ॥ 3

తా॥ ఓపక్షిరాజా! నేను నీకు నానిజఅనుభవమును జెప్పుచున్నాను. భగవానుని భజింపకుండిన దుఃఖములు నశించవు. పక్షిరాజా! దయతో వినుము. శ్రీరామచంద్రుని దివ్యానుగ్రహము లేకుండిన ఆతని గొప్పతనము తెలియదు.

చౌ॥ జానేఁ బిను న హోఇ పరతీతీ ।
బిను పరతీతి హోఇ నహిఁ ప్రీతీ ॥
ప్రీతి బినా నహిఁ భగతి డిఠాఈ ।
జిమి ఖగపతి జలకై చికనాఈ ॥ 4

తా॥ ప్రభువుగ దెలియుటచే ఆతనిపై విశ్వాసము కుదురలేదు. విశ్వాసములేకుండిన ప్రేమ గలుగదు. నీటిపైన నునుపుతనం నిలువనట్లుగా ప్రేమలేనిదే భక్తి గలుగదు.

సో॥ బిను గుర హోఇ కి గ్యాన కి హోఇ బిరాగ బిను ।
గావహిఁ బేద పురాన సుఖ కి లహిఅ హరి భగతి బిను ॥

తా॥ గురువులేనిదే జ్ఞానమెట్లు గలుగును? వైరాగ్యములేనిదే జ్ఞానము లభించునా? శ్రీహరిని భజించనిదే సుఖ, సంతోషములు గలుగవని వేదపురాణములు చెప్పుచున్నవి.

సో॥ కోఉ బిశ్రామ కి పావ తాత సహజ సంతోష బిను ।
చలై కి జల బిను నావ కోటి జతన పచి పచి మరిఅ॥ 89

తా॥ ఓ గరుడుడా! సంతోషములేనిదే శాంతిలభించునా? కోటి ఉపాయములు బన్నిననూ, తన్నుకొని తన్నుకొని చచ్చిననూ నీరులేనిదే నావనడచునా?

చౌ॥ బిను సంతోష న కామ నసాహీం ।
కామ అఛత సుఖ సపనేహుం నాహీం ॥
రామ భజన బిను మిటహిం కి కామా ।
థల బిహీన తరు కబహుం కి జామా ॥ 1

తా॥ సంతోషములేనిదే కోర్కెలు నశించవు. అవి నశించనిదే స్వప్నములోగూడ సుఖము లభించదు. శ్రీహరిని భజించనిదే కోర్కెలు నశించునా? భూదేవి ఆదరువులేనిదే చెట్లు మొలచునా?

చౌ॥ బిను బిగ్యాన కి సమతా ఆవఇ ।
కోఉ అవకాస కి నభ బిను పావఇ ॥
శ్రద్ధా బినా ధర్మనహిం హోఈ ।
బిను మహిగంధ కి పావఇ కోఈ ॥ 2

తా॥ జ్ఞానవిజ్ఞానము లేకుండిన సమభావమెట్లు గలుగును? ఆకాశము లేకుండిన బోలుగానుండు ప్రదేశమెట్లుండును? శ్రద్ధాభక్తులు లేనిదే ధర్మాచరణలు జేయగలమా? పృధ్వీతత్త్వములేనిదే వాసనలు పొందగలమా?

చౌ॥ బిను తప తేజ కి కర బిస్తారా ।
జల బిను రస కి హోఇ సంసారా ॥
సీ లకి మిల బిను బుధ సేవకాఈ ।
జిమి బిను తెజ న రూపా గోసాఁఈ ॥ 3

తా॥ తపోబలము లేనిదే బ్రహ్మతేజోపుంజములు ఏర్పడునా ? జల తత్త్వములు లేనిదే సంసారసంబంధ రసాస్వాదనమెట్లు గలుగును ? పండితులకు సేవలుజేయకుండిన సదాచారమెట్లు గలుగును ? అగ్నితత్త్వము లేనిదే తేజఃపుంజములెట్లు బయలుదేరును ?

చౌ॥ నిజ సుఖ బిను మనహోఇ కి థీరా ।
పరస కి హోఇ బిహీన సమీరా ॥
కవనిఉ సిద్ధి కి బిను బిస్వాసా ।
బిను హరిభజన న భవ భయ నాసా ॥ 4

తా॥ ఆత్మానందములేనిదే మనస్సు చలించకుండునా ? వాయు సంచలనములేనిదే స్పర్శజ్ఞానము గలుగునా ? సంపూర్ణ విశ్వాసములేనిదే సిద్ధులు గలుగునా ? ఇదేవిధముగా శ్రీహరిని భజింపకుండిన చావు-పుట్టుకల భయము నాశనము గాదుగదా ?

దో॥ బిను బిస్వాస భగతి నహిఁ తేహి బిను ద్రవహిఁ న రాము।
రామకృపా బిను సపనేహుఁ జీవన లహ బిశ్రాము॥ 90

తా॥ విశ్వాసములేకుండిన భక్తి యేర్పడదు. భక్తిలేనిదే శ్రీరాము డనుగ్రహింపడు. అతని అనుగ్రహములేనిదే జీవులకు స్వప్నములోగూడ శాంతి లభింపదు.

దో॥ అస బిచారి మతిధీర తజి కుతర్క సంసయసకల ।
భజహు రామ రఘుబీర కరునాకర సుందర సుఖద॥ 90

తా॥ సర్వశ్రేష్ఠుడా! ధీశాలివగు గరుడుడా! ఇది దెలిసికొని కుతర్కాలోచనలు విడచి సందేహములువదలి కరుణాసముద్రుడు, సుందరుడు, సుఖములుగలుగజేయు వాడగునట్టి శ్రీరామచంద్ర మహారాజును భజింపుము.

చౌ॥ నిజమతి సరిస నాథ మైఁ గాఈ ।
ప్రభు ప్రతాప మహిమా ఖగరాఈ ॥
కహేఉఁ న కఛు కరి జుగుతి బిసేషీ ।
యహ సబ మైఁ నిజ నయనన్హి దేఖీ ॥ 1

తా॥ ఓ పక్షిరాజా! ఓ ప్రభూ! నా బుద్ధిననుసరించి శ్రీరామచంద్ర ప్రభువు గుణముల ప్రతాపమును, మహిమలను కీర్తించితిని. ఈవిషయము లన్నియు యుక్తితో నేర్పుగపెంచి చెప్పినవిగావు. స్వయముగ నేను జూచి చెప్పినవే.

చౌ॥ మహిమా నామరూప గునగాథా ।
సకల అమిత అనంత రఘునాథా ।
నిజ నిజమతి మునిహరి గున గావహిఁ ।
నిగమ సేష సివ పార న పావహిఁ ॥ 2

తా॥ శ్రీరామచంద్రమహారాజు గుణములు, మహిమలు, నామము, రూపము, దివ్యచరిత్రలు అనంతముగానున్నవి. శ్రీరామచంద్రుడు స్వయముగ అనంతుడు. ఋషిశ్రేష్ఠులు వారివారి బుద్ధిననుసరించి శ్రీహరిగుణములు కీర్తించిరి. చతుర్వేదములు, ఆనంతశేషుడును, శివమహారాజుగూడ వారి గొప్పదనమును పూర్తిగ వర్ణించలేకుండిరి.

చౌ॥ తుమ్హహి ఆది ఖగ మసక ప్రజంతా ।
నభ ఉడాహిఁ నహిఁ పావహిఁ అంతా ॥
తిమి రఘుపతి మహిమా అవగాహా ।
తాత కబహుఁ కోఉఁ పావకి థాహా ॥ 3

తా॥ నీవు మొదలు క్రిమి కీటకాదులవరకు, చిన్న-పెద్ద ప్రాణులు ఆకాశమందెగురును. ఆకాశముయొక్క అంతమును కనుగొనలేకుండెను, యిదేవిధముగ ఓ గరుడుడా శ్రీరామచంద్రుని మహిమలు అంతులేకుండగ ఉన్నవి. యెవరైనా ఎప్పుడైనా కనుగొనగలరా? అదిసాధ్యమా?

చౌ॥ రాము కామ సతకోటి సుభగతన ।
దుర్గాకోటి అమిత అరిమర్దన ॥
సక్రకోటి సత సరిస బిలాసా ।
నబ సతకోటి అమిత అవకాసా ॥ 4

తా॥ శ్రీరాముడు అందమున కోట్లకొలది మన్మధులమించును. ఆదీన జనబాంధవుడు అనంతకోటి దుర్గలతో సమానముగ శత్రువుల నాశనము జేయును. కోట్లకొలది యింద్రులకంటె విలాసము ఐశ్వర్యముగలవాడు. లెక్కకు మిక్కుటమగు ఆకాశములు శ్రీరామచంద్రునియందు గలవు.

దో॥ మరుతకోటి సత బిపుల బల రవిసతకోటి ప్రకాస ।
ససి సతకోటి సుసీతల సమన సకల భవ త్రాస ॥ 91

తా॥ కోట్లకొలది వాయుదేవులతో బలమునసమానుడు. కోట్లకొలది సూర్యులతేజస్సుతో సమానమగు కాంతిగలవాడు। లెక్కకు మిక్కుటమగు చంద్రులతో సమానమగు చల్లదనముగలవాడు. సంసార సముద్రభయమును నాశనము జేయువాడు.

దో॥ కాల కోటి సత సరిస అతి దుస్తర దుర్గ దుర్గంత ।
ధూమకేతు సతకోటి సమ దురాధరష భగవంత ॥ 91

తా॥ నూరుకోట్ల యములతో సమానుడు. దుస్తరమైనవాడు దుర్గముడు దురంతుడు. జయించుటకు వీలులేనివాడు. శ్రీహరి నూఱుకోట్ల ధూమకేతువులను మించినవాడు. అత్యంత బలసంపన్నుడునై యున్నాడు.

చౌ॥ ప్రభు అగాధ సతకోటి పతాలా ।
సమన కోటి సత సరిస కరాలా ॥
తీరథ అమితకోటి సమపావన ।
నామ అఖిల అఘ పూగ నసావన ॥ 1

తా॥ ఆప్రభువు నూఱుకోట్ల పాతాళములతో సమానమైన లోతు గలవాడు నూఱుకోట్ల యములతో సమానమైన భయమును గొలుపువాడు అనంతకోట్ల తీర్థములతో సమానుడున్ను, పవిత్రతను గలుగజేయువాడు ఆతని నామము పాపసమూహ రాసులనాశనము జేయును.

చౌ॥ హిమగిరి కోటి అచల రఘుబీరా ।
సింధుకోటి సత సమ గంభీరా ॥
కామధేను సతకోటి సమానా ।
సకల కామదాయక భగవానా ॥

తా॥ శ్రీరఘురాముడు కోట్లకొలది హిమాలయ పర్వతములతో సమానము అచలమైన ధీరుడు కోట్లకొలది సముద్రములతో సమానమైన గంభీరము గలవాడు నూఱు కోట్లమంది మన్మథులతో సమానుడు సర్వ విధములగు కోర్కెలను నెరవేర్చువాడు.

చౌ॥ సారదకోటి అమిత చతురాఈ।
బిధి సతకోటి సృష్టి నిపునాఈ॥
బిష్ణుకోటి సతసమ పాలనా కర్తా।
రుద్రకోటి సత సమ సంహర్తా॥ ౩

తా॥ అనంతకోట్ల సరస్వతులకంటెను చతురతగలవాడు నూఱు కోట్ల బ్రహ్మలకంటెను సృష్టిరచనా నిర్మాణములందు నిపుణతగలవాడు. నూఱుకోట్ల విష్ణువులతో సమానముగ పాలనచేయువాడు. కోట్లకొలది రుద్రులతో సమానముగ సంహారము చేయువాడు.

చౌ॥ ధనకోటి సత సమ ధనవానా।
మాయాకోటి ప్రపంచ నిధానా॥
భార ధరన సతకోటి అహీసా।
నిరవధి నిరూపమ ప్రభు జగదీసా।

తా॥ నూఱుకోట్ల కుబేరులతో ధనమున సమానుడు. కోట్లకొలది మాయలతో సమానముగ సృష్టిజేయుటలో నిపుణుడు. భూభారమును వహించు అనంతకోట్ల శేషులతో సమానుడు. ఆ శ్రీరామచంద్ర భగవానుడు జగదీశ్వరప్రభువు. ఉపమారహితుడు. హద్దులు లేనివాడు.

ఛం. నిరుపమ న ఉపమా ఆన రామ
సమాన రామనిగమ కహై।
జిమికోటి సత ఖద్యోత సమ రవి
కహత అతి లఘుతా లహై।

ఏహిం భాంతి నిజనిజ మతి బిలాస
మునీస హరిహి బఖానహీం ।
ప్రభు భావ గాహక అతికృపాల
స ప్రేమ సుని సుఖమానహీం ॥

తా॥ శ్రీరామచంద్రమహారాజు ఉపమారహితుడు ఆతనిని వర్ణించవలెనన్న తుచ్ఛమగు ఉపమానములు జాలవు. శ్రీరామునితో సమానుడు శ్రీరాముడేనని వేదములు జెప్పినవి. కోట్లకొలది మిణుగురు పురుగులైనను ఒక్క సూర్యునితో సమానము గానట్లు నూరుకోట్లమంది సూర్యులైననూ ఒక్క శ్రీరామచంద్రునితో సమానముగారని ముని శ్రేష్ఠులు, ఋషులు, భక్తులు వారి-వారి బుద్ధి ననుసరించి శ్రీహరిని వర్ణించిరి కాని ప్రభువగు శ్రీరామచంద్రుడు భక్తుల భావముల గ్రహించి అనుగ్రహించును. కీర్తనలను విని ప్రేమతో సుఖముల ప్రసాదించును.

దో॥ రామ అమిత గునసాగర థాహ కి పావఇ కోఇ ।
సంతన్హ సన జస కఛు సునేఉఁ తుమ్హహి సునాయఉఁ సోఇ॥

తా॥ శ్రీరామచంద్రు డపారమగు గుణములకు నిలయుడు ఆతని గుణములను దెలిసికొనిన వాడింతవరకు లేడు మహాత్ములచే నే విన్న విషయములు నీకు జెప్పితిని.

సో॥ భావవస్య భగవాన సుఖనిధాన కరునా భవన ।
తజి మమతా మదమాన భజిఅ సదా సీతారవన ॥ 92

తా॥ సుఖనిలయుడు, కరుణాధాముడు, శ్రీభగవానుడు, భావమునకు, ప్రేమకువశుడు మమతను, మదమును వదలి శ్రీరామచంద్రుని భజింపవలెను.

చౌ॥ సునిభుశుండి కే బచన సుహాఏ ।
హరషిత ఖగపతి పంఖ ఫులాఏ ॥
నయన నీర మన అతి హరషానా ।
శ్రీరఘుపతి ప్రతాప ఉర ఆనా ॥ 1

తా॥ శ్రీకాకభుశుండి మహర్షి వారి పలుకుల పక్షిరాజగు గరుడుడు విని సంతోషించినవాడై రెక్కలను విప్పారునట్లు చేసెను. వారి నేత్రముల వెంట ఆనందబాష్పములు రాలసాగెను. మనస్సు ప్రసన్నతతో నుండెను. ఆ శ్రీరామచంద్రునియొక్క ప్రతాపమును హృదయమందు స్మరించెను.

చౌ॥ పాఛిలి మోహా సముఝి పఛితానా ।
బ్రహ్మ అనాది మనుజ కరిమానా ॥
పుని పుని కాగ చరన సిరు నావా ।
జాని రామ సమ ప్రేమ బఢావా ॥ 2

తా॥ వెనుకటి మోహ, భ్రమల గుర్తుకుదెచ్చుకొని పశ్చాత్తాపము పడసాగెను. నే ననాదిబ్రహ్మను మానవమాత్రునిగ మాత్రమే యెరుంగుదును. గరుడుడు మాటిమాటికి కాకభుశుండి పాదములపై బడసాగెను. ఆతనిని శ్రీరామచంద్రునితో సమానమని యెరింగి ఉప్పొంగిన ప్రేమగలవాడై యుండెను.

చౌ॥ గురు బిను భవనిధి తరఇ న కోఈ ।
జౌ బిరంచి సంకర సమ హోఈ ॥
సంసయ సర్ప గ్రసేఉ మోహి తాతా ।
దుఖద లహరి కుతర్క బహు బ్రాతా ॥ 3

తా॥ గురువులేనిదే సంసారసముద్రమునుండి తరించలేము. ఆతడు శివ, బ్రహ్మతో సమానమేలగాడు? గరుడుడిట్లుపలికెను. స్నేహితుడా! సందేహరూపమనెడు సర్పము కాటునుండి తప్పించితివి. కుతర్కరూపము లనెడు దుఃఖముల గలుగజేయు అలలనుండి రక్షింపబడితిని.

చౌ॥ తవ సరూప గారుఢి రఘునాయక ।
మోహి జిఆయఉ జన సుఖదాయక ॥
తవ ప్రసాద మమ మోహా నసానా ।
రామరహస్య అనూపమ జానా ॥ 4

తా॥ భక్తులకు సుఖములగలుగజేయు శ్రీరాముడు నాకు కీర్తిని గలుగజేసెను. నీయొక్క అనుగ్రహముచే నాలోగల మోహము నశించినది. శ్రీరామచంద్రుని రహస్యముల దెలిసికొన గలిగితిని.

దో॥ తాహి ప్రసంసి బిబిధి బిధి సీసనాఇ కరజోరి ।
బిచన బినీత స్ప్రేమ మృదు బోలెఉ గరుడబహోరి ॥

తా॥ కాకభుశుండి మహర్షిని వివిధప్రకారముల కీర్తించి తలవంచి రెండుచేతులతో నమస్కరించుచు, గరుడుడు వినమ్రుడై కోమలములగు పలుకులు యిట్లు పలుకసాగెను.

దో॥ ప్రభు అపనే అబిబేక తేఁసూఝఉఁ స్వామీతోహి ।
కృపాసింధు సాదర కహహు జానిదాస నిజమోహి ॥93

తా॥ ఓ ప్రభూ! దీనజనబాంధవా, నా అవివేకకారణమువలన మిమ్ముల నడుగుచున్నాను. నేను నీ నిజభక్తుడనని దెలిసికొని ప్రేమతో నా ప్రశ్నలకు సమాధానము జెప్ప వేడుచున్నాను.

చౌ॥ తుమ్హ సర్వగ్య తగ్య తమ పారా ।
సుమతి సుసీల సరల ఆచారా ॥
గ్యాన బిరతి బిగ్యాన నివాసా ।
రఘునాయక కే తుమ్హ ప్రియదాసా ॥

తా॥ నీకు సర్వము దెలియును. తత్త్వసారము నెరింగినవాడవు మాయారహితుడవు ఉత్తమ బుద్ధిమంతుడవు. యుక్తుల నెరింగినవాడవు. సత్శీలవంతుడవు. సదాచారవంతుడవు. జ్ఞాననిధివి. వైరాగ్యసంపన్నుడవు. విజ్ఞానఖనివి. శ్రీరఘురామునకు ప్రియదాసుడవు

చౌ॥ కారన కవన దేహ యహ పాఈ ।
తాత సకల మోహి కహహు బుఝాఈ ॥
రామ చరిత సర సుందర స్వామీ ।
పాయహు కహాఁ కహహు నభగామీ ॥

తా॥ నీ కీ కాకి శరీర మే కారణమువలన వచ్చినది? దయతో నాకు దెలుప ప్రార్థన. భక్తశ్రేష్ఠా! ఆకాశగామీ! సుందరమగునట్టి దివ్యాతిదివ్యమైన శ్రీరామచరిత మానసకథ నీకెట్లు లభించినదో తెలియ జెప్పుము

చౌ॥ నాథ సునామ్హైఁ అససివ పాహీఁ ।
మహా ప్రలయహుఁ నాస తవ నాహీఁ ॥
ముధా బచన నహీఁ ఈశ్వర కహాఈ ।
సోఉ మోరేఁ మన సంసయ అహాఈ ॥

తా॥ ప్రభూ! నీకు మహాప్రళయములోగూడ మరణమందదని, నేను పరమశివునిద్వారా వింటిని. ఈశ్వరుడెప్పుడును అసత్యపు పలుకులు పలుకడు. అయినను నామనస్సున సందేహము గలుగుచున్నది.

చౌ॥ అగ జగజీవ నాగనర దేవా ।
నాథ సకల జగు కాల కలేవా ॥
అండ కటాహ అమిత లయ కారీ ।
కాలు సదా దురతిక్రమ భారీ ॥ 4

తా॥ ప్రభూ! నాగులు, మానవులు, దేవతలు మొదలుగాగల చరాచరజీవులు, దృశ్యప్రపంచమున కాలమునకు వశమైన కళేబరములే. అసంఖ్యాకములగు జీవులను నాశనము జేయునట్టి కాలము అనివార్యమైనదే.

సో॥ తుమ్హహి న వ్యాపత కాల అతి కరాల కారన కవన ।
మోహి సో కహహు కృపాల గ్యాన ప్రభావ కి జోగబల ॥

తా॥ అత్యంత భయంకరమైన కాలముగూడ నిన్నంటదు. దాని ప్రభావము నీపై ప్రసరించదు. దీనికి కారణమేమిటి? దయాసాగరా! దాని ప్రభావము జ్ఞానమునకు సంబంధించినదా? యోగబలమునకు సంబంధించినదా? నాకు దెలియజెప్ప వేడుచున్నాను

దో॥ ప్రభు తవ ఆశ్రమ ఆఏఁ మోర మోహ భ్రమ భాగ ।
కారన కవన సో నాథ సబ కహహు సహిత అనురాగ ॥

తా॥ ప్రభూ! నీ ఆశ్రమమునకు వచ్చుటచేత నాలోగల మోహము, భ్రమ నశించినది. దీనికి కారణమేమిటి? నా కదంతయు ప్రేమతో దెలియజెప్ప ప్రార్థించుచున్నాను

చౌ॥ గరుఢ గిరా సుని హరషేఉ కాగా ।
బోలేఉ ఉమా పరమ అనురాగా ॥
ధన్య ధన్య తవమతి ఉరగారీ ।
ప్రశ్న తుమ్హారి మోహి అతి ప్యారీ ॥ 1

తా॥ ఓ ఉమా ! గరుడుని పలుకులు విని కాకభుశుండి ఆనందించి ప్రేమతో చెప్పసాగెను. ఓ సర్పాంతకా! నీ బుద్ధి మిక్కిలి ధన్యమైనది ధన్యమైనది నీ ప్రశ్న నా కానందమును, ప్రేమను గలిగించుచున్నది.

చౌ॥ సుని తవ ప్రశ్న సప్రేమ సుహాఈ ।
బహుత జన్మకై సుధి మోహి ఆఈ ॥
సబ నిజ కథా కహఉఁ మైఁ గాఈ ।
తాత సునహు సాదర మన లాఈ ॥ 2

తా॥ నీయొక్క ప్రశ్న సుందరము ప్రేమతో గూడినట్టిది. నా కనేక జన్మలవరకు గుర్తుండును. నేనా కథను విస్తరముగ చెప్పెదను ప్రేమతో జాగరూకుడవై తదేకదృష్టితో వినుము.

చౌ॥ జప తప మఖ సమ దమ వ్రత దానా ।
బిరతి బిబేక జోగ బిగ్యానా ॥
సబ కర ఫల రఘుపతి పద ప్రేమా ।
తేహి బిను కోఉ న పావఇ ఛేమా ॥ 3

తా॥ అనేకవిధములగు జపములు, తపములు, యజ్ఞములు మనో నిగ్రహము, యింద్రియ జయము, వ్రతములు, దానములు, వైరాగ్యము, వివేకము, యోగము విజ్ఞానము మొదలుగాగల వాని ఫలితములన్నియు

శ్రీరామచంద్రునియందు భక్తిగలిగి యుండుటయే. ఇదిదప్ప ఎవరికిని కల్యాణగుణములు గలుగవు.

చౌ॥ ఏహిం తన రామ భగతి మైం పాఈ।
తాతే మోహిం మమతా అధికాఈ॥
జేహి తె కఛు నిజ స్వారథ హోఈ।
తేహి పర మమతా కర సబ కోఈ॥

తా॥ నేనీ శరీరముద్వారానే శ్రీరామచంద్ర ప్రభువులవారి దివ్యమగు భక్తిని బొందితిని నాకీ కాకిశరీరమునిన యిష్టము. దీనిలో స్వార్థము గలదు. దీనినందరును ప్రేమించుచున్నారు.

సో॥ పన్నగారి అసినీతి శ్రుతి సమ్మత సజ్జనకహహీం।
అతినీచహు సన ప్రీతి కరిఅ జాని నిజపరమ హిత॥ 95

తా॥ ఓ గరుడుడా! అత్యంత నీచునిగూడ ప్రేమించుమని వేదములు సజ్జనులు, మహాత్ములు చెప్పుచున్నారు.

సో॥ పట కీట తేం హోఇ తేహి తేంపాటంబర రుచిర।
కృమికాలఇ సబుకోఇ పరమ అపావన ప్రానసమ॥ 95

తా॥ పురుగువలన పట్టు ఏర్పడుతుంది, దానివలన పట్టువస్త్రము లేర్పడుతాయి. ఈకారణంగా ఆ అపవిత్రమగు పురుగునుగూడా అందరూ ప్రాణములతో సమానంగా పెంచుతారు

చౌ॥ స్వారథ సాంచ జీవ కహుం ఏహా।
మన క్రమ వచన రామపద నేహా॥

సోఇ పావన సోఇ సుభగ శరీరా ।
జో తనుపాఇ భజిఅ రఘు బీరా ॥ 1

తా॥ మనోవాక్కాయ కర్మలద్వారా జీవులెల్లరకును శ్రీరామ చంద్రుని దివ్య చరణారవిందములపై భక్తికలిగి యుండుటయే నిజమగు ధర్మము. ఆ శరీరమే పవిత్రము సుందరమునైనట్టిది. అట్టి శరీరమును పొందినందులకు శ్రీరాముని భజించుటయే ఫలము.

చౌ॥ రామ విముఖ లహి బిధి సమ దేహీ ।
కవికోబిద న ప్రసంసహిఁ తేహీ ॥
రామభగతి ఏహిఁ తన ఉర జామీ ।
తాతే మోహిఁ పరమ ప్రియస్వామీ ॥ 2

తా॥ శ్రీరామ విముఖులు దివ్యమగు బ్రహ్మవంటి శరీరమును పొందినను కవులు, పండితులు కీర్తింపరు. ఈ శరీరముద్వారానే నాకు శ్రీరామభక్తి ప్రాప్తించినది కావుననే నాకీ శరీరమనిన మిక్కిలి యిష్టము.

చౌ॥ తజఉఁ న తన నిజ ఇచ్ఛా మరనా ।
తన బిను బేద భజన నహిఁ బరనా ॥
ప్రథమ మోహఁ మోహిఁ బహుత బిగోవా ।
రామ బిముఖ సుఖ కబహుఁ న సోవా ॥ 3

తా॥ నా ఇచ్ఛననుసరించియే నాకు మరణముండును. నేనీ శరీరమును వదలను వేదములలో చెప్పబడిన ప్రకారము శరీరములేనియెడల భగవానుని భజించుట జరుగదుగదా! మొదట మోహవశుడనై దుర్దశ

పొల్తైతిని. శ్రీరామ విముఖుడనగుటచే ఏసుఖ సంతోషములనూ పొంద లేకుంటిని.

చౌ॥ నానా జన్మ కర్మ పుని నానా ।
కిఎ జోగ జప తప మఖ దానా ॥
కవన జోని జన మేఉఁ తహఁ నాహీఁ ।
మై ఖగేస భ్రమి భ్రమి జగ మాహీఁ ॥ 4

తా॥ నే ననేక జన్మలలో, వివిధ విధముల యోగమును, జప, తప యజ్ఞముల, దానధర్మాది కార్యముల జేసియుంటిని. జగమందెన్ని స్త్రీజాతులు గలవో మాటిమాటికి వారి గర్భములందు జన్మింపకుంటిని.

చౌ॥ దేఖేఉఁ కరి సబ కరమ గోసాఈ ।
సుఖీ న భయఉఁ అబహిఁ కీ నాఈ ॥
సుధి మోహి నాథ జనమ బహు కేరీ ।
సివ ప్రసాద మతి మోహఁ న ఘేరీ ॥

తా॥ ఋషిశ్రేష్ఠా! నే ననేక కార్యము లనేకజన్మలలో జేసితిని. కాని ఈ జన్మలో గలిగిన సుఖ-సంతోషములు ఏ జన్మలోను గలుగ లేదు. స్నేహితుడా! శివుని దివ్యానుగ్రహముచే నా కనేక జన్మలలోని విషయములు గుర్తున్నవి గనుకనే ఘోరమగు మోహము నా బుద్ధికి ఆవరించలేదు.

దో॥ ప్రథమ జన్మకే చరిత అబ కహఉఁ సునహు బిహగేస
సుని ప్రభు పద రతి ఉపజఇ జాతేఁ మిటహిఁ కలేస ॥ 96

తా॥ ఓ గరుడుడా! వినుము. నేను మొదట నాకు గల్గిన జన్మను గురించి చెప్పుచున్నాను. అది నీవు వినుటచే శ్రీరాముని దివ్యచరణము లందు భక్తి, ప్రేమ గలుగును. నీకున్న దుఃఖములు నశించును.

దో॥ పూరబ కల్ప ఎక ప్రభుజుగ కలిజుగ మలమూల।
నర అరునారి అధర్మరత సకల నిగమ ప్రతికూల॥ 96

తా॥ ఓ ప్రభూ! పూర్వమందొక కల్పమందు ఘోరమగు పాప భూయిష్టమైన కలియుగము గలదు. ఆ యుగమందు జన్మించిన స్త్రీ-పురుష లెల్లరు ఘోరమగు పాపపరాయణులును, వేదవిరుద్ధాచారములుగల వారునై యుండిరి.

చౌ॥ జేహిఁ కలియుగ కోసలపురజాఈ।
జనమత భయఉఁ సూద్ర తను పాఈ॥
సివసేవక మనక్రమ అరుబానీ।
ఆన దేవ నిందక అభిమానీ॥ 1

తా॥ నేనా యుగమందు అయోధ్యాపురములో శూద్రజన్మను బొందితిని. మనోవాక్కాయ కర్మలద్వారా పరమశివుని భక్తుడను. ఇతర దేవతలను నిందించువాడను. అభిమానముతో నిందినవాడనై యుండెడి వాడను.

చౌ॥ ధనమదమత్త పరమ బాచాలా।
ఉగ్రబుద్ధి ఉరదంభ బిసాలా॥
జదపి రహేఉఁ రఘుపతిరజధానీ।
తదపి నకఛు మహిమా తబ జానీ॥ 2

తా॥ నాకు ధనమదము గలదు. శాస్త్రవిరోధిని, కోపిష్ఠిని. నా హృదయమున దంభము గలదు. శ్రీరాముడు జన్మించిన అయోధ్యాపుర మందు దిరుగుచున్నను నా కా సమయములో శ్రీవారి ప్రభావ మేమ్మాత్ర మును దెలియలేదు.

చౌ॥ అబజానా మైం అవధ ప్రభావా।
నిగమాగమ పురాన అసగావా॥
కవనేహుం జన్మ అవధ బస జోఈ।
రామ పరాయన సోపరి హోఈ॥ 3

తా॥ నేనిప్పు డయోధ్యాప్రభావము నెరిగితిని. ఏదో నొక కాల ములో, నేదో యొక జన్మమందు అయోధ్యాపురములో జన్మించి, నివాస ముండిన శ్రీరామభక్తులయ్యేదరని వేదములలో, పురాణములలో కీర్తించ బడి యుండెను.

చౌ॥ అవధ ప్రభావ జాన తబ ప్రానీ।
జబ ఉర బసహిం రాము ధను పానీ॥
సో కలికాల కఠిన ఉరగారీ।
పాప పరాయన సబ నర నారీ॥ 4

తా॥ అయోధ్యాపురమందు గల సకల చరాచరజీవుల హృదయము లలో ధనుర్బాణధారియగు శ్రీరామచంద్రుడు నివసించును. ఓ గరుడుడా! ఈ కలికాలము మిక్కిలి కఠినమైనది. స్త్రీపురుషులెల్లరు పాపపరాయణు లుగ నుందురు

దో॥ కలిమల గ్రసే ధర్మ సబ లుప్త భఏ సద్గ్రంథ।
దంభిన్హ నిజమతి కల్పి కరి ప్రగట కిఏ బహు పంథ॥

తా॥ కలియుగమందు పాపములన్నియు ధర్మమునందు వ్యాపించి యుండెను. పురాణేతిహాసములు దాగినవి, దాంభికులు వారి – వారి బుద్ధి బలములద్వారా ప్రకటించిన కార్యములే జరుగుచుండును.

దో॥ భఏ లోగసబ మోహా బస లోభ గ్రసే సుభ కర్మ ।
సును హరి జాన గ్యాన నిధి కహఉఁ కఛు కర్మ కలి ధర్మ॥

తా॥ ప్రజలెల్లరు మోహమునకు వశులైరి. లోభవశమున సత్కార్మలు చేయరు ఓ జ్ఞాననిధీ! శ్రీహరివాహనుడా! గరుడుడా! కలియుగ పద్ధతుల జెప్పుచున్నాను జాగరూకుడవై వినుము.

చౌ॥ బరన ధర్మ నహిఁ ఆశ్రమ చారీ ।
శ్రుతి బిరోధ రత సబ నర నారీ ॥
ద్విజ శృతి బంచక భూప ప్రజాసన ।
కోఉ నహిఁ మాన నిగమ అనుసాసన ॥ 1

తా॥ కలియుగమందు చతుర్వర్ణాశ్రమ ధర్మములుండవు. స్త్రీ పురుషులెల్లరు వేదవిరుద్ధాచారములు నలుపుచుందురు. బ్రాహ్మణులెల్లరు వేదముల నమ్ముకొందురు. రాజులెల్లరు ప్రజల బాధించుచుందురు. వేదములలో జెప్పినట్లెవరును పాటింపరు.

చౌ॥ మారగ సోఇ జా కహుఁ జోఇ భావా ।
పండిత సోఇ జో గాల బజావా ॥
మిథ్యారంభ దంభ రత జోఈ ।
తాకహుఁ సంత కహఇ సబ కోఈ ॥ 2

తా॥ ఎవరి కేది మంచిదిగ దోచునో అదే మార్గమై యుండును. ఏకరువుపెట్టి వాగుచుండెడివాడే పండితుడు. ఎవ డసత్యము పలుకునో, డంబాచారముగ నుండునో, అట్టివారెల్లరును సత్పురుషులుగ నుందురు.

చౌ॥ సో ఇ స యాన జో పర ధన హారీ ।
జో కర దంభ సో బడ ఆచారీ ॥
జో కహ ఝూ ఠ మసఖరీ జానా ।
కలి యుగ సోఇ గు నవంత బఖానా ॥ 3

తా॥ ఇతరుల ధనమును మోసముజేసి, సంపాదించువాడు నేర్పరుడును బుద్ధిమంతుడునై యుండును ఎవడు దంభాచారములు గలిగియుండునో వాడే ఆచారవంతుడుగ నుండును. అసత్యము లెక్కువగ పలుకువాడు, నవ్వులతో ఎగతాళి చేయుచుండువాడు గుణవంతుడని చెప్పబడెను.

చౌ॥ నిరా చార జో శ్రుతి పథ త్యాగీ ।
కలియుగ సోఇ గ్యానీ సో బిరాగీ ॥
జాకెఁ నఖ అరు జటా బిసాలా ।
సోఇ తాపస ప్రసిద్ధ కలి కాలా ॥ 4

తా॥ ఎవరు ఆచారహీనులై యున్నారో, వేదమార్గము నొదలి యున్నారో అట్టివారే కలియుగమందు జ్ఞానవృద్ధులును వైరాగ్యవంతులునై యుందురు.

దో॥ అశుభ బేష భూషన ధరేఁ భచ్ఛా భచ్ఛ జే ఖాహిఁ ।
తేఇ జోగీ తే ఇ సిద్ధ నర పూజ్య తే కలిజుగమాహిఁ ॥

తా॥ ఎవరు అశుభవేషధారులో, అమంగళభూషణధారులో, తిన రాని పదార్థములు తినుచుందురో అట్టి యోగులే సిద్ధమహాత్ములును, అట్టి వారే కలియుగమందు ప్రసిద్ధమగు తపస్సంపన్నులునునై యుందురు.

సో॥ జో అపకారీ చార తిన్హ కర గౌరవ మాన్య తేఇ ।
మన క్రమ బచన లబార తేఇ బక్తా కలికాల మహుం ॥

తా॥ ఆచారవంతులకు అపకారము జేయువారు గౌరవసంపన్నులు. వారే సన్మానింపబడుదురు. మనోవాక్కాయ కర్మలద్వారా ఎవరు అసత్యపు పలుకులు పలుకునో అట్టివారే ఈ కలియుగమందు నేర్పరులని తెలిసి కొనుము.

చౌ॥ నారి బిబస నర సకల గోసాఈ ।
నాచహిం నట మర్కట కీ నాఈ ॥
సూద్ర ద్విజన్హ ఉపదేసహిం గ్యానా ।
మేలి జనేఉ లేహిం కుదానా ॥ 1

తా॥ ఓ పక్షిరాజా! పురుషులెల్లరు స్త్రీలకు స్వాధీనులు. కోతుల వాని చేతిలో కోతి ఆడునట్లాడుదురు. బ్రాహ్మణులకు శూద్రులు జ్ఞానోప దేశములు జేయుదురు. చేయరాని వస్తువుల పదార్థముల మేలినగు దానము లుగ భావించి చేయుచుందురు.

చౌ॥ సబ నర కామ లోభ రత క్రోధీ ।
దేవ బిప్ర శ్రుతి సంత బిరోధీ ॥
గున మందిర సుందర పతి త్యాగీ ।
భజహిం నారి పర పురుష అభాగీ ॥ 2

తా॥ పురుషులెల్లరు కామమునకు వశులై క్రోధముగ ప్రవర్తించుచుందురు దేవతలకు, బ్రాహ్మణులకు, భక్తులకు, వేదాచారములకు విరోధముగ ప్రవర్తించెదరు. దురదృష్టవంతులగు స్త్రీలు తమతమ భర్తలను వదలి పరపురుషుల నాశ్రయించి వారికి సేవలు జేయుదురు.

చౌ॥ సౌభాగినీ బిభూషన హీనా।
బిధవన్హ కే సింగార నవీనా॥
గురు సిష బధిర అంధ కా లేఖా।
ఏక న సున ఇ ఏక నహిం దేఖా॥ 3

తా॥ ముత్తైదువలగు స్త్రీలు ఆభరణములు వదలెదరు విధవలగు స్త్రీలు నూతన ఆభరణములు ధరించెదరు. శిష్యులు గురువులకు పాపముల నంటగట్టెదరు. వారి ఉపదేశములు పాటింపరు. అనేకమంది గురువుల గలిగియుండుటచే దివ్యజ్ఞానదృష్టి గలుగదు.

చౌ॥ హరఇ సిష్య ధన సోకన హర ఈ।
సో గురు ఘోర నరక మహుం పరఈ॥
మాతు పితా బాల కన్హి బో లావహిం।
ఉదర భరై సో ఇ ధర్మ సిఖా వహిం॥ 4

తా॥ గురువులు శిష్యుల ధనమును హరించెదరు. వారి దుఃఖముల బోగొట్టరు వారు ఘోరాతిఘోరమగు నరకమున బడెదరు. తల్లిదండ్రులు వారి వారి బిడ్డలకు అట్టి ధర్మములే చెప్పుదురు. అ వచ్చిన ధనముతోనే వారు జీవింతురు.

దో॥ బ్రహ్మ గ్యాన బిను నారి నర కహహిం న దూసరిబాత।
కౌడీ లాగి లోభ బస కరహిం బిప్ర గురు ఘాత॥ 99

తా॥ స్త్రీ-పురుషులెల్లరు బ్రహ్మజ్ఞానమును గూర్చియే చెప్పుకొను చుందురు. యితరములగు విషయములు జెప్పుకొనరు. ధనలాభముకొరకు బ్రాహ్మణుల, భక్తుల గురువుల హత్య చేయుటకు వెనుకాడరు

దో॥ బాదహిం సూద్ర ద్విజన్హ సన హమ తుమ్హ తే కఛుఘాటి
జానఇ బ్రహ్మ సో బిప్రవర ఆంఖి దేఖా వహిం డాటి ॥

తా॥ శూద్రులు బ్రాహ్మణులతో వాద - వివాదములు చేయుచు మేమెందున తక్కువో చెప్పుము ? ఎవడు బ్రహ్మనెరుగునో వాడే శ్రేష్ఠ మగు బ్రాహ్మణుడని పలుకుచు పండ్లుకొరుకుచు కండ్లురిమి జూచుచుందురు.

చౌ॥ పరత్రియ లంపట కపట సయానే ।
మోహ ద్రోహ మమతా లపటానే ॥
తెఇ అభేదబాదీ గ్యానీ నర ।
దేఖా మై చరిత్ర కలిజుగ కర ॥ 1

తా॥ ఎవరు పరాయి స్త్రీయందాసక్తిని గలిగియుందురో, కపట నాటకమాడుటలో నేర్పరిగ నుండునో, మోహమును జెందుచుండునో, ద్రోహము చేయుచుండునో, ప్రేమను, అభిమానమును నటించుచుండువాడే బ్రహ్మకు, జీవునకు భేదములేదని దెల్పుచుండువారే బాగుగ దెలిసిన జ్ఞానులు; కలియుగమందిట్టివారిని జూచితిని

చౌ॥ ఆపు గఏ అరు తిన్హహూ ఘాలహిం ।
జే కహుం సత మారగ ప్రతిపాలహిం ॥
కల్ప కల్ప భరి ఏక ఏక నరకా ।
పరహిం జే దూషహిం శ్రుతి కరి తరకా ॥ 2

తా॥ వారు నాశనమగుటయేగాక యితరులను నాశనము జేయుదురు. తర్క-వితర్క వాదములతో వేదముల నిందించువారు కల్పాంతరమువరకు ఒక్కొక్క నరకములో దిరుగుచుందురు.

చౌ॥ జే వరనాధము తేలి కుమ్హారా ।
స్వ ప చ కిరాత కోల కలవారా ॥
నారి ముఈ గృహ సంప తి నాసీ ।
మూాఢ ముఢా ఇ హోంహిఁ సన్యాసీ ॥ 3

తా॥ తెలగ, కుమ్మరి, ఛండాల, భిల్ల, కోల, కిరాతులు మొదలుగా గల నీచజాతులు ఆడది చచ్చినను, గృహసంపదలు నశించినమా తలలు బోడులుగ జేయించుకొని సన్యాసులయ్యెదరు.

చౌ॥ తే బిప్రన్హ సన ఆపు పుజావహిఁ ।
ఉభయ లోక నిజహాధ న సావహిఁ ॥
బిప్ర నిరచ్ఛర లోలుపు కా మీా ।
నిరాచార సఠ వృషలీ స్వామీా ॥ 4

తా॥ బ్రాహ్మణులచే పూజలు చేయించుకొనియెదరు. అట్టివారు స్వయముగ ఇహపరలోకములలోగూడ నాశనమయ్యెదరు. నిరక్షరాస్యు డగు బ్రాహ్మణుడు, లోభివాడు, కాముకుడు, ఆచారహీనుడు, మూర్ఖుడు, నీచజాతిలో గల వ్యభిచారిణిస్త్రీకి భర్త యగును.

చౌ॥ సూద్ర కరహిఁ జప తప వ్రత నానా ।
బైఠి బిరాసన కహహి పురానా ॥

సబ నర కల్పిత కరహిం అచారా ।
జా ఇ న బరని అనీతి అపారా ॥ 5

తా॥ శూద్రులు వివిధరకములగు జప, తపములున్నూ వ్రతములున్నూ జేయుచుందురు. వ్యాసపీఠముపై కూర్చుండి పురాణములు జెప్పుచుందురు మానవులెల్లరు కల్పితాచరణలు సల్పుచుందురు. ఆ అపారమగు విరుద్ధాచరణలు వర్ణింపజాలను.

దో॥ భఎ వరన సంకర కలి భిన్న సేతు సబలోగ
కరహిం పాప పావహిం దుఖ భయ రుజ సోక బియోగ॥

తా॥ కలియుగములో స్త్రీ-పురుషులెల్లరు వర్ణ సంకరులయ్యెదరు, మర్యాదరహితులుగ ప్రవర్తించెదరు. పాపకర్మములు చేయుటచే దుఃఖము, భయము, రోగము, శోకములతో బాధలు పడుచుందురు

దో॥ శ్రుతి సమ్మత హరిభక్తి పథ సంజుత బిరతి బివేక ।
తేహిం నచలహిం నర మోహ బస కల్పహిం పంథ అనేక॥

తా॥ వేదసమ్మతమైన వైరాగ్యము, జ్ఞానములే హరిభక్తికి మార్గము. కలియుగమానవులు మోహవశులగుటచే భక్తిమార్గమున ప్రయాణింపక వివిధవిధములగు మార్గములు కల్పనలు చేయుచుందురు

ఛం॥ బహు దామ సంవారహిం ధామ జతీ ।
బిష యా హరి లీన్హి న రహి బిరతీ ॥
తపసీ ధనవంత దరిద్ర గృహీ ।
కలి కౌతుక తాత న జాత కహీ ॥

తా॥ సన్యాసులు ధనమును కూడబెట్టి భవనములు కట్టుకొను చుందురు. వారిలో వైరాగ్యముండదు. విషయలంపటు లయ్యెదరు తపస్సు జేయువారలె అదృష్టవంతులయ్యెదరు. గృహస్థులే దరిద్రులుగ నుందురు. ఓ గరుడుడా! కలియుగ దుష్టచరిత్రలు, లీలలు ఏమాత్రమున్నా జెప్ప జాలను.

ఛం॥ కులవతి నికారహిం నారి సతీ।
గృహ ఆనహిం చేరి నిబేరి గతి॥
సుత మానహిం మాతు పితా తబలౌం।
అబలానన దీఖ నహిం జబ లౌం॥

తా॥ కులవతిని, పుణ్యవతులగు స్త్రీలను పురుషులు యింటినుండి వెళ్ళగొట్టెదరు. ఇంటిలోనికి దాసీస్త్రీలను దెచ్చి భార్యలుగ ఉపయోగించు కొనెదరు. భార్యముఖము జూడనంతవరకే తల్లి-దండ్రులు. (భార్య వచ్చుటతోడనే తల్లి-దండ్రుల వదలుచుందురు.)

ఛం॥ ససురారి పి ఆరి లగీ జబ తేం।
రిపురూప కుటుంబ భఏ తబతేం॥
నృప పాప పరాయన ధర్మ నహిం।
కరి దండ బిడంబ ప్రజా నితహిం॥

తా॥ అత్తగారి మాటల్లో బడుటచే తల్లిదండ్రులు శత్రువులయ్యె దరు. రాజులు పాపపరాయణులయ్యెదరు. వారిలో ధర్మ - ఆచరణ యుండదు. ప్రజల నెల్లప్పుడును బాధించుచు, శిక్షలు విధించుచు దుర్దశలు గలుగజేయుచుందురు.

ఛం॥ ధనవంత కులీన మలీన అపీ।
ద్విజ చిన్హ జనేఉ ఉఘార తపీ॥
నహిఁ మాన పురాన న బేదహిఁ జో।
హరి సేవక సంత సహీ కలి సో॥

తా॥ భాగ్యవంతులు నీచజాతిలోనివారైనను ఆచారవంతులుగ బ్రాహ్మణ చిహ్నములు గలిగియుందురు. మానమర్యాదలు లేకయే తపస్యుల వేషములు వేయుదురు. వేదముల, పురాణముల గుర్తింపరు కలియుగమందిట్టివారే హరిభక్తులుగ నుందురు. సత్పురుషులుగ, మహాత్ములుగ రాణింతురు.

ఛం॥ కవిబృంద ఉదార దునీ న సునీ।
గున దూషక వ్రాత నకోపి గునీ॥
కలి బారహిఁ బార దుకాల పరై
బిను అన్న దుఖీ సబ లోగ మరై॥

తా॥ కవితాలోకమున గుంపులుగ పండితులుందురు. ఈ కలియుగమందు కవుల పోషించు దాతలుండరు. వారిని లెక్కించువారున్నూ ఉండరు. కలియుగమందనేక పర్యాయములు కాలగమనము దప్పుచుండును. అన్నపానీయములు లేకుండుటచే ప్రజలు దుఃఖములపాలయ్యెదరు.

దో॥ సును ఖగేస కలి కపట హట దంభ ద్వేష పాషండ।
మాన మోహ మారాది మద బ్యాపి రహే బ్రహ్మండ।

తా॥ ఓ పక్షిరాజా! గరుడుడా! దయతో నాలకింపుము. ఈ కలియుగమందు కపటులు, కోపగ్రస్తులు, దంభము గలవారున్నూ, ద్వేషము

గలవారున్నా, పాషండులు, అభిమానులు, మోహావేశులు, కామాదిగుణ
ములు గలిగినవారీ బ్రహ్మాండమంతా నిండుగ వ్యాపించియుండెదరు.

దో॥ తాపస ధర్మ కరహిం నర జప తప వ్రత మఖ దాన।
దేవ న బరషహిం ధరనీం బఏ న జామహిం ధాన ॥ 101 ॥

తా॥ కలియుగమానవులు జప, తప, యజ్ఞాది క్రతులు దాన, ధర్మాది వ్రతములు తామసభావముతో జేయుచుందురు ఇంద్రాదిదేవతలు వర్షములు కురిపింపరు. అందువలన ఆహారపుపంటలు పండవు ఆహారము లభింపదు.

ఛం॥ అబలా కచ భూషణ భూరి ఛుధా।
ధన హీన దుఖీ మమతా బహుధా ॥
సుఖ చాహహిం మూఢ న ధర్మరతా।
మతి థోరి కఠోరి న కోమలతా ॥

తా॥ స్త్రీలకు వెంట్రుకలే సొమ్ములు (వారేసొమ్ములు ధరింపరు.) వారెల్లప్పుడు అసంతృప్తులుగ నుందురు ధనము లేకుండుటచే బాధపడుచు వివిధ విధములగు కోర్కెలు పెంచుకొనెదరు అవి నెరవేరకుండుటచే బాధలకు, మానసిక అశాంతికి కారణులయ్యేదరు. ఆ మూర్ఖులు సుఖముల నాశింతురు. కాని దానధర్మములు జేయు తలంపుండదు మందబుద్ధులు, కఠోరహృదయులు వారియందే మాత్రమున్నా మంచిభావము లుండవు

ఛం॥ నరపీడిత రోగ నభోగ కహీం।
అభిమాన బిరోధ అకారన హీం ॥

లఘుజీవన సంబతు పంచ దసా ।
కల పాంత న నాస గుమాను అసా ॥

తా॥ కలియుగ మానవులు రోగగ్రస్తు లయ్యెదరు. భోగసుఖము లుండవు. నిష్కారణముగ అభిమానమువల్ల విరోధములు గలుగును. అల్పాయుష్కులు ప్రళయమువచ్చినమా మరణమురాలేదని బాధపడు చుందురు.

ఛం॥ కలికాల బి హాల కిఎ మనుజా ।
నహిం మాన కౌ అనుజా తనుజా ॥
నహిం తోష బిచార న సీతలతా ।
సబ జాతి కు జాతి భఏ మగతా ॥

తా॥ కలికాల మానవులు అస్తవ్యస్తులుగ నుందురు. సోదర-సోదరీభావము లుండవు ప్రజలలో సంతోషము, వివేకము, శాంత ముండదు. ఉచ్చ-నీచజాతులలో అలసత్వముండును.

ఛం॥ ఇరిషా పరుషాచ్ఛర లోలుపతా ।
భరి పూరి రహీ సమతా బిగతా ॥
సబ లోగ బియోగ బిసోక హాఏ ।
వర నాశ్రమ ధర్మ అచార గఏ ॥

తా॥ ఈర్ష్యవలన కఠినమగు పలుకులు పలుకుచుందురు. ఎడతెగని కోర్కెలుగలవారై యుందురు. సమత్వభావము నశించును. ప్రజలెల్లరు వియోగదుఃఖముచే నిండియుందురు. వర్ణాశ్రమ ధర్మములు పూర్తిగ నశించును.

ఛం॥ దమ దాన దయా నహిఁ జాన పనీ।
జడ తా పరవంచన తాతి ఘనీ॥
తను పోషక నారి నరా సగరే।
పర నింగ కజేజగ మో బగరే॥

తా॥ కలియుగ మానవులయం దింద్రియ నిగ్రహముండదు. దాన, ధర్మము లెవ్వరిలో నుండవు. మూర్ఖులు పరులను గొప్పగ దూషించు చుందురు. స్త్రీ-పురుషులెల్లరు వారి - వారి శరీరపోషణ జేయుటయందే కాలము గడిపెదరు. పరులను దూషించువారే ప్రపంచమందు కీర్తిని బొందెదరు.

దో॥ సును బ్యాలారి కాల కలిమల అవగున ఆగార।
గునఉ బహుత కలిజుగ కర బిను ప్రయాస నిస్తార॥ 102

తా॥ ఓ సర్పనాశకా! గరుడా! దయతో నాలకింపుము. కలికాలము పాపపంకిలమైనది. అవగుణములకు పుట్టిల్లు. దీనియందొక సుగుణము గలదు కష్టపడకయే సంసారసముద్రమునుండి తరించవచ్చును.

దో॥ కృత జుగ త్రేతా ద్వాపర పూజా మఖ అరు జోగా।
జోగతి హో ఇ సోఇ కలి హరి నామ తెపావహిఁలోగా

తా॥ సత్యయుగమందు యోగమార్గముద్వారాను, త్రేతాయుగ మందు యజ్ఞములు చేసియు, ద్వాపరయుగమందు పూజలు జేసియుండిన ఏ ఫలితము లభించునో అట్టి ఫలితమును సులభముగ కలియుగమానవులు నామమును స్మరించియే భగవానుని అనుగ్రహమును బొందెదరు,

చౌ। కృత యుగ సబ జోగీ బిగ్యానీ ।
కరి హరి ధ్యాన తరహిఁ భవ ప్రానీ ।
త్రేతా బివిధ జగ్య నర కరహీఁ ।
ప్రభు హి సమర్పి కర్మ భవ తరహీఁ ॥ 1

తా॥ కృతయుగములోని మానవులెల్లరు యోగ శ్రేష్ఠులును, జ్ఞానులువై యుండిరి భగవానుని సర్వకాల సర్వావస్థలందు స్మరించుచు సంసారసముద్రమును తరించిరి. త్రేతాయుగమునందు మానవులు అనేకవిధముల యజ్ఞయాగాది క్రతువులు జరిపి, భవసాగరమునుండి తరించిరి.

చౌ॥ ద్వాపరీ కరి రఘుపతి పద పూజా ।
నర భవ తరహిఁ ఉపాయ నదూజా ॥
కలియుగ కేవల హరి గున గాహా ।
గావత నర పావహిఁ భవ థాహా ॥ 2

తా॥ ద్వాపరయుగమందు మానవులు శ్రీరఘురాముని చరణములు పూజించి అగాధమగునట్టి సంసారబంధనములనుండి తరించిరి. అంతకు దప్ప వారికి వేరొండు ఉపాయములేదు. కలియుగమందు కేవలము భగవన్నామమును స్మరించిన మాత్రముననే మానవులెల్లరు తరించెదరు.

చౌ॥ కలియుగ జోగ న జగ్య న గ్యానా ।
ఏక అధార రామ గున గానా ॥
సబ భరోస తజి జో భజు రామహి ।
ప్రేమ సమేత గావ గున గ్రామ హి ॥ 3

తా॥ కలియుగమునందు యోగము, యజ్ఞము జ్ఞానము లేదు. శ్రీరామచంద్రుని గుణముల కీర్తించుటయే మార్గమైయున్నది. కావున సర్వవిధములగు కార్యముల నొదలి ఏ మానవులు శ్రీరాముని కీర్తించు చుందురో, ప్రేమతో భజనాది కార్యములు సలుపుచుందురో

చౌ॥ సో ఇ భవతరు కఛు సంసయ నాహీం ।
నామప్రతాప ప్రకట కలి మాహీం ॥
కలికర ఏక పునీత ప్రతాపా ।
మానస పుణ్య హోహిం నహిం పాపా ॥ 4

తా॥ అట్టివారు ఈ సంసారసముద్రమునుండి తరింతురు. దీనిలో సందేహమేమాత్రమున్నూ లేదు. కలియుగమందు నామప్రతాపము ప్రత్యక్షముగ నున్నది. కలియుగము పవిత్రమైనది. ప్రతాపము గలది. పుణ్యములు గలుగజేయునది. పాపములు నశింపజేయునది.

దో॥ కలియుగ సమ జుగ ఆన నహిం జౌ నరకర బిస్వాస ।
గాఇ రామ గునగన బిమల భవ తర బినహిం ప్రయాస॥

తా॥ విశ్వాసము గలిగినవారికి కలియుగముతో సమానమగు యుగములేదు. ఈ యుగమందు శ్రీరామచంద్రుని గుణములు గానము జేయువారు పరిశ్రమలేకయే సంసారరూపమనెడు సముద్రమునుండి సులభముగ తరింతురు.

దో॥ ప్రగట చారి పదధర్మకే కలిమహుం ఏకప్రదాన ।
జేన కేనబిధి దీన్హే దాన కరఇ కల్యాన ॥ 103

తా॥ సత్యము, దయా, తపము ధర్మములు ఈ కలియుగమందు ప్రధానమగు ఆధారములు. దాన మేవిధముగ చేసినను శుభములు జరిగి తీరును.

చౌ॥ నిత జుగ ధర్మహోహిఀ సబకేరే ।
హృదయఀ రామమాయాకే ప్రేరే ॥
సుద్ధ సత్వ సమతా బిగ్యానా ।
కృత ప్రభావ ప్రసన్న మన జానా ॥ 1

తా॥ శ్రీరామచంద్రుని మాయాప్రభావము సర్వుల హృదయములలో ప్రేరేపింపబడినది అన్ని యుగములలో ధర్మము నిత్యము ప్రకాశించుచున్నది. శుద్ధసత్వగుణము, సమత్వము, విజ్ఞానము, ప్రసన్నమగు మనస్సుతో నుండుట సత్యయుగ లక్షణములు.

చౌ॥ సత్వ బహుత రజ కఛు రతికర్మా ।
సబ బిధి సుఖ త్రేతా కర ధర్మా ॥
బహు రజ స్వల్ప సత్వ కఛు తామస ।
ద్వాపర ధర్మ హరష భయమానస ॥ 2

తా॥ సత్వగుణాధికము, కొద్దిపాటి రజోగుణము పుణ్యకార్యములందు ప్రీతిగలుగుట, త్రేతాయుగధర్మమై యున్నది. రజోగుణము ఎక్కువగను, సత్వగుణము తక్కువగను, తమోగుణము గలిగియుండుట, భయము, సంతోషము గలిగియుండుట ద్వాపరయుగ లక్షణములై యున్నవి.

చౌ॥ తామస బహుత రజోగున థోరా ।
కలి ప్రభావ బిరోధ చహుఀ ఓరా ॥

బుధ జుగ ధర్మ జాని మన మాహీం ।
తజి అధర్మ రతి ధర్మ కరాహీం ॥

తా॥ తమోగుణము అధికముగ, రజోగుణము కొద్దిపాటిగ ఉండి, నాలుగువైపుల విరోధులుండుటయే కలియుగ ధర్మము. పండితులీ యుగ ధర్మప్రభావమును దెలిసికొని అధర్మముల నొదలి ధర్మమార్గమునందు ప్రీతిగలిగి యుందురు.

చౌ॥ కాల ధర్మ నహిం వ్యాపహిం తాహీ ।
రఘుపతి చరన ప్రీతి అతి జాహీ ॥
నటకృత బికట కపట ఖగరాయా ।
నట సేవకహి న వ్యాపఇ మాయా ॥ 4

తా॥ శ్రీరామచంద్రుని దివ్యచరణములందు ప్రేమ గలవారికి కలియుగ ప్రభావము వ్యాపింపదు. ఓ పక్షిరాజా! నటుని ఇంద్రజాల చేష్టలు చూచువారలకు ఆశ్చర్యమును గలిగించును. వికటముగ నుండును. ఆనటుని సేవకునకు ఇంద్రజాల మనిపించదు.

దో॥ హరి మాయాకృత దోష గున బిను హరిభజన న జాహిం ।
భజిఅ రామ తజి కామ సబ అస బిచారి మన మాహిం ॥

తా॥ శ్రీరామచంద్రుని మాయాప్రభావమువలన దోషములు, గుణములు రచింపబడెను. ఆ దోషములు, గుణములు దాటుటకు శ్రీహరిని భజించుటదప్ప వేరొండు మార్గము లేదని దెలిసికొనుము. నిష్కామభావముతో శ్రీహరిని కీర్తించవలెను.

దో॥ తేహిం కలికాల బరష బహు బసేఉఁ అవధ బిహగేస ।
పరేఉఁ దుకాల బిపతి బస తబ మైం గయఉఁ బిదేస ॥

తా॥ ఓ పక్షిరాజా! కలికాలములో నే ననేక సంవత్సరములు అయోధ్యాపురమందుంటిని. ఒక పర్యాయము ఆ ప్రాంతమునందు భీభత్స పరిస్థితు లేర్పడెను. నేనప్పుడు ప్రాణములు నిలుపుకొనుటకై విదేశము లకు వెడలితిని.

చౌ॥ గయఉఁ ఉజేనీ సును ఉరగారీ ।
దీన మలీన దరిద్ర దుఖారీ ॥
గఏఁ కాల కఛు సంపతి పాఈ ।
తహఁ పుని కరఉఁ సంభు సేవకాఈ ॥

తా॥ ఓ సర్పాంతకా! గరుడుడా! వినుము. నేను దీనుడనై, మలినుడనై, దరిద్రుడనై, దుఃఖితుడనై ఉజ్జయినికి వెడలితిని. కొంత కాలము గడచిన తదుపరి ధనమును సంపాదించుకొని శ్రీశంకరభగవానుని ఆరాధింపసాగితిని.

చౌ॥ బిప్ర ఏక బైదిక సివ పూజా ।
కరఇ సదా తేహి కాజు న దూజా ॥
పరమసాధు పరమారథ బిందక ।
సంభు ఉపాసక నహిఁ హరి నిందక ।

తా॥ ఒక బ్రాహ్మణుడు వేదవిధి ననుసరించి ఎల్లపుడు శివుని ఆరాధించుచుండెడివాడు. ఆతనికి శివునిపూజదప్ప వేరొండు కార్యములేదు. పరమసాధువు. పరమార్థతత్త్వము బాగుగ నెరిగినవాడు, పరమశివుని ఆరాధించినను శ్రీమన్నారాయణుని నిందించెడువాడు కాడు

చౌ॥ తేహి సేవఉఁ మైఁ కపట సమేతా ।
ద్విజ దయాల అతి నీతి నికేతా ॥

బాహిజ నమ్రమ దేఖి మోహి సాఈ ।
బిప్ర పఢావ పుత్ర కీ నాఈ ॥ 3

తా॥ నేను కపటుడనై అతనికి సేవలు జేయుచుంటిని. ఆ బ్రాహ్మణుడు దయాళుడు నీతికి నిలయుడు. ఓ స్వామీ ! నా బాహ్యమగు నమ్రతను జూచి పుత్రునివలె నన్ను జూచుకొనుచు విద్యలు జెప్పెడువాడు.

చౌ॥ సంభు మంత్ర మోహి ద్విజవర దీన్హా ।
సుభ ఉపదేస బిబిధ విధి కీన్హా ।
జపఉఁ మంత్ర సివ మందిర జాఈ ।
హృదయ దంభ అహమితి అధికాఈ । 4

తా॥ ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు నాకు శివమంత్ర దీక్షనొసంగి వివిధ విధములగు శుభోపదేశముల నుపదేశించెను. నేను శివాలయమున కెడలి కూర్చుండి శివమంత్రమును జపింపసాగితిని. నా హృదయమునందు దంభము అహంకారము పెరిగినవి.

దో॥ మై ఖలమల సంకుల మతినీచ జాతి బస మోహా ।
హరిజన ద్విజ దేఖేఁ జర ఉఁకరఉఁ బిష్ణు కర ద్రోహా ।

తా॥ నేను దుష్టుడను, పాపజాతిలోనివాడను, మలినబుద్ధిగలవాడను బ్రాహ్మణులను జూచిన నా మనస్సున కోపము బయలుదేరును శ్రీహరి భక్తులకు ద్రోహములు జేయువాడను.

సో॥ గుర నిత మోహి ప్రబోధి దుఖిత దేఖి ఆచరన మమ ।
మోహి ఉపజఇ అతి క్రోధ దంభిహి నీతి కి భావఈ॥ 105

తా॥ గురుదేవులు నా ఆచరణలు, పద్ధతులు జూచి దుఃఖించెను. దెలియజెప్పుచుండినను నాకు ఏమాత్రము దెలియుటలేదు. నాకు తిరుగబడి కలియబడునంత కోపము వచ్చెడిది. దంభకునికి నీతి మంచిగ గన్పించదు గదా।

చౌ॥ ఏక బార గుర లీన్హ బోలాఈ।
మోహి నీతి బహు భ్రాంతి సిఖాఈ॥
సివ సేవా కర ఫల సుత సోఈ।
అ బిరల భగతి రామ పద హోఈ॥ 1

తా॥ గురుదేవులు నన్నొక పర్యాయము పిలిపించి పరమార్థమును గురించియు, నీతినిగూర్చియు కుమారునకు జెప్పినట్లు, నాయనా! పరమ శివుని పూజించినందులకు ఫలితము శ్రీరామచంద్రుని చరణములందు ప్రేమ ప్రగాఢమగు భక్తిగలిగి యుండుటయే.

చౌ॥ రామహి భజహిం తాతసివ ధాతా।
నర పావఁర కై కేతిక బాతా॥
జాసు చరన అజసివ అనురాగీ।
తాసు ద్రోహఁ సుఖ చహసి అభాగీ॥ 2

తా॥ ఓ గరుడుడా। శివుడు, బ్రహ్మయును శ్రీరామచంద్రుని భజింతురు. అలాంటప్పుడు నీచమానవుని విషయ మేమి జెప్పవలెను? శివుడును బ్రహ్మయు శ్రీరాముని ప్రేమికులు. ఓరీ మూర్ఖుడా! అట్టి ప్రేమికులకు నీవు ద్రోహముజేసి ఏమి బాగుపడగలవు?

చౌ॥ హర కహుఁ హరిసేవక గురుకహేఉ।
సుని ఖగనాథ హృదయ మమ దహేఉ॥

అధమజాతి మైం బిద్యా పా ఏం ।
భయఉం జథా అహి దూధ పి ఆఏం ॥ 3

తా॥ పరమశివుడు హరికి సేవకుడని గురువు చెప్పుటచే వినినదే తడవుగ నా హృదయము మండెను. పాలుపోసి పెంచిన సర్పమువలె మూర్ఖుడనగు నాకు విద్యాదానము జేసినాడు

చౌ॥ మానీకుటిల కుభాగ్య కుజాతీ ।
గురకర ద్రోహ కరఉం బినురాతీ ॥
అతి దయాలగుర స్వప్న న క్రోధా ।
పుని పుని మోహి సిఖావ సుబోధా ॥ 4

తా॥ అభిమానిని, కుటిలాత్ముడను, దౌర్భాగ్యుడను, నీచజాతిలోనివాడనగు నేను గురువునకు ద్రోహము జేయుచుంటిని. దయామయుడగు నా గురువుకు కోపము గలుగలేదు. నేనెన్ని ద్రోహములు జేసినను జ్ఞానమును గలుగజేయునట్టి మార్గములు బోధించుచునే యుండెను.

చౌ॥ జేహి తే నీచ బఢాఈ పావా ।
సో ప్రథమహిం హితి తాహి నసావా ॥
ధూమ అనల సంభవ సును భాఈ ।
తేహి బుఝావ ఘన పదవీ పాఈ । 5

తా॥ సోదరుడా ! దయతో వినుము. అగ్నివలన పొగ ఉత్పన్నమై మేఘాకృతిని బొందును ఆ మేఘము వర్షించుటచే అగ్ని నశించునుగదా ? ఆ దేవిధముగ నీచమానవునకు దేనివలన గొప్పదనము వచ్చునో దానివలననే అతని కన్నివిధముల నాశనము గలుగును.

చౌ॥ రజ మగ పరీ నిరాదర రహఈ।
సబ కర పద ప్రహార నితసహఈ ॥
మరుత ఉడావ ప్రథమ తేహీ భరఈ।
పుని నృప నయన కిరీటన్హి పరఈ ॥ 6

తా॥ దుమ్ము, ధూళి మార్గములందు పడియుండును. ఎల్లప్పుడా మార్గమున నడచువారి పదతాకిడులవలన గలుగు బాధలు సహించుచు వచ్చినట్లు పడియుండును గాలి వీచినదే తడవుగ పైకి ఆ దుమ్మెగిరి ఆకాశమార్గమంతయు నిండును. ఆదుమ్మే రాజుల కన్నులందును, కిరీటము లందును బడునుగదా;

చౌ॥ సును ఖగపతి అస సముఝి ప్రసంగా।
బుధ నహిం కరహిం అధమ కరసంగా ॥
కవి కోవిద గావహిం అసనీతీ ॥
ఖల సన కలహ న భల నహిం ప్రీతీ ॥ 7

తా॥ ఓ పక్షిరాజా! గరుడుడా! బుద్ధిమంతులగు ప్రజలిది దెలిసి కొని నీచమానవులతో స్నేహము జేయరు. దుష్టులతో తగవులు పెట్టుకో రాదని స్నేహమును జేయరాదని, ప్రేమింపరాదని కవులు భక్తులు పండితులు జెప్పుచుందురు

చౌ॥ ఉదాసీన నిత రహిఅ గోసాఈ।
ఖలపరి హరిఅ స్వాన కీ నాఈ ॥
మై ఖల హృదయ కపట కుటిలాఈ।
గుర హిత కహఇ న మోహి సోహాఈ ॥ 8

తా॥ గోసాఈ! ఎల్లప్పుడును అట్టివారితో ఉదాసీనతను గలిగి యుండవలెను. దుష్టులను కుక్కలతో సమానముగ భావించి దూరముగ వదలవలెను. నేను దుష్టుడను. నా హృదయము నిండుగ కుటిలములగు ఆలోచనలు నిండియున్నవి. గురువుజెప్పిన హితకరములగు పలుకులు నాకు వినబుద్ధి గల్గుటలేదు.

దో॥ ఏక బార హర మందిర జపత రహేఉఁ సివనామ।
గురు ఆయఉ అభిమాన తేఁఉఠి నహిఁ కీన్హ ప్రనామ॥

తా॥ నేనొకరోజున శివాలయమందు కూర్చుండి శివమంత్రమును జపించుచుంటిని. ఆ సమయముననే గురుదేవు లచ్చటకు వచ్చిరి. అభిమానమువలన నేను వారికి నమస్కరింపలేదు.

సో॥ సో దయాల నహిఁ కహేఉ కఛు ఉర న రోష లవలేస।
అతి అఘుల గురు అవ మానతా నహి నహిఁ సోక
మహేశ॥ 106

తా॥ గురువు దయామయుడు. దోషమును జూచియు నన్నేమన లేదు. వారి హృదయమునందేమాత్రము కోపము లేదు. గురువు నవమానించుట మహాపాపము. అందువలననే శివుడు సహింపలేకుండెను.

ఛం॥ సుందిర మారుఝ భఈ న భవానీ।
రే హత ?గ్య అగ్య అభిమానీ॥
జద్య పి తవ గురు కేఁ నహిఁ క్రోధా।
అతి కృపాల చిత సమ్యక బోధా॥

తా॥ శివమందిరమునుండి ఆకాశవాణి యిట్లు పలుకసాగెను. అరె భాగ్యహీనా! మూర్ఖా! అభిమానీ! నీ గురువు పరమ శాంతస్వభావము

గలవాడు. ఆతని మనస్సు కోమలమైనది. సంపూర్ణమైన యదార్థమగు జ్ఞానము గలవాడు.

చౌ॥ తదపి సాప సఠ దైహఉఁ తోహీ।
నీతి బిరోధ సోహాఇ న మోహీ।
జౌఁ నహిఁ దండ కరౌఁ ఖల తోరా।
భ్రష్ట హోఇ శ్రుతిమారగ మోరా॥ 2

తా॥ ఓరీ మూర్ఖా! నీకు నేను శాపమిచ్చుచున్నాను నీతికి విరుద్ధముగ ఆచరించుట నీకు మంచిదిగాదు. దుష్టాత్మా! అందులకే నిన్ను దండించుచున్నాను. నేనట్లు జేయనిఎడల వేదమార్గము భ్రష్టమగును.

చౌ॥ జే సఠ గుర సన ఇరిషా కరహీఁ।
రౌరవ నరక కోటి జుగ పరహీఁ॥
త్రి జగ జోని పుని ధరహిఁ సరీరా।
అయుత జన్మ భరి పావహిఁ పీరా॥ 3

తా॥ ఏ మూర్ఖుడు గురువును జూచి ఈర్ష్యను జెందునో, ఆతడు కోట్లకొలది యుగములవరకును రౌరవనరకమునందు పడును. పశుపక్ష్యాది యోనులలో జన్మించి పదివేల జన్మలవరకు దుఃఖములతో గూడిన బాధ ననుభవించును.

చౌ॥ బైఠ రహేసి అజగర ఇవ పాపీ।
సర్ప హోహి ఖల మల మతి బ్యాపీ॥
మహా బిటప కోటర మహుఁ జాఈ।
రహు అధమాధమ అధ గతి పాఈ। 4

తా॥ అరే,పాపిష్ఠా! గురుదేవుల ఎదుటే సర్పమువలె కూర్చుంటివి. దుష్టాత్మా! నీ మనస్సంతయును పాపరాసులచే నిండియున్నది నీవు సర్పమయ్యెదవుగాక! అరే నీచాతినీచుడా! నీచమగు సర్పయోనియందు జన్మించి పెద్ద చెట్టు తొఱ్ఱలో నివసింపుము.

దో॥ హాహాకార కీన్హ గురుదారు న సుని సివ సాప ।
కంపిత మోహి బిలోకి అతి ఉర ఉపజా పరితాప। 107

తా॥ భయమును గొల్పునట్టి శివుని శాపమును విని గురువు హాహాకార శబ్దములు చేసెను. నేవిది జూచి కంపితుడనై తిని. గురువుగారి హృదయమందు బాధ గలుగుచుండెను.

దో॥ కరి దండవత స ప్రేమ ద్విజ సివసన్ముఖ కరజోరి ।
బినయ కరత గద గద స్వర సముఝి ఘోరగతి మోరి॥

తా॥ గురుదేవులు ప్రేమతో పరమశివునకు సాష్టాంగ దండ ప్రణామ మాచరించి, రెండుచేతులు జోడించి నమస్కరించుచు, భయంకరమగు నా శాపమునకు భయకంపితుడై గద్గదస్వరముతో శివమహారాజును ఇట్లు స్తోత్రము చేయసాగెను.

ఛం॥ నమామీశ మీశాన నిర్వాణ రూపం ।
బిభుం వ్యాపకం బ్రహ్మ బేద స్వరూపం ॥
నిజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం ।
చిదాకాశ మాకాశ వాసం భజేఽహం ॥ 1

తా॥ ఓ మోక్షప్రదాతా! విభూ, సర్వవ్యాపక స్వరూపా, పరబ్రహ్మ, వేదస్వరూపా, ఈశాన్యదిక్కున కధిపతివగు శివా, నీవు సర్వ

జీవులకు ప్రభుడవగు పరమశివా! నేను నీకు నమస్కారము చేయు చున్నాను. నీవు మాయారహితుడవు. గుణరహితుడవు భేదరహితుడవు. ఇచ్ఛారహితుడవు. నీలమేఘశ్యాముడవు ఆకాశమునే వస్త్రముగ ధరించిన దిగంబరుడవు. నిన్ను నేను భజించుచున్నాను.

ఛం॥ నిరా కార మోంకార మూలం తురీయం ।
గిరా గ్న్యాన గో తీత మీశం గిరీశం ॥
కరాలం మహాకాల కాలం కృపాలం ।
గుణాగార సంసార సారం నతో౾హం ॥ 2

తా॥ నిరాకారుడవు, ఓంకారస్వరూపుడవు. త్రిగుణాతీతుడవు. వాక్కునకు, జ్ఞానమునకు, ఇంద్రియములకు అందనివాడవు కైలాస నివాసుడవు. వ్యాకులుడవు. మహాకాలమునకు గూడ కాలుడవు దయా సముద్రుడవు. సర్వగుణనిలయుడవు. సృష్టి కందనివాడవు. పరమశివుడ వైనట్టి నీకు నేను నమస్కరించుచున్నాను.

ఛం॥ తుషారాద్రి సంకాశ గౌరం గభీరం ।
మనో భూత కోటి ప్రభా శ్రీ శరీరం
స్ఫురన్మౌలి కల్లోలినీ చారుగంగా ।
లసద్భాల బాలేన్దు కంఠే భుజంగా ॥ 3

తా॥ హిమాచలమువంటి గంభీరస్వరూపుడును, గౌరవర్ణ శరీరము గలవాడును, కోట్లకొలది మన్మధులకంటెను అందమైనవాడును, తలపై సుందరమగు గంగను ధరించి శోభతోనున్నవాడును, లలాటమున రెండవ చంద్రుని ధరించినవాడును, మెడయందు సర్పములచే శోభించువాడును

ఛం॥ చల త్కుండలం భ్రూ సునేత్రం విశాలం ।
ప్రసన్నా ననం నీల కంఠం దయాలం ॥
మృగాధీశ చర్మాం బరం ముండ మాలం ।
ప్రియం శంకరం సర్వనాథం భజామి ॥ 4

తా॥ చెవులకు కదలెడు కుండలములు గలవాడును, అందమైన కనుబొమ్మలు గలవాడును, విశాలములైన కన్నులుతో విరాజిల్లువాడును, సంతోషముతో నున్న ముఖము గలవాడును, నీలకంఠము గలవాడును, దయా సముద్రుడును, సింహచర్మమును వస్త్రముగ ధరించినవాడును. పుర్రెలను మాలగా ధరించినవాడును, సర్వులను ప్రేమించువాడును, సర్వజీవులకు సుఖ-సంతోషములు గలుగజేయువాడును అగునట్టి శ్రీ శంకరభగవానునకు నమస్కరించుచున్నాను.

ఛం॥ ప్ర చండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం ।
అఖండం అజం భానుకోటి ప్రకాశం ॥
త్రయః శూల నిర్మూలనం శూలపాణిం ।
భజేఽహం భవానీ పతిం భావ గమ్యం ॥ 5

తా॥ రుద్రస్వరూపుడు, శ్రేష్ఠతపస్సంపన్నుడు, పరమేశ్వరుడు, అఖండుడు, చావు-పుట్టుకలు లేనివాడు, కోట్లకొలది సూర్యులతో సమానమగు తేజస్సుగలవాడును, ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపములు హరించువాడు, చేతియందు త్రిశూలమును ధరించువాడు, ప్రేమభావమునకు స్వాధీనమగువాడు. శ్రీపార్వతీదేవికి భర్తయగునట్టి శంకరభగవానుని భజించుచున్నాను.

ఛం॥ కలాతీత కల్యాణ కల్పాంత కారీ।
సదా సజ్జనానంద దాతా పురారీ॥
చిదానంద సందోహ మోహాపహారీ॥
ప్రసీద ప్రసీద ప్రభో మన్మథారీ॥

తా॥ కలాతీతుడు, కల్యాణస్వరూపుడు, ప్రళయమును గలిగించువాడు, ఎల్లపుడు సజ్జనులకు ఆనందమును గలిగించువాడు, త్రిపురాసురుని సంహరించినవాడు, సచ్చిదానందస్వరూపుడు, మోహమును హరించువాడు, మథించుటద్వారా వచ్చిన విషమును పానముజేసినవాడు, కామదేవుని సంహరించినవాడును నైనట్టి ఓ శంకరప్రభూ! ప్రసన్నుండవై మమ్మనుగ్రహింపుము.

ఛం॥ న యావద్ ఉమానాథ పాదార విందం।
భజంతీహ లోకే పరే వా నరాణాం॥
న తావ త్సుఖం శాంతి సంతాప నాశం।
ప్రసీద ప్రభో సర్వభూతాధి వాసం॥ 7

తా॥ పార్వతీపతివగు నీ చరణకమలములు భజింపని మానవులు ఇహ పరలోకమున సుఖ-శాంతులు పొందలేరు. త్రితాపములు నశింపవు. సర్వజీవుల హృదయములో నివసించు ఓ పరమశివా! మముల ననుగ్రహింపుము.

ఛం॥ న జానామి యోగం జపం నైవ పూజాం।
నతోఽహం సదా సర్వదా శంభు తుభ్యం॥
జరా జన్మ దుఃఖౌఘ తాతప్యమానం।
ప్రభో పాహి ఆపన్నమామీశ శంభో॥ 8

తా॥ నేను యోగము ఎఱుంగను. జపము, పూజలుచేయు తెరు గను. పరమశివా! సర్వకాల సర్వావస్థలలో నీకు నమస్కారము జేయు చున్నాను ప్రభూ! వృద్ధుడను. చావు-పుట్టుకల బాధలతో నశించుచున్నాను. నన్నీదుఃఖమునుండి కాపాడుము. ఈశ్వరా! ప్రభూ! శంభో! నేను నీకు నమస్కారము జేయుచున్నాను.

శ్లో॥ రుద్రాష్టకమిదం ప్రోక్తం విప్రేణ హర తోష యే।
యే పఠన్తి నరా భక్త్యా తేషాం శంభుః ప్రసీదతి ॥

తా॥ పరమశివుని ప్రీతికొరకై బ్రాహ్మణుడు శివాష్టకమును స్తుతిం చెను. ఏ మానవులీ శివాష్టకమును ప్రేమతో కీర్తించెదరో అట్టివారికి భగ వానుడగు శంకరుడు ప్రసన్నుండగును.

దో॥ సుని బినతీ సర్వగ్య సివ దేఖి బిప్ర అను రాగు।
పుని మందిర న భవానీ భఇ ద్విజ బర బరమాగు ॥108

తా॥ సర్వవ్యాపకుండగు ఆ పరమశివుడు ఈ స్తోత్రమును విని బ్రాహ్మణునకు గల ప్రేమకు ఆశ్చర్యమును జెందెను. అప్పుడు ఆకాశ వాణి బ్రాహ్మణశ్రేష్ఠా వరమడుగుమని పలికెను.

దో॥ జౌం ప్రసన్న ప్రభు మోపర నాథ దీన పర నేహు।
నిజ పద భగతి దె ఇప్రభు పుని దూసర బరు దేహు ॥

తా॥ బ్రాహ్మణు డిట్లు పలికెను. ఓప్రభూ! నన్ననుగ్రహింపుము. నాథా! ఈ దీనునకు నీతో స్నేహసంబంధము గలదు. నాకు మొదటగ నీ చరణములందు భక్తిని గలుగజేయుము. రెండవదిగ నాకు వరమును ప్రసాదింపుము.

దో॥ తవ మాయా బస జీవ జడ సంతత ఫిరఇ భు లాన।
తేహిపర క్రోధ న కరి అప్రభు కృపాసింధు భగవాన॥

తా॥ ప్రభూ! ఈ అజ్ఞానియగు జీవులు నీ మాయకు వశులై నిరంతరము నిన్ను మరచి దిరుగుచుందురు దయాసముద్రుడా! భగవాన్! వానిపై కోపపడవద్దు

దో॥ సంకర దీన దయాల అబ ఎహి పరహోవు కృపాల।
సాప అనుగ్రహ హోఇ జేహిం నాథ థోరెహిం కాల॥

తా॥ దీనజనోద్ధారకా! శంకరా! వీనినిప్పు డనుగ్రహింపుము. ఈ కొద్ది సమయములోనే మీరిచ్చిన శాపమునుండి ఈతనిని అనుగ్రహింపుము.

చౌ॥ ఏహి కరహో ఇ పరమ కల్యానా।
సో ఇ కరహు అబ కృపా నిధానా॥
బిప్ర గిరా సుని పరహిత సానీ।
ఏవ మస్తు ఇ తి భ ఇ నభ బానీ॥ 1

తా॥ దయామయా! ఈతనికి శుభము గలుగునట్లాశీర్వదింపుము. ఆ బ్రాహ్మణుడు పలికినట్టి మేలుజేయు నీ మాటలు పరమశివుడు విని 'అట్లే నెరవేరుగాక' యని ఆకాశమునుండి పలికెను.

చౌ॥ జ ద పి కీన్హ ఏహి దారున పాపా।
మై పుని దీన్హి కోప కరి సాపా॥
తదపి తుమ్హారి సాధు తా దేఖీ।
కరిహఉఁ ఏహి పర కృపా బిసేషీ॥ 2

తా॥ ఈతడు భయమును గలిగించు పాపమును జేసినాడు. నేను కోపమును చెందినవాడనై శాపము యిచ్చితిని. నీయొక్క గొప్పదగు సాధుస్వభావమును జూచి అనుగ్రహమును జూపుచున్నాను.

చౌ॥ ఛమానీల జే పర ఉపకారీ।
తేద్విజ మోహి ప్రియ జథా ఖ రారీ॥
మోర శ్రాప ద్విజ వ్యర్థన జా ఇ హీ।
జన్మ సహాస అవస్య యహ పా ఇ హీ॥ 3

తా॥ క్షమాశీలురు, పరోపకారులు ఖరారియగు శ్రీరామచంద్రునితో నాకు సమానులు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ! నా శాపము వృధాగా పోదు. ఆతడు పదివేల జన్మలవరకు ఈ శాపము ననుభవించును,

చౌ॥ జనమత మరత దు సహ దుఖ హోఈ।
ఏహి స్వల్ప ఉ నహిం వ్యాపిహి సోఈ॥
కవ నేఉం జన్మ మిటిహి నహిం గ్యానా।
సునహి శూద్ర మమ బచన ప్రవానా॥ 4

తా॥ చావుపుట్టుకలు సహింపరాని బాధను గలుగజేయును. ఈతనికి అట్టి దుఃఖముగాని; మనలితనముగాని వ్యాపింపదు. ఏ జన్మమునందును ఈతనికి పూర్వజన్మ జ్ఞానము నశింపదు. శూద్రుడా ! సత్యమగు నా ఈ మాటలు వినుము,

చౌ॥ రఘుపతి పురీం జన్మ తవ భ యఊ।
పుని తైం మమ సేవాం మన దయ ఊ॥

పురీ ప్రభావ అనుగ్రహ మోరేం ।
రామ భగతి ఉపజహిం ఉర తోరేం ॥ 5

తా॥ శ్రీరామచంద్రుని పురమగు అయోధ్యయందు మొదట జన్మింతువు. నీవు నా సేవలలోనే కాలము గడుపుదువు. శ్రీ అయోధ్యా పుర ప్రభావమువల్ల, నా దివ్యానుగ్రహముచే నీకు శ్రీరామచంద్రుని యందు అచంచలమగు భక్తి గలుగును.

చౌ॥ సును మమ బచన సత్య అబ భాఈ ।
హరి తోషన వ్రత ద్విజ సేవకాఈ ॥
అబజని కరహిం బిప్ర అపమానా ।
జానేసు సంత అనంత సమానా ॥ 6

తా॥ ఓ సోదరా! నా సత్యమగు పలుకుల నాలింపుము. బ్రాహ్మణ సేవలు జేసిన భగవానుడు ప్రసన్నమగును. ఎప్పుడును పొరపాటున గూడా బ్రాహ్మణులకు అవమానము జేయవద్దు. మహాత్ములు అనంతుం డగు శ్రీరామచంద్రభగవానునితో సమానము.

చౌ॥ ఇంద్ర కులిస మమ సూల బిసాలా ।
కాల దండ హరి చక్ర కరాలా ॥
జో ఇన్హ కర మారా నహిం మరఈ ।
బిప్ర ద్రోహ పావక సో జరఈ ॥ 7

తా॥ ఇంద్రుని వజ్రాయుధమునకున్నూ, నా గొప్పదియగు త్రిశూల ఆయుధమునకున్నూ. కాలదండమునకున్నూ, భయమును గలి గించు శ్రీహరియొక్క చక్రమునకుగూడ చావనివారు బ్రాహ్మణద్రోహ

రూపమనెడు ప్రచండాగ్నికి భస్మమయ్యెదరు. నామరూపములు లేకుండ నశించెదరు.

చౌ॥ అన బిబేక రా ఖేహు మన మాహీం ।
తుమ్హ కహం జగ దుర్లభ కచునాహీం ।
ఔరఉ ఏక ఆ సిషా మోరీ ।
అప్రతిహాత గతి హో ఇహి తోరీ ॥ 8

తా॥ అని తెలిసికొనుము. నీకీ ప్రపంచమందు దుర్లభమగునట్టి దేదియు లేదని దెలిసికొనుము. నీకు సర్వేసర్వత్రా విజయము చేకూరు నట్లున్నూ, వెళ్ళదలచిన చోటుకు ఆటంకములు లేకుండగ వెళ్లునట్లాశీర్వ దించుచున్నాను.

దో॥ సును సివ బచన హరషి గురు ఏవమస్తు ఇతి భాషి ।
మోహి ప్రబోధి గయఉ గృహ సంభు చరన ఉర రాఖి॥

తా॥ ఆకాశవాణి పలికిన పలుకులు గురుదేవులు విని సంతోషించి "అట్లే నెరవేరుగాక" అని పలికి నన్ను తట్టి బాగుగదెలియునట్లు జెప్పి శివుని చరణములు హృదయమందుంచుకొని తన యింటికి వెడలెను.

చౌ॥ ప్రేరిత కాల బిధి గిరి జా ఇ భయఉం మైం బ్యాల ।
పుని ప్రయాస బిను సో తను తజెఉం గఏం కఛు కాల ॥

తా॥ కాలప్రభావమువలన నేను వింధ్యాచలమున కెడలి సర్పము నైతిని. కొంతకాలమైనతరువాత కష్టము లేకుండగనే సర్పశరీరమును విడచితిని.

చౌ॥ జో ఇ తను ధరఉం తజఉం పుని అనాయాస హరిజాన ।
జిమి నూతనపట పహిరఇ నర పరిహర ఇ పురాన ॥

తా॥ ఓ గరుడుడా : మానవుడు పాత వస్త్రమును వదలి కొత్త వస్త్రమును ధరించినట్లు నేనే శరీరమును బొందినను కష్టములేకయే సుఖముగ నా శరీరమును విడిచిపెట్టగలను.

దో॥ శివ రాఖీ శ్రుతినీతి అరుమైఁ నహిఁ పావా కలేస ।
ఏహి బిధ రేఉఁ బిబిధి తను గ్యాన న గయఉ ఖగెస ॥

తా॥ శివమహారాజు వేదమర్యాదను కాపాడి నాకు దుఃఖములు గలుగనీయలేదు. ఓ పక్షిరాజా ! నే ననేక జన్మలనెత్తినను నాలో గల జ్ఞానము నశింపలేదు.

చౌ॥ త్రిజగ దేవ నర జోఇ తను ధర ఉఁ ।
తహఁ తహఁ రామ భజన అనుసర ఉఁ ॥
ఏక సూల మోహి బిసర నవా ఉ ।
గుర కర కోమల సీల సు ఁ ఉ ॥ 1

తా॥ పశు-పక్ష్యాదుల శరీరములు, దేవశరీరములు, మానవ శరీరములుగాని పొందినప్పటికి, ఆయా ప్రాంతములలో దిరుగుచున్నను శ్రీరామచంద్రుని భజనలు సలుపుచుండెడివాడను. సర్వసుఖములు గలుగుచుండెడివి, నన్నొక పీడని చేసినాడు. గురువుయొక్క కోమలమైన, శీలవంతమైన స్వభావమును నేను ఎప్పుడును మరువజాలను. (నేనట్టి కోమలమైన, మృదువైన స్వభావము గలిగినట్టి గురువును అవమానించితిని. నన్నీ దుఃఖము అంటిపెట్టుకొనియే యుండును.)

చౌ॥ చరమ దేహ ద్విజకై మై పాఈ ।
సుర దుర్లభ పురాన శ్రుతి గాఈ ॥

ఖేలఉఁ తహూఁ బాలకన్హ మీలా ।
కరఉఁ సకల రఘునాయక లీలా ॥ 2

తా॥ నేను అంతిమమున బ్రాహ్మణ శరీరమును బొందుటచే దేవతాదుర్లభమైన పురాణములు, వేదములు గానము జేసితిని. బ్రాహ్మణ శరీరమును బొంది బాలకుడనైనప్పుడు ఆటలాడుకొను కాలమునందు శ్రీరఘురాముని కీర్తించుచు, ఆతడి మధురమగు లీలలే చేసెడివాడను.

చౌ॥ ప్రౌఢ భఏఁ మోహి పితా పఢావా ।
సముఝఉఁ సునఉఁ నహిఁ భావా ॥
మన తే సకల బాసనా భాగీ ।
కేవల రామ చరన లయ లాగీ ॥ 3

తా॥ యువావస్థ వచ్చుటతోడనే నాతండ్రి చదువు చెప్పువాడు బాగుగ తెలుసుకొనెడివాడను. అది విని ఆలోచించగా మేలుగా తోచలేదు. పూర్వవాసనలన్నియు నశించినవి శ్రీరామచంద్రుని దివ్యచరణములందు నా మనస్సు లగ్నమైయున్నది.

చౌ॥ కహు ఖగేస అస కవన అభాగీ ।
ఖరీ సేవ సుర ధేనుహి త్యాగీ ॥
ప్రేమ మగన మోహి కఛు న సోహాఈ ।
హారేఉ పితా పఢా ఇ పఢాఈ ॥ 4

తా॥ ఓ గరుడుడా ! కామధేనువు నొదలి గాడిద సేవలు జేయునట్టి దరిద్రు డెవరు? నేను శ్రీరామచంద్రుని దివ్యచరణములందు మనస్సును లగ్నము జేయుటచే నచ్చలేదు. మంచి అనిపించలేదు తండ్రి నాకు చెప్పి-చెప్పి విసిగిపోయినాడు.

చౌ॥ భఏ కాల వస జబ పితు మాతా।
మైఁ బన గయఉఁ భజన జనత్రాతా॥
జహఁ జహఁ బిపిన మునీశ్వర పావఉఁ।
అశ్రమ జాఇ జాఇ సిరు నావ ఉఁ॥ 5

తా॥ మాతల్లిదండ్రులు కాలప్రభావముచే మరణించుటతోడనే భక్తోద్ధారకుడగు శ్రీరామచంద్రుని భజింపుచు, వనములలో దిరుగుచు కాలమును గడిపితిని. ఎక్కడెక్కడ మునీశ్వరుల, భక్తుల ఆశ్రమములు గలవో అచ్చటచ్చటకు నే వెడలి వారి-వారి పాదములకు సాష్టాంగ దండ ప్రణామములు జేయుచు దివ్యజ్ఞానమును సంపాదింప మొదలిడితిని.

చౌ॥ బూఝఉఁ తిన్హహి రామ గున గాహా।
కహహిఁ సున ఉఁ హరషిత ఖగనాహా॥
సురత ఫిరఉ॥ హరి గున అలువాదా।
అవ్యాహత గతి సంభు ప్రసాదా॥

తా॥ ఓ గరుడుడా, మునీశ్వరుల భక్తులచే శ్రీరామచంద్రుని కథలు చెప్పించుకొనెడువాడను వారు చెప్పుచుండ నేను సంతోషముతో వినెడువాడను. నే నీ విధముగ శ్రీరామచంద్రుని గుణానువాదముల వినుచు దిరుగుచుందును. శివమహారాజు కృపవలన సర్వకాలములలో అడ్డులేకుండ సర్వస్థలములలో దిరిగితిని.

చౌ॥ ఛూటీ త్రిబిధి ఈషనా గాఢీ।
ఏక లాలసా ఉర అతి బాఢీ॥
రామ చరన బారిజ జబ దేఖౌఁ।
తబ నిజ జన్మ సఫల కరి లేఖౌఁ॥ 7

తా॥ నాలోగల సనేషణ, ధారేషణ, పుత్రేషణలు పూర్వవాసనలు పూర్తిగ నశించినవి. నా హృదయమందు శ్రీరామచంద్రుని దివ్యచరణముల దర్శించుటకు, జన్మను సాఫల్యము జేసికొనుటకు ఉత్సాహ మావ్పొంగు చున్నది.

చౌ॥ జేహి పూంఛ ఉ సో ఇ ముని అస కహ ఈ।
ఈశ్వర సర్వ భూ తిమయా అహాఈ॥
నిర్గున మత నహీఁ మోహి సోహాఈ।
నగున బ్రహ్మ రతి ఉర అధికాఈ॥ 8

తా॥ ఈశ్వరుడు సర్వవ్యాపకుడని సర్వభూతమయుడని మునీశ్వరులు చెప్పిరి. ఈ నిర్గుణమతము నాకు నచ్చదు నా హృదయమందు సగుణ బ్రహ్మయనిన మిక్కిలి ప్రీతి గలుగుచున్నది.

దో॥ గుర కె బచన సురతి కరి రామ చరన మనులాగ।
రఘుపతి జస గావత ఫిరఉఁ ఛనఛన నవ అనురాగ।

తా॥ గురుదేవుల వలుకులు స్మరించుకొనిన శ్రీరామచంద్రుని దివ్య చరణములందు నా మనస్సు లగ్నమైయుండెడిది. మనస్సునందు ప్రేమా అభిరుచులు గలుగుచుండెను. శ్రీరామచంద్రుని కీర్తిని గానము జేయుచు దిరుగాడుచుంటిని.

చౌ॥ మేరు శిఖర బట ఛాయాఁ ముని లో మస ఆసీన।
దేఖి చరన సిరు నాయఉఁ బచన కహేఉఁ అతిదీన॥

తా॥ సుమేరు పర్వతశిఖరమందు వటవృక్షము నీడన లోమశమహా ముని కూర్చుండియుండెను. నేను ఆ మహాత్ముని జూచి వారి దివ్యచరణ ములకు సాష్టాంగ దండప్రణామము జేసి దీనత్వముగ యిట్లు వలికితిని,

దో॥ సుని మమ బచన బినీతమృదు మునికృపాల ఖగరాజ ।
మోహిసాదర పూంఛత భవద్విజ ఆయహు కేహికాజ॥

తా॥ ఓ పక్షిరాజా! గరుడుడా! నమ్రతతో గూడిన విషయము లగు నా పలుకులు విని దయాళుండగు లోమశమహాముని అనుగ్రహించి, కూర్చుండబెట్టుకొని బ్రాహ్మణుడా! నీవే కార్యముకొరకు యిటు వచ్చితివో చెప్పుమని పలికెను

దో॥ తబమైఁ కహా కృపానిధి తుమ్హ సర్వజ్ఞ సుజాన ।
సగునబ్రహ్మ అవరాధన మోహి కహహు భగవాన ॥

తా॥ అప్పుడు నేనిట్లు పలికితిని. దయాసముద్రుడా! సర్వజ్ఞుడవు. సర్వవ్యాపకమైన మహాత్ముడవు. భగవంతుడా! నాకు సగుణబ్రహ్మారాధ నను గురించి దయతో దెలియజెప్పుము.

చౌ॥ తబమునీస రఘుపతి గునగాధా ।
కహే కఛుక సాదర ఖగనాథా ॥
బ్రహ్మగ్యాన రత మునిబిగ్యానీ ।
మోహి పరమ అధికారీ జానీ ॥ 1

తా॥ పక్షిరాజా! లోమశ మహర్షులవారు శ్రీరామ చంద్రుని గుణ ములను, కథలను ప్రేమతో నా కప్పుడు జెప్పెను. నేను బ్రాహ్మ ణుండనని, విజ్ఞానినని భగవంతునిలీలలు దెలిసికొనుటకు తగినవాడనని

చౌ॥ లాగే కరన బ్రహ్మ ఉపదేసా ।
అజ అద్వైత అగున హృదయేసా ॥

అకల అనీహా అనామ అరూపా ।
అను భవ గమ్య అఖండ అనూపా ॥ 2

తా॥ నాయనా ! భగవానుడు అజన్ముడు. అద్వైతుడు. నిర్గుణుడు. సర్వజీవుల హృదయములలో నివసించువాడని బ్రహ్మోపదేశము నా మహర్షి వినిపింపసాగెను. మనోవాక్కాయ కర్మలద్వారా దెలియబడని వాడు. ఇచ్ఛారహితుడు. నామ, రూపములు లేనివాడు. అనుభవముద్వారానే దెలిసికొనబడువాడు, అఖండుడు. ఉపమారహితుడు.

చౌ॥ మన గోతీత అమల అవి నాసీ ।
నిర్వికార నిరవధి సుఖ రాసీ ॥
సో తై తాహి తోహిం నహిం ఖేదా ।
బారి బీచ ఇవ గావహిం బేదా ॥ 3

తా॥ శ్రీరామనారాయణ ప్రభువు మనోవాక్కాయ కర్మలద్వారాను, ఇంద్రియములచేతను దెలియబడనివాడు. నిర్మలుడు. నాశనరహితుడు. నిర్వికారుడు. ఆది అంతములు లేనివాడు. సుఖసంపదలకు నిలయుడు. తత్త్వమసియైయున్నాడు, నీరు-నీటిమీద గీతవలె భగవానునిలో నీలో భేదమేమియు లేదని.

చౌ। బిబిధి భ్రాంతి మోహిమునివ నముఝూ వా ।
నిర్గున మత మమ హృదయఁ న ఆవా ॥
పునిమై కహేఉఁ నాఇ పదసీసా ।
సగున ఉపాసన కహహు మునీసా ॥ 4

తా॥ లోమశమహర్షి నా కనేక విధముల దెలియజెప్పినాడు. నిర్గుణ మతము నా హృదయమున నాటలేదు. నేను మునిశ్రేష్ఠుని పాదపద్మము

లకు నమస్కరించి సగుణోపాసన బ్రహ్మమునుగూర్చి చెప్పుమని ప్రార్థించితిని.

చౌ॥ రామ భగతి జల మమ మన మీనా।
కిమి బిలగాఇ మునీస ప్రబీనా॥
సోఇ ఉపదేస కహహు కరి దాయా।
నిజ నయన్హి దేఖౌఁ రఘు రాయా॥ 5

తా॥ మునిశ్రేష్ఠా! రామభక్తి రూపమున గల జలములో చేపవలె వున్న నీ మనస్సెట్లు వేరగును? శ్రీరామచంద్రుని నే నెట్లు జూడగలను? నాకా ఉపాయమును దెలియజెప్ప వేడుచున్నాను.

చౌ॥ భరి లోచన బిలోకి అవధేసా।
తబ సునిహఉఁ నిర్గున ఉపదేసా॥
ముని పుని కహి హరి కథా అనూపా।
ఖండి సగున మత అగున నిరూపా॥ 6

తా॥ శ్రీరామచంద్రుని నా నేత్రములతో జూచినపిదప నిర్గుణోపదేశమును విందును. లోమశమహర్షి వర్ణనాతీతమగు శ్రీహరి కథలను జెప్పి, సగుణారాధనను ఖండించుచు, నిర్గుణోపాసననుగూర్చి వివరింప సాగెను.

చౌ॥ తబ మైఁ నిర్గుణ మత కర దూరీ।
సగున నిరూపఉఁ కరి హఠ భూరీ॥
ఉత్తర ప్రతి ఉత్తర మైఁ కీన్హా।
ముని తన భఏ క్రోధ కే చీన్హా॥ 7

తా॥ నే నప్పుడు నిర్గుణోపాసనను ఖండించి బలవంతముగ సగుణోపాసనను నిరూపించసాగితిని. వారు చెప్పుదానికి వ్యతిరేకముగ చెప్పితిని. అందుల కా లోమశమహాముని కి మిక్కిలి కోపము గలిగెను. (ఆపాదమస్తకమునిండిన కోపముండెను.)

చౌ॥ సును ప్రభు బహుత అవగ్యా కిఏఁ
ఉపజ క్రోధగ్యా నిన్హ కే హిఏఁ।
అతి సంఘర్షన జౌఁ కర కోఈ।
అనల ప్రగట చందన తేహో ఈ॥ 8

తా॥ ప్రభూ! అవమానము జేసినయెడల జ్ఞానికైనను కోపము రాకమానదు. చందనపుకఱ్ఱ అయినను అధికముగ రాపిడిని గలుగజేసిన అగ్ని ఉత్పన్న మగునుగదా!

దో॥ బారం బార సకోప ముని కరఇ నిరూపన గ్యాన।
మైఁ అపనేఁ మన బైఠ తబ కరఉఁ బిబిధి అనుమాన॥

తా॥ మాటిమాటికి మునిశ్రేష్ఠుండగు నా లోమశమహర్షి కోపము జెందినవాడై నిర్గుణ జ్ఞానతత్వమును నిరూపింపసాగెను. నే నద్దానిని జాగరూకతతో వినుచు లోలోన అనుమానింపసాగితిని.

దో॥ క్రోధకి ద్వైతబుద్ధి బిను ద్వైత కి బిను అగ్యాన।
మాయ వస పరిచ్ఛిన్న జఢ జీవ కి ఈస సమాన॥

తా॥ ద్వైతబుద్ధిలేనిదే కోప మెట్లు గలుగును? అజ్ఞానములేని ద్వైతబుద్ధి ఎట్లు గలుగును? మాయకు వశులయిన జీవులు ఛిన్నాభిన్నము లగు జడములు పరమేశ్వరునితో సమానమెట్లగును?

చౌ॥ కబహుఁ కి దుఖ సబ కర హిత తాకేఁ ।
తేహికి దరిద్ర పరస మని జాకేఁ ॥
పరద్రోహి కి హోహిఁ ని సంకా ।
కామీ పునికి రహహిఁ అకలంకా ॥ 1

తా॥ జీవులకు మేలుచేయుచుండిన దుఃఖము లెట్లుగలుగును ? పరసు వేదిగలిగిన వారివద్దకు దరిద్రమెట్లు జేరును ? పరులకు అపకారము జేయు వారలకు నిర్భయమెట్లు గలుగును ? కామునకు అపకీర్తి రాకయుండునా ?

చౌ॥ బంస కి రహ ద్విజ అనహిత కీన్హేఁ ।
కర్మకిహోహిఁ స్వరూపహి చీన్హేఁ ॥
కాహూ సుమతి కి ఖల సంగ జామీ ।
సుభగతి పావ కి పరత్రియ గామీ ॥ 2

తా॥ బ్రాహ్మణులకు అపకారములు జేసినవారి వంశముఉండునా ఏమి ? ఆత్మజ్ఞానము దెలిసినవారికి కర్మకాండలవసరమా ? దుర్మార్గుల స్నేహమువలన ఎవరికైన సద్బుద్ధులుగలుగునా? పరస్త్రీ లోలురకు ఉత్తమ గతులు గలుగునా ?

చౌ॥ భవ కి పరహిఁ పరమాత్మా బిందక ।
సుఖీ కిహోహిఁ కబహుఁ హరి నిందక ॥
రాజు కి రహఇ నీతి బిను జానేఁ ।
అఘకి రహహీఁ హరిచరిత బఖానేఁ ॥ 3

తా॥ భగవానుని దెలిసికొన్నవాడు చావు-పుట్టుకల చక్రమందు దిరుగుచుండునా ? భగవానుని దూషించువానికి ఎప్పుడైననూ సుఖము

లభించునా ? నీతిలేనిరాజు రాజ్యమును నిల్పుకొన గలుగునా ? శ్రీరాముని చరిత్రలు గానముజేయువానికి పాపములుండునా ?

చౌ॥ పావన జస కి పున్య్ బినుహోఈ ।
బిను అఘు అజస కి పావఇ కోఈ ॥
లాభు కి కిఛు హరి భగతి సమానా ।
జేహి గావహిం శృతి సంతపురానా ॥ 4

తా॥ పుణ్యకార్యములు జేయకుండగనే కీర్తిలభించునా ? పాపము చేయకుండగనే అపకీర్తి లభించునా ? ఈమహిమలనుగురించి వేదముల లోను, బుద్ధిమంతులును, సాధుమహాత్ములును కీర్తించిరి. హరిభక్తితో సమానమైన లాభము వేరొండులేదు

చౌ॥ హానికి జగ ఏహి సమ కఛుభాఈ ।
భజిఅ న రామహి నర తను పాఈ ॥
అఘకి పిసునతా సమ కఛు ఆనా ।
ధర్మకి దయా సరిస హరిజానా ॥ 5

తా॥ ఓ సోదరుడా ! మానవశరీరము బొందియుగూడా శ్రీరామ చంద్రుని భజింపకుండిన ఎడల ఈ ప్రపంచమందు ఇంతకంటె మించిన దారుణమగు పాపమేమిగలదు ? పిసినారితనముకంటె గొప్పకర్మ మేమి గలదు ? దయతో సమానమగు ధర్మమేమి గలదు ?

చౌ॥ ఎహిబిధి అమితి జుగతి మన గున ఉఁ ।
ముని ఉపదేస నసాదర సున ఉఁ ॥
పుని పుని సగున పచ్ఛ మై రోపా ।
తబ ముని బోలేఉ బచన సకోపా । 6

తా॥ ఇట్లు నామనస్సులో వివిధ విధములగు యుక్తులతోగూడిన ఉపాయముల నాలోచించి ఆమునీశ్వరుని మాటలు నేవినలేదు. మాటిమాటికి సగుణారాధనను గూర్చియే బలపరచితిని. అందులకా లోమశమహర్షి కోపించి యిట్లు పలుకసాగెను.

చౌ॥ మూఢ పరమ సిఖ దేఉఁ న మానసి ।
ఉత్తర ప్రతి ఉత్తర బహు ఆనసి ॥
సత్య బచన బిస్వాస న కరహీ ।
బాయస ఇవ సబహీ తే డరహీ ॥ 7

తా॥ మూఢా! నేను నీకు ఉత్తమవిధానమును జెప్పుచున్ననూ గుర్తింపజాలకుంటివి. వివిధ విధముల ఉత్తర-ప్రత్యుత్తరముల నిచ్చుచున్నావు. నా సత్యమగుమాటలలో నీకు విశ్వాసములేదు. కాకివలె మాటిమాటికి భయమును జెందుచున్నావు.

చౌ॥ సఠ స్వపచ్ఛ తవహృదయఁ బిసాలా ।
సదపి హోహి పచ్ఛి చండాలా ॥
లీన్హ శ్రాప మైఁ సీస చఢాఈ ।
నహిఁ కఛు భయ న దీనతా ఆఈ ॥ 8

తా॥ మూర్ఖుడా! మనస్సునందు నీ ఆలోచనలకే బలవత్తరమగు పట్టుదల ఉన్నది. వెంటనే కాకివై పొమ్ము అని శపించెను. నేను సంతోషముతో ఆ మునిశ్రేష్ఠుని శాపమును శిరోధార్యముగ భావించి స్వీకరించితిని.

దో॥ తురత భయఉఁ మైఁ కాగ తబ పుని ముని
పద సిరు నాఇ ।
సుమిరి రామ రఘుబంస మని హరషిత చలేఉ
ఉడాఇ ॥ 112

తా॥ నాకు వెంటనే కాకిరూపము వచ్చెను. లోమశమహాముని పాదములకు సాష్టాంగ నమస్కారమొనర్చి రఘుకుల భూషణుండగు శ్రీరామచంద్రుని స్మరించుకొని సంతోషముతో నెగురుచు బయలుదేరితిని.

దో॥ ఉమా జే రామ చరన రత బిగత కామ మద క్రోధ।
నిజ ప్రభుమయ దేఖహిం జగత కేహి సన కరహిం బిరోధ॥

తా॥ (శివుడు చెప్పుచున్నాడు.) ఓ ఉమా! శ్రీరామచంద్రుని దివ్య చరణములందు భక్తిగలవారలకు కామక్రోధ లోభములు నశించును. వారీ జగత్తునే శ్రీరామమయముగ జూతురు. విరోధభావముగ ఎవరినీ జూడరు.

చౌ॥ సును ఖగేస నహిం కఛు రిషిదూషన।
ఉర ప్రేరక రఘుబంస బిభూషన॥
కృపాసింధు ముని మతి కరి భోరీ।
లీన్హీ ప్రేమ పరిచ్ఛా మోరీ॥ 1

తా॥ కాకభుశుండి మహర్షి ఇట్లు జెప్పసాగెను. పక్షిరాజా! గరుడుడా! దయతో వినుము. ఇందులో లోమశమహర్షి దోషమేమియు లేదు. రఘువంశ శ్రేష్ఠుండగు శ్రీరామచంద్రుడు సర్వుల హృదయములందుండి ప్రేరేపించువాడై యున్నాడు. దయాసముద్రుండగు శ్రీరాముడు ముని యొక్క అల్పబుద్ధిని, నాలోగల సంతోషమును పరీక్షించెను

చౌ॥ మన వచ క్రమ మోహి నిజ జన జానా।
ముని మతి పుని ఫేరీ భగవానా॥
రిషిమమ మహత సీలతా దేఖీ।
రామ చరన బిస్వాస బిసేషీ॥ 2

తా॥ మనో, వాక్కాయకర్మలద్వారా శ్రీరామచంద్రులవారు నన్ను తన దాసుడని యెరింగి మునిశ్రేష్ఠుని మనస్సును మార్చివైచెను. నాలో గల మహాపురుష లక్షణములగు ధైర్యము, కోపములేకుండుట, వినయము మొదలుగాగల గుణముల జూచి అచంచలమగు శ్రీరామ భక్తుడనని భావించెను.

చౌ॥ అతి బినయ వుని వుని పచ్చి తాఈ ।
సాదర ముని మోహి లీన్హ బోలాఈ ।
మమ పరితోష బిబిధి బిధి కీన్హా ।
హరషిత రామమంత్ర తబదీన్హా । 3

తా॥ లోమశమహర్షి మిక్కిలి దుఃఖించినవాడై మాటిమాటికి పశ్చాత్తాపము జెందుచు ప్రేమతో నన్ను బిలిచి అనేకవిధముల సంతోష పరచి, శ్రీరామమంత్ర ముపదేశించినాడు.

చౌ॥ బాలక రూప రామ కర ధ్యానా ।
కహేఉ మోహి ముని కృపానిధానా ।
సుందర సుఖద మోహి అతిభావా ।
సో ప్రథమహిం మై తుమ్హహి సునావా । 4

తా॥ కృపాసముద్రుండగు నా మునిశ్రేష్ఠుండు బాలరామచంద్రుని ధ్యానించు విధానము జెప్పెను. సుందరాకారుడు, సర్వసుఖముల గలుగ జేయు శ్రీరామచంద్రుని ధ్యానముజేయుటలో నాకు మిక్కిలిగ మేలు గలిగెను. నే నా ధ్యానమందనుభవించిన ఆనందమునుగూర్చి చెప్పు చున్నాను. వినుము,

చౌ॥ముని మోహిం కఛుకకాల తహఁ రాఖా ।
రామచరితమానస తబ భాషా ॥
సాదర మోహిం యహ కథా సునాఈ ।
పుని బోలేముని గిరా సుహాఈ ॥ 5

తా॥ మునిశ్రేష్ఠుఁడు కొంతకాలమువరకు తనవద్ద కూర్చుండబెట్టుకొని శ్రీరామచరిత మానసమును గూర్చి చెప్పినాడు. ప్రేమతో నాకా మహర్షి శ్రీరామచంద్రుని దివ్యమహిమలు, కథలు వివరముగ వర్ణించి జెప్పి నన్నను గ్రహించి యిట్లు పలుకసాగినాడు.

చౌ॥ రామచరిత సర గుప్తసుహావా ।
సంభుప్రసాద తాతమైఁ పావా ॥
తేహిం నిజ భగత రామ కర జానీ ।
తాతే మైఁ సబ కహేఉఁ బఖానీ ॥ 6

తా॥ స్నేహితుఁడా : నేనాసుందరము, దివ్యమహిమలు గల శ్రీరామ చరితమానసమును పరమశివుని దివ్యానుగ్రహమువలన వింటిని. నీవు నిజమైన శ్రీరామచంద్రుని భక్తుడవని యెరింగితిని, అందువలననే నీకు శ్రీరామచరితమానస మహాత్మ్యమునుగూర్చి విపులముగ జెప్పితిని.

చౌ॥ రామ భగతి జిన్హ కే ఉర నాహీఁ ।
కబహుఁ న తాత కహిఅ తిన్హ పాహీఁ ॥
ముని మోహిం బిబిధి భాంతి సముఝావా ।
మై సప్రేమ ముని పద సిరు నావా ॥ 7

తా॥ స్నేహితుడా! ఎవరి హృదయమునందు శ్రీరాముని యందచంచలమగు భక్తియుండదో అట్టివారికి భక్తినిగురించి చెప్పరాదని నాకు

వివిధ విధముల జెప్పినాడు. ప్రేమకువశుడనై మాటిమాటికి ముని చరణ ములకు నమస్కరించితిని.

చౌ॥ నిజకర కమల పరసి మమ సీసా।
హరషిత ఆసిష దీన్హా మునీసా ॥
రామ భగతి అవిరల ఉర తోరేం ।
బసిహి సదా ప్రసాద అబ మోరేం ॥ 8

తా॥ లోమశమహర్షి తామరపద్మములవంటి తన చేతులతో నాతలను నిమిరి, సంతోషించినవాడై నాయనా ! నాదివ్యానుగ్రహముచే నీహృదయ మందు ప్రగాఢముగ శ్రీరామునిపై భక్తియుండుగాక । అని ఆశీర్వదించి నారు

దో॥ సదా రామప్రియహోహు తుమ్హ సుభగునభవనఅమాన।
కామరూప ఇచ్ఛా మరన గ్యాన బిరాగ నిధాన ॥ 113

తా॥ నీ వెల్లప్పుడు శ్రీరామునకు ప్రియుడువుగనుందువు. కల్యాణ గుణములకు నిలయుడవయ్యెదవు. అభిమానము లేకుండునుగాక ; నీయిష్ట మెచ్చిన రూపమును ధరించగలసమర్థతను గలిగియుందువు. నీయిష్టాను సారముగ మరణముసంభవించును. నీకు యిష్టములేనిదే చావు రాకుండును గాక ; జ్ఞానవైరాగ్యములకు నిలయుడవయ్యెదవు.

దో॥ జేహి ఆశ్రమ తుమ్హ బసబపుని సుమిరత శ్రీభగవంత ।
వ్యాపిహి తహఁ న అబిద్యా జోజన ఏక ప్రజంతా ॥

తా॥ ఇంతమాత్రమే కాదు. నీవే ఆశ్రమమందు నివసించుచు శ్రీరాముని భజించుచుందువో అచటినుండి నాలుగు క్రోసులవరకు మాయా మోహములంటవు,

చౌ॥ కాల కర్మగుణ దోష సుభాఊ ।
కఛు దుఖ తుమ్హహి న బ్యాపిహి కాఊ ॥
రామ రహస్య లలిత బిధినానా ।
గుప్త ప్రగట ఇతిహాస పురానా ॥ 1

తా॥ కాల, కర్మ, గుణ. దోషములున్నా, స్వభావసిద్ధముగ గలుగు దుఃఖ బాధలున్నా నీకు గలుగకుండునుగాక. అనేకవిధములగు నట్టియు, సుందరములైనట్టియు, రహస్యములుగనున్న శ్రీరామచంద్రుని దివ్యలీల లున్నా, ఇతిహాసములలోను పురాణములలోను వర్ణింపబడిన విశేషము లన్నియు ప్రకటములాయెను.

చౌ॥ బిను శ్రమ తుమ్హ జాన బ సబ సోఊ ।
నిత నవ నేహ రామ పద హోఊ ॥
జో ఇచ్ఛా కరిహహు మన మాహీఀ ।
హరి ప్రసాద కఛు దుర్లభ నాహీఀ ॥ 2

తా॥ నీవు పరిశ్రమ జేయకయే దెలిసికొందువుగాక। శ్రీరామ చంద్రుని దివ్యచరణములందు నీకు నిత్యము భక్తి ప్రేమ యుండుగాక। నీ మనస్సులో గల కోర్కెలన్నియు శ్రీహరియొక్క దివ్యానుగ్రహము వలన కష్టము లేకయే లభించును.

చౌ॥ సుని ముని ఆసిష సును మతి ధీరా ।
బ్రహ్మ గిరా భఇ గగన గంభీరా ॥
ఏవమస్తు తవ బచ ముని గ్యానీ ।
యహ మమ భగత కర్మ మన బానీ ॥ 3

తా॥ ఓ ధైర్యశాలీ! గరుడుడా! దయతో వినుము. మునీశ్వరుని ఆశీర్వాదములు విని ఆకాశమునుండి గంభీరమగు స్వరముతో ఆకాశవాణి యిట్లు పలికెను. లోమశమహర్షీ! జ్ఞానశ్రేష్ఠా! నీ మాటలు సత్యమైనవే. ఈతడు మనోవాక్కాయ కర్మలద్వారా నా భక్తుడు.

చౌ॥ సుని న భగి రా హరష మోహి భయఉ।
ప్రేమ మగన సబ సంసయ గయఉ॥
కరి బినతీ ముని ఆయసు పాఈ।
పద సరోజ పుని పుని సిరు నాఈ॥ 4

తా॥ ఆకాశవాణి పలుకులు వినుటచే నాకు ఆనందము గలిగినది. నేను ప్రేమాంబుధిలో మునిగి తేలియాడుచుంటిని. నా సందేహములన్నీ దూరమైనవి. తరువాత వినయముగ మునిశ్రేష్ఠునకు సాష్టాంగ నమస్కారము జేసి శ్రీవారి ఆజ్ఞానుసారముగ

చౌ॥ హరష సహిత ఏహిఁ ఆశ్రమ ఆయఉఁ।
ప్రభు ప్రసాద దుర్లభ వర పాయఉఁ॥
ఇహాఁ బసత మోహి సును ఖగ ఈసా।
బీతే కలప సాత అరు బీసా॥ 5

తా॥ సంతోషముతో ఈ ఆశ్రమమునకు వచ్చితిని. శ్రీరామచంద్ర ప్రభువులవారి దివ్యానుగ్రహమున దుర్లభమగునట్టి వరములు పొందితిని. పక్షిరాజా! నే నీ ఆశ్రమమున ఇరువదేడు కల్పములనుండి నివసించుచున్నాను.

చౌ॥ కరఉఁ సదా రఘుపతి గునగానా ।
సాదర సునహిఁ బిహంగ సుజానా ॥
జబ జబ అవధపురీ రఘుబీరా ।
ధరహిఁ భగత హిత మనుజ సరీరా ॥ 6

తా॥ నేనిచ్చట ఎల్లపుడు శ్రీరఘురాముని దివ్యమగు గుణములు గానము చేయుచునే యుందును. నపుసులు నేర్పరులైన పక్షులు నా గానమును వినుచునే యుండును. అయోధ్యాపురమందు శ్రీరామచంద్రు డెప్పుడెప్పుడు భక్తులకు మెలుగోరి అవతరించునో

చౌ॥ తబ తబ జాఇ రామపుర రహఉఁ ।
సిసు లీలా బిలోకి సుఖ లహఉఁ ॥
పుని ఉర రాఖి రామ సిసురూపా ।
నిజ ఆశ్రమ ఆవఉఁ ఖగభూపా ॥ 7

తా॥ అప్పుడప్పుడు నే వెడలి శ్రీరాముని పురమందు నివసించుచు, సచ్చిదానందమయుని బాలలీలలు జూచుచు. సుఖ – సంతోషముల బొందుచుందును ఓ పక్షిరాజా! గరుడుడా! శ్రీరామచంద్రుని దివ్యమగు బాలరూపమును హృదయమందు ధరించి నీ ఆశ్రమమునకు వచ్చుచు బోవుచు ఉండెదను.

చౌ॥ కథా సకల మైఁ తుమ్హహి సునాఈ ।
కాగ దేహ జేహిఁ కారన పాఈ ॥
కహిఉఁ తాత సబ ప్రశ్న తుమ్హారీ ।
రామ భగతి మహిమా అతి భారీ ॥ 8

తా॥ నే నే కారణమువలన కాకి శరీరమును బొందినది నీకు వివర ముగ దెల్పితిని. పక్షిరాజా! నీ ప్రశ్నలకు జవాబులు జెప్పితిని. ఆహా! రామభక్తి ఎంత గొప్ప మహిమగలదో చూడుము.

దో॥ తాతేయహ తన మోహిప్రియ భయఉ రామపద నేహా।
నిజ ప్రభు దరసప పాయఉఁ గఏసకలసందేహా॥

తా॥ నాకీ కాకి శరీరమనిన మిక్కిలి యిష్టము. నాకీ శరీరము ద్వారానే శ్రీరామచంద్రుని దివ్యచరణములందు భక్తి గలిగినది. ఈ శరీరము ద్వారానే శ్రీరాములవారి దివ్యదర్శనము లభించినది. ఈ కాకి శరీరముద్వారానే సర్వవిధములగు సంశయములు దూరమైనవి.

దో॥ భగతి పచ్ఛ హఠకరి రహేఉఁ దీన్హ మహారిషి సాప।
మునిదుర్లభ వరపాయఉఁ దేఖహు భజనప్రతాప॥

తా॥ నేను హఠపూర్వకముగ భక్తినే సమర్థించితిని. ఆకారణముచే లోమశమహాముని నాకు శాపమిచ్చినాడు. ఫలితమేమిటన మునిశ్రేష్ఠులకు గూడ లభింపని వరములు నే పొందితిని. భజనా ప్రభావ మెట్టిదో జూడుము.

చౌ॥ జే అసి భగతి జాని పరిహరహీఁ।
కేవలగ్యాన హేతు శ్రమ కరహీ॥
తేజడ కామధేను గృహ త్యాగీ।
ఖోజత ఆకు ఫిరహిఁ పయలాగీ॥

తా॥ కామధేనువు నొదలి పాలకొరకు జిల్లెడుచెట్టును వెదకినట్లు భక్తికి మహిమ గలదని దెలిసికొనియు వదలెదరు. జ్ఞానముకొరకని మూఢులు కష్టపడుచు ఇంటిలో ఉందురు.

చౌ॥ సును ఖగేస హరి భగతి బిహాఈ।
జేసుఖ చాహహి ఆన ఉపాఈ॥
తే సఠ మహా సింధు బిను తరనీ।
పైరి పార చాహహిం జథ కరనీ॥ 2

తా॥ పక్షిరాజా! దయతో వినుము. శ్రీరామునియొక్క దివ్యమగు భక్తిని వదలి, వేరొండు విధమున సుఖమును గోరుకొను మానవుడు మూఢుడు. దురదృష్టవంతుడు. నావ లేకయే సముద్రమును దాటుటకు ప్రయత్నించువాడై యుండును.

చౌ॥ సుని భుశుండి కే బచన భవానీ।
బోలేఉ గరుడ హరషి మృదు బానీ॥
తవ ప్రసాద ప్రభు మమ ఉరమాహీం।
సంసయ సోక మోహ భ్రమ నాహీం॥ 3

తా॥ (పరమశివుడు చెప్పుచున్నాడు) ఓ. పార్వతీ! కాకభుశుండుల వారి దివ్యములగు పలుకులకు గరుడుడు సంతోషించి మృదువుగ యిట్లు పలుకసాగెను. ఓ ప్రభూ! నీయొక్క అపార మహిమా ప్రభావమువలన నా హృదయమందు గల సందేహములు, శోక, మోహములు భ్రమయు పూర్తిగ నశించినవి.

చౌ॥ సునేఉఁ పునీత రామ గున గ్రామా।
తుమ్హరీ కృపాఁ లహేఉఁ బిశ్రామా॥

ఏక బాత ప్రభు పూంఛఉఁ తోహీ ।
కహహు బుఝాఇ కృపానిధి మోహీ ॥ 4

తా॥ నేను మీ దివ్యానుగ్రహమువలన శ్రీరామచంద్రుని పవిత్రమగు కథలు, గుణసమూహములు విని సుఖశాంతుల బొందితిని. ప్రభూ! నేను నిన్నొక విషయ మడుగుచున్నాను అనుగ్రహించి తెలియజెప్పుము.

చౌ॥ కహహిఁ సంత ముని బేదపురానా ।
నహిఁ కఛు దుర్లభ గ్యాన సమానా ॥
సోఇ ముని తుమ్హ సన కహేఉ గోసాఈ ।
నహిఁ ఆదరేహు భగతి కీ నాఈ ॥ 5

తా॥ సాధుమహాత్ములు, మునీశ్వరులు, వేదపురాణములును జ్ఞానమునకంటె మించినదిలేదని పలికిరి. సోదరుడా! అట్టి దివ్యజ్ఞానమునే నీకా మునిశ్రేష్ఠుం డుపదేశించినాడు. కాని నీవు భక్తితో సమానమైనదిలేదని మహర్షి పలుకుల నాదరింపలేదు.

చౌ॥ గ్యానహి భగతిహి అంతర కేతా ।
సకల కహహు ప్రభు కృపానికేతా ॥
సుని ఉరగారి బచన సుఖ మానా ।
సాదర బోలేఉ ఖగ సుజానా ॥ 6

తా॥ కృపాసముద్రుడా! ఓ ప్రభూ! జ్ఞానమునకు భక్తికిగల భేదము నాకు తెలియజెప్పుము. గరుడుని మాటలనాలించి భక్తుండగు కాకభుశుండిమహర్షి సంతోషించి ప్రేమతో యిట్లు పలుకసాగెను.

చౌ॥ భగతిహి గ్యానహి నహిం కఛుభేదా ।
ఉభయ హారిహిం భవ సంభవఖేదా ॥
నాథ మునీస కహాహిం కఛు అంతర ।
సావధాన సోఉసును బిహంగవర ॥

తా॥ జ్ఞానమునకును, భక్తికిని భేదమేమాత్రము లేదు. జ్ఞాన భక్తులు రెండునూ సంసారమునందుత్పన్నమగు దుఃఖముల బోగొట్టునవే. స్నేహితుడా! మునీశ్వరులు వీనియందు కొద్దిపాటి భేదమున్నదని దెల్పిరురు. పక్షిరాజా! ఆ అంతరమునుగూర్చి దెల్పెదను. జాగరూకతతో వినుము.

చౌ॥ గ్యాన బిరాగ జోగ బిగ్యానా ।
ఏసబ పురుష సునహు హరిజానా ।
పురుష ప్రతాప ప్రబల సబభాంతీ ।
అబల అబల సహాజ జడజాతీ ॥ 8

తా॥ హరివాహనుడా! దయతో నాలకింపుము. జ్ఞానవైరాగ్యములు, యోగ-విజ్ఞానములన్నీ పురుషమయము. పురుషుల ప్రతాపము అన్నివిధములగూడ గొప్పగ నుండును. స్వభావసిద్ధముగనే స్త్రీ అసమర్థురాలు (అబల). పుట్టుకతోడనే మూర్ఖురాలు.

దో॥ పురుష త్యాగి సక నారిహి జో బిరక్త మతి ధీర ।
నతు కామీ విషయవాస బిముఖ జోపద రఘుబీర ॥

తా॥ వైరాగ్యము గలవాడు, ధైర్యశాలియగు పురుషుడు స్త్రీని వదలివేయును. కాముకత గలిగిన పురుషులమ్మా, విషయవాసనలు గల

వారున్నూ స్త్రీని విడువజాలరు. వారు శ్రీరాముని దివ్యచరణములందు ప్రేమ గలిగియుందురు.

సో॥ సో ఉముని గ్యాన నిధాన మృగనయనీ బిధు ముఖ నిరఖి।
బిబసహోఇ హరిజాన నారిబిష్ణు మాయా ప్రగట ॥ 115

తా॥ జ్ఞానులగు మునిశ్రేష్ఠులయిననూ యువావస్థలో నున్నట్టి, జింకచూపుల జూచునట్టి, చంద్రునివంటి ముఖకాంతి గలిగిన స్త్రీని జూచి, వివశులై ఆమెకు దాసులయ్యెదరు. గరుడుడా। సాక్షాత్తుగ శ్రీమహా విష్ణువుయొక్క మాయ స్త్రీ రూపమున సాక్షాత్కరించెను.

చౌ॥ ఇహాఁ న పచ్ఛపాత కఛు రాఖఉఁ।
బేద పురాన సంత మత భాషఉఁ॥
మోహ న నారి నారికేఁ రూపా।
పన్నగారి యహ రీతి అనూపా॥ 1

తా॥ నే నిక్క డేమాత్రమును పక్షపాతము వహింపలేదు. వేద, పురాణముల సారమును, మహాత్ములు జెప్పెడు సిద్ధాంతములు జెప్పు చున్నాను. అనుపము, విలక్షణమైనట్టిది స్త్రీకి స్త్రీయందు మోహము జనింపదు.

చౌ॥ మాయా భగతి సునహు తుమ్హ దోఉ।
నారివర్గ జానఇ సబకోఉ॥
పుని రఘువీరహి భగతిపిఆరీ।
మాయా ఖలు నర్తకీ బిచారీ॥ 2

తా॥ దయతో వినుము. మాయ, భక్తి స్త్రీ వరములై యున్నవని సర్వులకు దెలియును. ఈ రెండును శ్రీరాముని భక్తియందు ప్రేమ గలిగి యుండును. మాయ నీచమైనది. నాట్యమాడించు నాట్యగత్తె.

చౌ॥ భగతిహి సానుకూల రఘురాయా ।
తాతే తేహి డరపతి అతిమాయా ॥
రామ భగతి నిరుపమ నిరుపాధీ ।
బసఇ జాసు ఉరసదా అబాధీ ॥ 3

తా॥ శ్రీరామచంద్రుడు విశేషముగ భక్తికి అనుకూలుడు. మాయకు శ్రీరాముడనిన భయము. ఎవని హృదయములో ఉపమారహితమైన, విశుద్ధమైన రామభక్తి యుండునో, అట్టివారికి ఏ బాధలును గలుగవు. సుఖశాంతులతో నుండెదరు

చౌ॥ తేహి బిలోకి మాయా సకుచాఈ ।
కరి న సకఇ కఛు నిజ ప్రభుతాఈ ॥
అస బిచారి జేముని బిగ్యానీ ।
జాచహిం భగతి సకల సుఖఖానీ ॥ 4

తా॥ వారిని జూచి మాయ సిగ్గుపడును. శ్రీరామభక్తులపై పెత్తనమును చేయజాలదని దెలిసికొని, విజ్ఞానులగు మునీశ్వరులుకూడ సర్వసుఖ సంపదలగు నిలయుండగు శ్రీరాముని దివ్యచరణములందు భక్తిని ప్రసాదింపమని యాచింతురు.

దో॥ యహ రహస్య రఘునాథ కర బేగి న జానఇ కోఇ ।
జో జానఇ రఘుపతి కృపాఀ సపనేహుఀ మోహ న హోఇ ॥

తా॥ శ్రీరామచంద్రుని ఈ దివ్యమైన, రహస్యమైన భక్తిమార్గము నెవరును సులభముగ దెలిసికొనజాలరు. శ్రీరాముని దివ్యానుగ్రహము వలన మాత్రమే దెలియబడును. వారికి స్వప్నములో గూడ మోహ మంటదు.

దో॥ జౌరఉ గ్యాన భగతి కరభేద సునహు సుప్రబీన ।
జోసుని హోఇ రామపద ప్రీతి సదా అవిఛీన ॥ 116

తా॥ చతురుడా ! గరుడుడా ! విష్ణువాహనుడా ! జ్ఞానమునకు భక్తికి గల భేదమును వినుము. ఎవరికి వినుటతోడనే శ్రీరామచంద్రుని దివ్య చరణములందు ఎల్లప్పుడు అవిచ్ఛిన్నమగు భక్తిగలుగునో, కనుల నానంద బాష్పములు రాలునో, వారినిగూర్చి

చౌ॥ సునహు తాతయహ అకథ కహానీ ।
సముఝుత బనఇ నజాఇ బఖానీ ॥
ఈశ్వర అంసజీవ అబినాసీ ।
చేతన అమల సహజ సుఖరాసీ ॥ 1

తా॥ చెప్పుటకు అందనిది. ఊహాతీతమైనది. తెలిసికోదగినది. జీవుడు ఈశ్వరుని అంశమై యున్నాడు. అతడు అవినాశి చేతనుడు. నిర్మలుడు. స్వభావసిద్ధముగనే సుఖనిలయుడు.

చౌ॥ సో మాయావస భయఉ గోసాఈ ।
బంధ్యో కీర మరకట కీ నాఈ ॥
జడ చేతనహిం గ్రంథి పరిగాఈ ।
జదపి మృషా ఛూటత కఠినాఈ ॥ 2

తా॥ జితేంద్రియుడా। మాయకు వశమైన కోతి చిలుకవలె బంధింపబడినట్లు నిన్ను నీవు బంధించుకొంటివి. జడములు, చేతనములు గూడ మాయకు వశమైయున్నవి, ఆ ముడియే కఠినమైన మాయ. దానిని దొలగించుట బహు కష్టముతో గూడినపని.

చౌ॥ తబతే జీవ భయఉ సంసారీ।
ఛూట న గ్రంధి న హోఇ సుఖారీ॥
శ్రుతి పురాన బహు కహేఉ ఉపాఈ।
ఛూటన అధిక అధిక అరఝాఈ॥ 3

తా॥ ఆకారణము వలననే జన్మ-మరణ చక్రమునకు స్వాధీనమయ్యెదరు ఆ మాయా ప్రకృతిని ఛేధించని ఎడల ఎవరికిని సుఖ శాంతి ఉండదు. వేదములలో, పురాణములలో అనేకవిధముల ఉపాయములు జెప్పబడెను. ఆ మాయాగ్రంధిని తొలగింపనియెడ అధికాధికముగ శరీరమును బాధింపవలసి యుండును.

చౌ॥ జీవహృదయఁ తమ మోహ బిసేషీ।
గ్రంధి ఛూట కిమి పరఇ న దేఖీ॥
అస సంజోగ ఈస జబ కరఈ।
తబహుఁ కదాచిత సో నిరుఅవఈ॥ 4

తా॥ జీవుల హృదయములందు అజ్ఞానరూపమనెడు చీకట్లు తిష్ఠవైచి యున్నవి. ఈ కారణమువలననే మాయను చూడజాలకుండిరి. దానినెట్లు తప్పించుకొనవలెను? ఆ మాయా సంయోగము మనలను విడకుండునట్లు ఈశ్వరుడు కలుగజేసినప్పటికిని సులభముగ మాయ విడిపోవును.

చౌ॥ సాత్త్విక శ్రద్ధా ధేను సుహాఈ ।
జౌం హరి కృపాం హృదయ బస ఆఈ ॥
జప తప వ్రత జమ నియమ అపారా ।
జే శ్రుతి కహ సుభ ధర్మ అచారా ॥ 5

తా॥ శ్రీహరియొక్క దివ్యానుగ్రహమువలన సాత్త్విక శ్రద్ధారూప మనెడు సుందరమైన ఆవు హృదయరూప మనెడు గృహములోనికి వచ్చి నివసించును వివిధములుగ జప, తప, వ్రత, యమ నియమములు మొదలుగాగల శుభమైన ధర్మపద్ధతులను, ఆచరణా విధానములను వేదములు చెప్పినవి.

చౌ॥ తేఇ తృన హరిత చరై జబగాఈ ।
భావబచ్ఛ సిసుపాఇ పేన్హాఈ ॥
నోఇ నివృత్తి పాత్ర బిస్వాసా ।
బిర్మల మన అహీర నిజదాసా ॥ 6

తా॥ ధర్మాచరణ రూపమనెడు పచ్చని గరికలో ఆవు తిరుగుచుండునట్లు, ఆస్తిక భావనారూపమనెడు దూడను పొంది పాలనెప్పుడు గుడుపుచుండునట్లు సంసారిక విషయము లనెడు వాసనల బలవత్తరముగ వదలవలెను. దూడకు పాలు యివ్వకుండిన ఆ ఆవు వెనుకకాళ్ళు కట్టి పాలను కుడుపుచుంటిమిగదా? పాలను దీయుటకు విశ్వాసమను పాత్ర గావలెను నిర్మలమగునట్టి మనస్సే స్వయముగ దాసీయగును. మనస్సను గొల్లవాడు పాలను దీయును.

చౌ॥ పరమ ధర్మమయ పయదుహి భాఈ ।
అవటై అనల అకామ బనాఈ ॥

తో॥ సముమిత తను ఛమాం జాఘ్హావై।
ధృతిసమ జావను దేఇ జమావై॥

తా॥ సోదరుడా! ధర్మమయ రూపమగు భావమను పాలను పిండి, నిష్కామ భావనారూపమనెడు అగ్నిపై నుంచి చక్కగ కాచాలి. క్షమ, సంతోషము లనెడు వాయువులవలన ఆ పాలను చల్లగచేయాలి ధైర్యము, శమము, మనోనిగ్రహ రూపమనెడు తోడుపెఱుగుతో తోడుపెట్టాలి.

చౌ॥ ముదితాం మథై బిచార మథానీ।
దమ ఆధార రజుసత్య సుబానీ॥
తబ మథి కాఢి లేఇ నవనీతా।
బిమల బిరాగ సుభగ సుపునీతా॥ 7

తా॥ అప్పుడు ప్రసన్నతారూపమనెడు మట్టికుండలో తత్త్వవిచార రూపమనెడు మథనమువలన ఇంద్రియహాల జయించి, దాని ఆధారము వలన సత్యము సుందరములతో గూడిన వాగ్రూపమనెడు త్రాడుచే బంధించి మథించవలెను. అప్పుడు దానిలోనుండి నిర్మలమైన, సుందర మైన పవిత్రమైనట్టిది యగు వైరాగ్య రూపమనెడు వెన్నను తీసుకోవాలి.

దో॥ జోగ అగిని కరి ప్రగట తబకర్మ సుభాసు భలాఇ।
బుద్ధి సిరావై గ్యానఘృత మమతామల జరిజాఇ॥ 117

తా॥ అప్పుడు యోగరూపమనెడు అగ్ని ప్రకటితమైన దానినుండి సమస్తమును భస్మముజేయు శుభాశుభ కర్మా రూపమనెడు యోగాగ్ని బయలుదేరును. ఆ అగ్ని సర్వవిధములగు కర్మల కాల్చి బూడిదజేయును, వైరాగ్యరూపమనెడు వెన్న మమతారూపమనెడు మాలిన్యమును ద్రవరూప

మగును జ్ఞానరూపమనెడు నేయి నిశ్చయరూపమనెడు బుద్ధికి ఆనందమును గలుగజేయును

దో॥ తబ బిగ్యానరూపి నీబుద్ధి బిసద ఘృతపాఇ।
చిత్త దిఆ భరి ధరై దృఢ సమతా దిఅటె బనాఇ॥ 117

తా॥ విజ్ఞానరూపమనెడు బుద్ధి జ్ఞానరూపమనెడు నిర్మలమైన నేతిని పొంది దానిద్వారా మనోరూపమనెడు దానిని నిండుగ నింపి, సమతారూపమనెడు దీపపు దిమ్మెను యేర్పరుచుకొని, దానిపై ధైర్యవంతముగ నిలుచుండును.

దో॥ తీని అవస్థా తీనిగున తేహి కపాస తేం కాఢి।
తూల తురీయ సంవారిపునిబాతీ కరై సుగాఢి॥ 117

తా॥ జాగ్రత్త, స్వప్న, సుషుప్తావస్థలునూ, సత్వ, రజ, తమో గుణరూపములనెడు ప్రత్తి కాయనుండి తురీయావస్థా రూపమనెడు ప్రత్తి బయలుదేరును దానిని సుందరమైన వత్తినిగ జేయును.

దో॥ ఏహి బిధి లేసై దీపతేజ రాసి బిగ్యానమయ।
జాతహిం జాసు సమీప జరహిం మదాదిక సలభసబ॥

తా॥ ఈ విధముగనే తేజోవంతమైన, విజ్ఞానవంతములైన కాంతులా దీపపువత్తినుండి బయలుదేరును. అరిషడ్వర్గ గుణములు మిడుతలవలె దాని సమీపమున కెడలి భస్మమగును.

చౌ॥ సోహమస్మిఇతి వృత్తి అఖండా।
దీప సిఖా సోఇ పరమ ప్రచండా॥

ఆతమ అనుభవ సుఖ సుప్రకాసా ।
తబ భవ మూల భేదభ్రమ నాసా ॥ 1

తా॥ సోహమస్మి, (నేనే బ్రహ్మనై యున్నాను) అఖండమైన వాడను. అనంతుడను. జ్ఞానరూపమనెడు ప్రచండమైన దీపశిఖను. ఆత్మానుభవ సుఖము గలిగినప్పుడే సంసారరూపమనెడు మూలమగునట్టి భ్రమ నాశనమగును.

చౌ॥ ప్రబల అవిద్యా కర పరివారా ।
మోహ ఆది తమ మిటఇ అపారా ॥
తప సోఇ బుద్ధి పాఇ ఉంజిఆరా ।
ఉర గృహఁ బైఠి గంథి నిరుఆరా ॥ 2

తా॥ అప్పుడు బలవత్తరములగు అవిద్యారూపమున గల కామ, క్రోధ, లోభ, మోహ, మదము, మాత్సర్యములనెడు చీకట్లు నశించును. విజ్ఞానరూపమనెడు బుద్ధి ఆత్మానుభవరూపమను వెలుగును బొంది, హృదయరూపమనెడు ఇంటిలో కూర్చుండి జడ - చేతనములను మాయా ప్రకృతులతో నాటలాడుకొనుచుండును,

చౌ॥ చోరన గ్రంథిపావ జౌఁసోఈ ।
తబ యుహ జీవ కృతారథ హోఈ ॥
ఛోరత గ్రంథి జాని ఖగ రాజా ।
విఘ్న అనేక కరఇ తబ మాయా ॥

తా॥ విజ్ఞాన రూపమనెడు బుద్ధి ప్రకృతిరూపమునగల మాయతో నాటలాడు కొనుచుండునప్పుడు జీవుడు ధన్యుడగును. ఓగరుడుడా! పక్షి

రాజా ! ప్రకృతితో ఆడుకొనుచున్నప్పటికిని మాయ అనేక విఘ్నములు గలుగజేయుచునే యుండును.

చౌ॥ రిద్ధి సిద్ధి ప్రేరఇ బహు భాఈ ।
బుద్ధిహి లోభ దేఖావహిఁ ఆఈ ॥
కలబల చలకరి జాహిఁ సమీపా ।
అంచల బాత బుఝావహిఁ దీపా ॥ 4

తా॥ సోదరుడా! అప్పుడే కఠినమైన అష్టసిద్ధులు లభించును. అవి గూడను బుద్ధిని లోభమునందు బడవేయును. ఆసిద్ధులు కళలతో గూడినవే. అవి బలవంతముగ కపటముతో సమీపమునకు వచ్చును. దేశసరిహద్దువరకు వాయుప్రేరణలవలన, జ్ఞానరూపమనెడు దీపమునుండి నలుదిశల కీర్తి వ్యాపించును.

చౌ॥ హోఇ బుద్ధి జౌఁ పరమ సయానీ ।
తిన్హ తన చితవ న అనహిత జానీ ॥
జౌఁ తేహి విఘ్న బుద్ధి నహి బాధీ ।
తౌ బహోరి సుర కరహిఁ ఉపాధీ ॥ 5

తా॥ బుద్ధి మిక్కిలి చురుకైనది. అష్టసిద్ధులు హాని గలిగించునని తెలిసికొని దానివైపు తేఱిపారజూడదు. ఈవిధముగ ఈమాయయొక్క విఘ్నములనుండి బుద్ధి తప్పించుకొనును. దేవతలు విఘ్నములు గలిగించుచునేయుందురు.

చౌ॥ ఇంద్రీ ద్వార ఝరోకా నానా ।
తహఁ తహఁ సురబైఠె కరి థానా ॥

ఆవత దేఖహిఁ బిషయ బయారీ ।
తేహఠి దేహిఁ కపాట ఉఘారీ ॥ 6

తా॥ ఇంద్రియములద్వారా హృదయ రూపమనెడు గృహములోనికి ప్రవేశించుటకు చాలా ద్వారములు గలవు. ఒక్కొక్క వాకిలిపై ఒక్కొక్క దేవత కూర్చుండియుండును. విషయరూపములనెడు వాయువులులోనికి ప్రసరించినప్పుడు బలవంతముగ కిటికీలు దెరువబడును.

చౌ॥ జబ సో ప్రభంజన ఉర గృహఁజాఈ ।
తబహిఁ దీప బిగ్యాన బుఝాఈ ॥
గ్రంథి న ఛూటి మిటా సో ప్రకాసా ।
బుద్ధి బికల భఇ బిషయ బతాసా ॥ 7

తా॥ ఆ గొప్పదగు గాలిహృదయ రూపమనెడు గృహములోనికి వచ్చిన విజ్ఞానరూపమనెడు దీపపుకాంతులు ఆరిపోవును. ఆత్మానుభవ రూపముగూడ నశించును. విషయరూపములనెడు వాయువులవలన బుద్ధి వ్యాకులతజెందును.

చౌ॥ ఇంద్రిన్హ సురన్హ నగ్యాన సోహాఈ ।
బిషయ భోగ పర ప్రీతి సదాఈ ॥
బిషయ సమీర బుద్ధికృత భోరీ ।
తేహి బిధి దీప కో బార బహోరీ ॥ 8

తా॥ ఇంద్రియములు, వాని అధిష్ఠానదేవతలకు జ్ఞానము స్వాభావికముగ గుర్తుండదు. విషయ భోగములందే సదా ప్రీతిని గలిగియుండును.

బుద్ధివిగూడ విషయరూపములనెడు వాయువులు పిచ్చివారినిగా జేయును. అజ్ఞానదీపము నేవిధముగ ప్రకాశింపజేయగలరు ?

దో॥ తబఫిరి జీవబిబిధి బిధిపావఇ సంస్కృతి కలేస ।
హరిమాయా అతిదుస్తర తరినజాఇ బిహగేస ॥ 118

తా॥ జ్ఞానజ్యోతులు నశించుటచే జీవులు వివిధరీతులుగ జన్మ-మరణబాధలు పొందుచున్నారు. పక్షిరాజా ! హరి మాయాప్రభావము కఠినమైనది. దుస్తరమైనది. సహజముగానే దానినుండి తప్పించుకొనలేము.

దో॥ కహత కఠిన సముఝుత కఠినసాధత కఠిన బిబేక ।
హోఇ ఘునాచ్ఛర న్యాయ జౌంపుని ప్రత్యూహఅనేక॥

తా॥ జ్ఞానమును దెలిసికొనుటలో కఠినతలేదు. సాధన జేయుటయందె కష్టమున్నది. సంయోగవశమున అక్షరముల కలయికచే ఏర్పడిన జ్ఞానమైననూ అనేక విఘ్నములు గలుగును.

చౌ॥ గ్యాన పంథ కృపానకై ధారా ।
పరత ఖగేస హోఇ నహింబారా ॥
జో నిర్విఘ్న పంథ నిర్వహఈ ।
సోకె వల్య పరమపద లహఈ ॥ 1

తా॥ జ్ఞానమార్గము పాలధారవలె ప్రకాశించు కత్తివంటిది. పక్షిరాజా ! ఈమార్గమున ప్రయాణించుట సుఖవంతమై యుండును. విఘ్నములుండవు కైవల్య రూపమనెడు పరమపదమును బొందెదరు.

చౌ॥ అతి దుర్లభ కైవల్య పరమ పద ।
సంత పురాన నిగమ ఆగమ బద ॥

రామ భజత సోఇ ముకుతి గోసాఈ ।
అన ఇచ్ఛిత ఆవఇ బరిఆఈ ॥ 2

తా॥ కైవల్యపదము మిక్కిలి కష్టమని సాధుమహాత్ములు. పురాణములు, వేదములలో తంత్రశాస్త్రములలో గూడ చెప్పబడెను. జితేంద్రియుడా! ఆ దుర్లభమగు పరమపదమే శ్రీరామచంద్రుని భజించిన యిష్టమున్ననూ-లేకున్నను సులభముగ లభించును.

చౌ॥ జిమిథల బిను జల రాహ న సకాఈ ।
కోటిభాంతి కోఉ కరై ఉపాఈ ॥
తథా మోక్ష సుఖ సును ఖగరాఈ ।
రహి న సకఇ హరి భగతి బిహాఈ ॥ 3

తా॥ పక్షిరాజా! ఎన్నిఉపాయములు బన్నినమా ఖాళీలేనిదే నీరుండనట్లు మోక్ష సుఖంగూడా శ్రీహరి భక్తిలేనిదే లభించదు.

చౌ॥ అస బిచారి హరి భగత సయానే ।
ముక్తి నిరాదర భగతిలు భానే ॥
భగతి కరత బిను జతన ప్రయాస ॥
సంసృతి మూల అబిద్యానాసా ॥ 4

తా॥ ఇలా ఆలోచించి బుద్ధివంతుడగు వాడు భక్తియందు మునిగి ముక్తినిగూడ తిరస్కరించును. భక్తిచేయుచుండిన ఎడల జన్మ-మృత్యురూపమగు అనన్య ప్రయత్నములేకయే నశించును.

చౌ॥ భోజన కరిఅ తృపితి హిత లాగీ ।
జిమిసో అసన పచవై జఠరాగీ ॥

అసిహరి భగతి సుగమ సుఖదాఈ ।
కోఅస మూఢ నజాహి సోహాఈ ॥ 5

తా॥ నీవు తృప్తికొరకు భోజనముచేసిన జఠరాగ్ని ఎట్లు జీర్ణింప జేసినదో, అదేవిధముగ సుఖమును, ఆనందమును గలుగజేయు హరిభక్తి నెవరుమా విడువరు, అట్లువిడుచు మూర్ఖుడెవడుండును ?

దో॥ సేవక సేవ్య భావబిను భవన తరిఅ ఉరగారి ।
భజహు రామ పదపంకజ అససిద్ధాంత బిచారి ॥ 118

తా॥ సర్పాంతకా ! గరుడజీ: నేను సేవకుడను. భగవానుడు నా ప్రభువు ఈ భావములేనిచో సంసారసముద్రమునుండి తరించుట కష్టమని తెలిసికొని శ్రీరాముని దివ్యచరణములు భజింపుము.

చౌ॥ జో చేతన కహఁ జఢకరఇ జఢఇ కరఇ చైతన్య ।
అస సమర్థ రఘునాథహి భజహిఁ జీవతే ధన్య ॥ 119

తా॥ జడములకు చైతన్యము గలిగించు చైతన్యముగలవానిని జడములుగ చేయుటయందు నేర్పరుడో అట్టి దివ్యపురుషుడగు శ్రీరాముని భజించువారు ధన్యులు.

చౌ॥ కహేఉ గ్యాన సిద్ధాంత బుఝాఈ ।
సునహు భగతి మనికై ప్రభుతాఈ ॥
రామభగతి చింతామని సుందర ।
బసఇ గరుడ జాకే ఉర అంతర ॥

తా॥ నేను జ్ఞానసిద్ధాంతమును గూర్చి జెప్పితిని భక్తిరూపమనెడు మణి మహిమనుగూర్చి తెలిపెదను. వినుము. శ్రీరామచంద్రునియందు

భక్తి సుందరమైన చింతామణి వంటిది. గరుడుడా! ఎవరి హృదయమందు భక్తి నివసించునో

చౌ॥ పరమ ప్రకాశ రూప దిన రాతీ ।
నహిఁ కఛు చహిఅ దిఆ ఘృత బాతీ ॥
మోహ దరిద్ర నికట నహిఁ ఆవా ।
లోభ బాత నహిఁ తాహి బుఝావా ॥ 2

తా॥ తనను-తాను రాత్రింబవళ్ళు ప్రకాశమయునిగ జేసికొనును వారికి ప్రమిదగాని, నేయిగాని, వత్తిగాని ఏమాత్రమును అవసరముండదు (ప్రకాశము సహజముగనే మణికి గలదు) ఈ మోహరూపమనెడు దరిద్రము సమీపమునకు రాజాలదు. లోభరూపమనెడు వాయువు ఆ మణిరూపమున గల దీపమును ఆర్పజాలదు. (మణి స్వప్రకాశవంతమైనది. రెండవదాని సహాయము అవసరము లేదు)

చౌ॥ ప్రబల అవిద్యా తమ మిటి జాఈ ।
హారహిఁ సకల సలభ సముదాఈ ॥
ఖల కామాది నికట నహిఁ జాహీఁ ।
బసఇ భగతి జాకే ఉర మాహీఁ ॥ 3

తా॥ ఆ మణియొక్క దివ్యకాంతులచే అవిద్యారూపమనెడు చీకట్లు నశించును. మదము మొదలుగాగల మిడుతలు, వాని సమూహములు నాశనమగును. ఎవరి హృదయమందు భక్తి నివసించునో అట్టివారి హృదయములోనికి కామ, క్రోధ, లోభ, మోహాది దుష్టగుణములు జొరబడవు.

చౌ॥ గరల సుధాసమ అరిహిత హోఈ ।
తేహి మని బిను సుఖ పావ నకోఈ ॥
వ్యాపహిఁ మానస రోగన భారీ ।
జిన్హ కేబస సబ జీవ దుఖారీ ॥ 4

తా॥ వారికి విషము అమృతమగును శత్రువుగూడ మిత్రుడగును భక్తియను మణి లేనిచో ఆ దివ్యసుఖములు బొందలేడు. గొప్ప - గొప్ప మానసిక బాధలకు స్వాధీనులైనవారు భక్తి నాశ్రయించిన సుఖమయులయ్యెదరు.

చౌ॥ రామ భగతి మని ఉరవశ జాకేఁ ।
దుఃఖ లవలేస న సపనేహుఁ తాకేఁ ॥
చతుర సిరోమని తేఇ జగమాహీఁ ।
జేమని లాగి సుజతన కరాహీఁ ॥ 115

తా॥ శ్రీరామభక్తి రూపమనెడు మణినెవరు హృదయమందు ధరింతురో వారికి స్వప్నములోగూడ దుఃఖములు గలుగవు. భూన భోంతరాళములలో అతడే చతురుడు. మణివంటివాడు. భక్తిరూపమనెడు దివ్యమణికొరకు మానవుడు ప్రయత్నము జేయవలెను.

చౌ॥ సోమని జదపి ప్రగట జగ అహఈ ।
రామకృపా బిను నహిఁ కోఉ లహఈ ॥
సుగమ ఉపాయ పాఇ కేకరే ।
నరహిత భాగ్య దేహిఁ భటభేరే ॥ 6

తా॥ ఆ మణి ప్రపంచమందు ప్రకటమై ప్రత్యక్షమై యున్నది. శ్రీరామచంద్రుని దివ్యానుగ్రహము లేనియెడల భక్తి ఎవరికిని అబ్బదు. భక్తిరసామృతమును పానము జేయుట బహు సులభము. అభాగ్యులు, దురదృష్టవంతులు నగు మానవులు నీచముగ భావించి విడచెదరు.

చౌ॥ పావన పర్వత భేద పురానా ।
రామకథా రుచిరాకర నానా ॥
మర్మీ సజ్జన సుమతి కుధారీ ।
గ్యాన బిరాగ నయన ఉరగారీ ॥ 7

తా॥ వేదములు - పురాణములు పవిత్రమగు పర్వతములు. వివిధ విధములైన దివ్యకథలు ఆ పర్వతములలో గల సుందరమైన గదులు. సాధుమహాత్ములే ఆ గదులలోగల రహస్యముల గనుగొనువారు. ఆ బుద్ధిమంతులే తవ్వగోదల (చెలగపార) వంటివారు. ఓ గరుడుడా। జ్ఞాన, వైరాగ్యములే వారికి నేత్రములు.

చౌ॥ భావసహిత ఖోజఇ జో ప్రానీ ।
పావ భగతి మని సబ సుఖఖానీ ॥
మోరేం మన ప్రభు అసబిస్వాసా ।
రామ తే అధిక రామ కరదాసా ॥

తా॥ ఎవరా ప్రేమ భక్తికొరకు వెదకుచుండువారు సర్వవిధము లగు సుఖ - సంపదలు బొందెదరు, భక్తిరూపమగు మణిని పొందెదరు. ప్రభూ ! శ్రీరామునికంటెను వానియందు భక్తిగలవారే గొప్పవారని నా విశ్వాసము.

—

చౌ॥ రామ సింధు ఘన సజ్జనధీరా ।
చందన తరు హరిసంత సమీరా ॥
సబ కర ఫల హరి భగతి సుహాఈ ।
సో బిను సంత న కాహూఁ పాఈ ॥ 9

తా॥ శ్రీరామచంద్రుడు సముద్రమువంటివాడు. సాధుమహాత్ములు మేఘము వంటివారు. శ్రీహరి చందనపు వృక్షము వంటివాడు. శ్రేష్ఠులగు భక్తులే వాయువులు. సర్వవిధములగు సాధన ఫలితములే సుందరము, దివ్యమునైన హరిభక్తి, ఆ దివ్యమగు భక్తిని సాధుమహాత్ములు దప్ప వేరొండువా రెవ్వరును బొందలేరు

చౌ॥ అస బిచారి జో కర సతసంగా ।
రామ భగతి తేహి సులభ బిహంగా ॥ 10

తా॥ మహాత్ములతో స్నేహము జేయువారికి సులభముగ శ్రీరాముని దివ్యచరణములందు భక్తి లభించునని తెలిసికొనుము.

దో॥ బ్రహ్మ పయోనిధి, మందర గ్యాన, సంతసుర, ఆహిఁ ।
కథా సుధా మథి కాఢహి భగతి మధురతా జాహి ॥

తా॥ వేదములే సముద్రము, జ్ఞానమే మందరాచల పర్వతము. సాధుమహాత్ములే దేవతలు ఆ సముద్రమును మథించినయెడల కథారూపమనెడు అమృతము బయలుదేరును. దానియందు భక్తిరూపమున గల తీయనైన రసప్రవాహము బయలుదేరును.

దో॥ బిరతి చర్మ అసి గ్యానమద లోభ మోహారిపుమారి ।
జయపాఇఅ సో హరి భగతి దేఖుఖగేస బిచారి ॥ 20

తా॥ వైరాగ్యరూపమనెడు డాలుతో చెడుమార్గమునుండి రక్షించు కొనుచు, జ్ఞానమనెడు ఖడ్గమువలన మద, లోభ, మోహములను జయించు వారే హరిభక్తులని పిలువబడుదురు. పక్షిరాజా! గరుడుడా! దీనిని ఆలో చించి చూడుము.

చౌ॥ పుని సప్రేమ బోలెఉ ఖగరాఉ ।
జౌఁ కృపాలు మోహి ఉపర భాఉ ॥
నాథ మోహి నిజ సేవక జానీ ।
సప్త ప్రశ్న మమ కహహు బఖానీ ॥ 1

తా॥ గరుడుడా! దయాసముద్రుడా! నామీద నీకు ప్రేమ ఉండిన యెడల, నీకు సేవకుడనని దెలిసికొని నే నడుగు ఏడుప్రశ్నలకు జవా బులు చెప్ప ప్రార్థించుచున్నాను.

చౌ॥ ప్రథమహిఁ కహహు నాథ మతిధీరా ।
సబతే దుర్లభ కవన సరీరా ॥
బడ దుఖ కవన కవన సుఖ భారీ ।
సోఉ సంఛేప హిఁ కహహు బిచారీ ॥ 2

తా॥ నాథా! ధైర్యశాలీ! దుర్లభమైన శరీరమేద్ది? మొదటిగ జెప్పుము. దుఃఖకరమైన శరీరమెద్ది? నీవు బాగుగ ఆలోచించి సంక్షిప్తముగ జెప్పుము.

చౌ॥ సంత అసంత మరమ తుమ్హ జానహు ।
తిన్హ కర సహజ సుభావ బఖానహు ॥
కవనపున్య శృతిబిదిత బిసాలా ।
కహహు కవన అఘ పరమ కరాలా ॥ 3

తా॥ సాధుమహాత్ముల, దుర్మార్గుల లక్షణములు నీకు బాగుగ దెలియును. వారి-వారి సహజగుణములు వర్ణింపుము. వేదానుసారముగ అన్నింటికంటె గొప్పదియైన పుణ్యము ఏదో, అన్ని పాపములకంటె భయంకరమగు పాపమేదో నాకు దెలియజెప్ప వేడుచున్నాను.

చౌ॥ మానస రోగ కహహు సముఝాఈ ।
తుమ్హ సర్వగ్య కృపా అధికాఈ ॥
తాత సునహు సాదర అతి ప్రీతీ ।
మైం సంచేప కహఉఁ యహ నీతీ ॥

తా॥ మనోదౌర్బల్యమును గూర్చి చెప్పుడు. నీవు సర్వజ్ఞుడవు. నాపై నీకు దయగలదని పలుక (కాకభుశుండి మహర్షి యిట్లు పలుకుచున్నాడు.) ఓ గరుడుడా! నీవు ప్రేమతో జాగరూకుడవై వినుము. నేను నీతినిగురించి సంక్షేపముగ జెప్పుచున్నాను.

చౌ॥ నర తన సమ నహిఁ కవనిఉ దేహీఁ ।
జీవ చరాచర జాచత తేహీ ॥
నరక స్వర్గ అపవర్గ నిసేనీ ।
గ్యాన బిరాగ భగతి సుభ దేనీ ॥ 5

తా॥ మానవశరీరముతో సమానమైన శరీరములు లేవు. చరా-చర జీవులన్నియు ఈ శరీరమునే యాచించును. ఈ మానవశరీరమే నరకమునకు, స్వర్గమునకు, మోక్షమునకు మెట్లై యున్నది. అట్లే కల్యాణప్రదమైన జ్ఞానమును, వైరాగ్యమైన భక్తిని ఇచ్చునదై యున్నది

చౌ॥ సో తనుధరి హరి భజహిం న జే నర ।
హోహిం బిషయ రతమంద మంద తర ॥
కాంచ కించ బదలేం తే లేహీం ।
కరతేడారి పరసమని దేహీం ॥ 6

తా॥ మనుష్య శరీరమును బొందినప్పటికిని ప్రజలు భగవానుని కీర్తింపరు. నీచాతి-నీచమగు విషయములందు మునిగి తేలుచుందురు. అట్టి వారు పరుసవేదిని చేతితో విసరివైచి యినుపముక్కను పట్టుకొందురు.

చౌ॥ నహి దరిద్ర సమదుఖ జగమాహీం ।
సంత మిలన సమ సుఖ జగనాహీం ॥
పర ఉపకార బచన మనకాయా ॥
సంత సహజ సుభాఉ ఖగరాయా ॥ 7

తా॥ ప్రపంచములో దరిద్ర బాధకంటె గొప్ప బాధలేదు, మహాత్ముల దర్శనము, కలయికతో సమానమైన సుఖ-శాంతులు లేవు. ఓ పక్షి రాజా! గరుడుడా, మనోవాక్కాయ కర్మలద్వారా పరోపకారము చేయుచుండుటే మహాత్ముల లక్షణములై యున్నవి.

చౌ॥ సంత సహహిం దుఖ పరహిత లాగీ ।
పరదుఖ హేతు అసంత అభాగీ ॥
భూర్జ తరూ సమ సంత కృపాలా ।
పరహిత నీతి సహ బిసాలా ॥ 8

తా॥ మహాత్ములు యితరులకు శుభములు గలుగుటకై బాధలు సహింతురు. దుర్మార్గులు ఇతరులకు కష్టములు కలిగించుటకు ప్రయత్నించు

చుందురు. దయాసముద్రులగు సాధుమహాత్ములు భోర్జవృక్షముతో సమానులై పౌరులకు మేలు జేయుటకొరకై కష్టములు సహింతురు.

చౌ॥ సన ఇవ ఖల పరబంధన కరఈ ।
ఖాలి కఢాఇ బిపతి సహిసురఈ ।
ఖలబిను స్వారథ పర అపకారీ ।
అహి మూషక ఇవ సును ఉరగారీ ॥ 9

తా॥ దుష్టులు పిచ్చిపట్టినవారివలె ఇతరులకు బాధలు గలుగజేయుదురు. అవమానములు బాధలు సహించుచు మరణించెదరు ఓ సర్పాంతకా! గరుడుడా! దుష్టులు ఏవిధమైన స్వార్థంలేకయే సర్పము. చుంచెలుకతో సమానంగా అకారణంగా అపకారం చేయుచుందురు.

చౌ॥ పరసంపదా బినాసి న సాహీఁ ।
జిమి ససిహతి హాతి హిమ ఉపల బిలాహీఁ ॥ 3
దుష్ట ఉదయు జగ ఆరతి హేతూ ।
జథా ప్రసిద్ధ అధమ గ్రహ కేతూ ॥ 10

తా॥ పండిన పంటను వడగండ్లు నాశనముజేసి అవి నశించునట్లు దుర్మార్గులు బాధించుచుందురు. వారును బాధలు చెందెదరు

చౌ॥ సంత ఉదయు సంతత సుఖ కారీ ।
విశ్వ సుఖద జిమి ఇందు తమారీ ॥
పరమ ధర్మ శ్రుతి బిదిత అహింసా ।
పర నిందా సను అఘన గరీసా ॥ 11

తా॥ సూర్యచంద్రులుదయించి చీకట్లు పోగొట్టి ఆనందమును గలిగించునట్లు అహింసయే పరమధర్మమని పరుల నిందించుటయే మహాపాపమని వేదపురాణములలో చెప్పబడెను. సాధుమహాత్ములతోడి స్నేహము సుఖసంతోషములు గలుగజేయును.

చౌ॥ హరగురు నిందక దాదురహోఈ ।
జన్మ సహస్ర పావ తన సోఈ ॥
ద్విజ నిందక బహునరక భోగకరి ।
జగ జనమయి బాయస సరీరధరి ॥ 12

తా॥ శంకరుని, గురువును నిందించువాడు రాబోవు జన్మలో కప్పగ జన్మించును. వేయిజన్మలవరకాతడు కప్పగనే పుట్టుచు - గిట్టుచుండును బ్రాహ్మణుని నిందించినవాడు నరకబాధల ననుభవించి కాకియై భూలోకమున పుట్టును.

చౌ॥ సుర శ్రుతి నిందక జే అభిమానీ ।
రౌరవ నరక పరహిం తే ప్రానీ ॥
హోహిం ఉలూక సంత నిందారత ।
మోహ నిసా ప్రియగ్యాన భానుగత ॥ 13

తా॥ ఏ దౌర్భాగ్యుడు జీవకోటులను, దేవతలను, వేదములను నిందించునో, అట్టివాడు రౌరవ నరకమున బడును. సాధుమహాత్ములను నిందించువారు గుడ్లగూబలై జన్మింతురు. వారికి మోహరూపమనెడు రాత్రియనిన యిష్టము. జ్ఞానరూపమనెడు సూర్యుడు వారియందు ప్రకాశింపడు.

చౌ॥ సబకై నిందా జె జడ కరహీఁ ।
తే చమ గాదురహోఇ అవతరహీఁ ॥
సునహు తాత అబ మానస రోగా ।
జిన్హ తేదుఖ పావహిఁ సబ లోగా ॥ 14

తా॥ పరుల దూషించువాడు ఎగిరే జంతువుగ పుట్టును. వారివలన ప్రజలెల్లరు దుఃఖితులుగ నుండెదరు

సో॥ మోహా సకల బ్యాధిన్హ కరమూలా ।
తిన్హ తేపుని ఉపజహిఁ బహు శూలా ॥
కామ బాత కఫ లోభ అపారా ।
క్రోధ పిత్త నిత ఛాతీ జారా ॥ 15

తా॥ సర్వరోగములకు మూలము అజ్ఞానము దానివలన అనేక బాధలు గలుగును. కామమే వాతము. లోభమే అపారమగు కఫము. క్రోధమే పిత్తమెయుండుటవలన హృదయ మెప్పుడును మండుచునే యుండును.

చౌ॥ ప్రీతి కరహిఁ జౌఁ తీని ఉభాఈ ।
ఉపజఇ సన్యపాత దుఖదాఈ ॥
బిషయ మనోరథ దుర్గమ నానా ।
తే సబసూల నామకో జానా ॥ 16

తా॥ ఈ మూడున్నూ సోదరులు. వాత, పిత్త, కఫముల వలన దుఃఖమును గలిగించు సన్నిపాతరోగము వచ్చును. కఠినాత్ములకు విషయ సుఖములే కోర్కెలై యుండును. అదే బాధను గలుగజేయు రోగము. ఆ బాధలు వర్ణింపజాలను. వాని పేర్లెవరికి దెలియును.

చౌ॥ మమతా దాదు కండు ఇరషాఈ ।
హరష బిషాద గరహా బహుతాఈ ॥
పర సుఖ దేఖి జరని సోఇ ఛఈ ।
కృష్ట దుష్టతా మనకుటి లాఈ ॥ 17

తా॥ మమత్వమే తామరరోగము. ఈర్ష్య, అసూయలే దురద, గజ్జివంటి రోగములు. హర్ష - విషాదములే కంఠవాపును గలుగజేయు వ్యాధులు. పరుల సుఖములజూచి బాధపడువారు కృశించిపోయెదరు. దుష్టత్వము, కుటిలత్వము గలవానికి కుష్ఠరోగము వచ్చును.

చౌ॥ అహంకార అతిదుఃఖద డమరుఅ ।
దంభ కపట మద మాన నేహరుఅ ॥
తృష్ణా ఉదరవృద్ధి అతి భారీ ।
త్రిబిధి ఈషనా తమన తిజారీ ॥ 18

తా॥ అహంకారము దుఃఖమును గలుగజేయు కంఠర రోగము. దంభము, కపటము, మద, మానములు యౌవనజబ్బు. తృష్ణ కడుపు రోగము. పుత్రులు, ధనము, మానములే బలవత్తరమైన చలిజ్వరము

చౌ॥ జుగ బిధి జ్వర మచ్సర అబిబేకా ।
కహఁ లగి కహౌ కురోగ అనేకా ॥

తా॥ మత్సరము, అవివేకములే వివిధములగు జ్వరములు. అనేక విధములగు చెడ్డజ్వరములు గలవు. వీనినిగూర్చి నే నెంతవరకు చెప్ప గలను.

దో॥ ఏక బ్యాధి వస నరమారిహిం ఏ అసాధి బహుబ్యాధి ।
పీడహిం సంతత జీవకహుం సోకి మి లహై సమాధి॥121

తా॥ రోగపీడితు లగుటవలన మానవులు మరణింతురు. అవి మరణమును గలుగజేయునట్టివే. నిరంతరము ప్రాణులు బాధలు పొందు చుందురు శాంతి గలుగదు.

దో॥ నేమ ధర్మ ఆచార తపగ్యాన జగ్య జపదాన ।
భేషజ పుని కోటిన్హ నహిం రోగ జాహిం హరిజాన ॥

తా॥ ఉత్తమాచారము నియమము, ధర్మములు, తపస్సు, జ్ఞానము, యజ్ఞము, జపము, దానములు కోట్లకొలది మందులతో సమానము. వీని వలన రోగములు గలుగవు.

చౌ॥ ఏహి బిధి సకల జీవ జగరోగీ ।
సోక హరషభయ ప్రీతి బియోగీ ॥
మానసరోగ కఛుక మై గాఏ ।
అహిం సబకేం లఖి బిరలేన్హ పాఏ ॥

తా॥ ఈ చరాచర ప్రపంచములోగల జీవులన్నియు, రోగ గ్రస్థులు హర్ష, శోకములును, భయ, ప్రేమలతోను, వియోగమువలన గలుగు దుఃఖములతో బాధలు జెందుచుండిరి. కొద్దిపాటిగ నేను మానస రోగములను గూర్చి వివరించితిని. ఇవి సర్వులును ఎఱింగినవే మర్లభ మగు నా విషయములు ఎవరును దెలిసికొనజాలరు.

చౌ॥ జానే తే ఛీజహిం కఛు పాపీ ।
నాస న పావహిం జన పరితాపీ ॥

విషయ కుపథ్య పాఇ అంకురే ।
మునిహు హృదయఁ కా నర బాపురే ॥ 2

తా॥ జీవులను బాధపెట్టు రోగములేవో తెలిసికొనిన కొద్దిపాటి బాధతో తేరుకొందువు. నాశనరహితుండవై రోగవిముక్తుండ వయ్యెదవు. విషయలోలు రైనట్టి మునిశ్రేష్ఠుల హృదయములందు పాపబీజములు మొలకెత్తుచుండ సాధారణమానవు లేపాటివారు.

చౌ॥ రామకృపాఁ నాసహిఁ సబరోగా ।
జౌఁ ఏహి భాంతి బనై సంయోగా ॥
సదగురు బైద బచన బిస్వాసా ।
సంజము యహ న బిషయకై ఆసా ॥ 3

తా॥ రోగములన్నియు సంక్రమించినప్పటికిన్ని శ్రీరామచంద్రుని దివ్యానుగ్రహమువలన నాశనమగును. సద్గురురూపమున గల వైద్యుని మాటలందు విశ్వాసముంచుము. విషయలోలుడవు కాకుము. ఇదే జితేంద్రియత్వ మనబడును.

చౌ॥ రఘుపతి భగతి నజీవన మూరీ ।
అనుపాన శ్రద్ధా మతి పూరీ ॥
ఏహి బిధి బలేహిఁ సో రోగ నసాహీఁ ।
నాహిత జతన కోటి నహిఁ జాహీఁ ॥ 4

తా॥ శ్రీరఘురామునియందు భక్తియుండుట సంజీవనీ మూర్ధము వంటిది. శ్రద్ధాభక్తులే పథ్యము. ఈలాగల రోగములన్నియు నాశన

మగును. విషయలంపటుడవై యుందువేని కోట్లకొలది ప్రయత్నములు జేసినను రోగములు నశింపవు.

చౌ॥ జాని అతబ మన బిరుజ గోసాఁఈ ।
జబ ఉరబల బిరాగ అధికాఈ ॥
సుమతి సుధా బాఢఇ నితనఈ ।
బిషయ ఆస దుర్బలతా గఈ ॥ 5

తా॥ జితేంద్రియుడా! గరుడుడా! నీ మనస్సును స్వాధీనపరచు కొనుము. నీ హృదయమున వైరాగ్యము దృఢముగ నుండిన సాత్త్విక బుద్ధి ప్రకాశించును. విషయరూపములతోగూడిన ఆశలు నశించును.

చౌ॥ బిమల జ్ఞాన జల జబసోఁ నహాఈ ।
తబ రహ రామ భగతి ఉర ఛాఈ ॥
సివ అజ సుక సనకాదిక నారద ।
జే ముని బ్రహ్మ బిచార బిసారద ॥ 6

తా॥ సర్వరోగములు వదలించుకొనిన మానవుడు నిర్మలమగు జ్ఞానరూపమనెడు నీటిలో స్నానము జేసినప్పుడు మాత్రమే రామభక్తి హృదయము నిండుగ ఆవరించును. శివుడు, బ్రహ్మ, శ్రీశుకుడు, సనకాది సప్తర్షులు, నారదుడును బ్రహ్మవిచార తత్త్వమందు పరమనిపుణులై యున్నారు.

చౌ॥ సబ కరమత ఖగనాయక ఏహా ।
కరిఅ రామ పద పంకజ నేహా ॥

శృతి పురాన సబ గ్రంథ కహాహీం ।
రఘుపతి భగతి బినా సుఖనాహీం ॥

తా॥ పక్షిరాజా ! శ్రీరామచంద్రులవారి దివ్యచరణములందు భక్తి గలిగియుండుటయే సర్వులమతము. శ్రీరామచంద్రుని చరణములందు భక్తిలేనిదే సుఖము లేదని వేదములు, పురాణములు, సద్గ్రంథములు పలుకుచున్నవి.

చౌ॥ కమఠపీఠ జామహీం బరు బారా ।
బంధ్యా సుత బరు కాహుహిం మారా ॥
ఫూలహీం నభ బరు బహుబిధి ఫూలా ।
జీవన లహా సుఖ హరి ప్రతికూలా ॥ 8

తా॥ తాబేటివీపుపైన రోమములున్ననూ, వితంతువు కుమారుడు ఎవరినైననూ హత్యజేసిననూ, ఆకాశమున వివిధరకములగు పుష్పములు పుష్పించిననూ, శ్రీరామ విముఖులగు జీవులకు సుఖము లభింపదు

చౌ॥ తృషా జాఇ బరు మృగజల పానా ।
బరు జామహీం సస సీస బిషానా ॥
అంధకారు బరు రవిహి నసావై ।
రామ బిముఖ నజీవ సుఖపావై ॥ 9

తా॥ ఎండమావులలోని నీరు త్రావినయెడల దప్పిక నశించినమా నశింపవచ్చు. కుందేటితలపై కొమ్ము పుట్టవచ్చుగాక, చీకట్లు సూర్యుని బాధించుగాక ! శ్రీరామచంద్రుని విముఖులకు సుఖశాంతులుండవు.

చౌ॥ హిమ తే అనల ప్రగట బరు హోఈ ।
బిముఖ రాము సుఖ పావన కోఈ ॥ 10

తా॥ మంచులోనుండి అగ్ని పుట్టవచ్చునుగాక (ఉపయోగరహితము లైన పలుకులు పలుకుట) శ్రీరామ విముఖులకు సుఖము శాంతి గలుగ నేరదు,

దో॥ బారి మథే ఘృతహోఇ బరుసికతా తే బరు తేల ।
బినుహరి భజన న భవ తరిఅ సిద్ధాంత అపెల ॥ 122

తా॥ నీటిని మథించిన వెన్న వచ్చుగాక! ఇసుకనుండి తైలము వచ్చిన వచ్చుగాక। శ్రీరామచంద్రుని కీర్తింపనియెడల సంసారరూప సముద్రమునుండి తరింపలేరు. ఇదే దృఢమగునట్టి సిద్ధాంతము,

దో॥ మసకహి కరఇ బిరంచి ప్రభు అజహిమసక తే హీన ।
అసబిచారి తజి సంసయ రామహి భజహి ప్రబీన ॥ 122

తా॥ శ్రీరామచంద్రుడు దోమను బ్రహ్మగా జేయగలడు అట్టి బ్రహ్మనే దోమకంటె నీచునిగ జేయునని దెలిసికొని, నేర్పరుడు చతురుడగు పురుషుడు సందేహముల వొదలి శ్రీరామచంద్రుని భజింపవలెను.

శ్లో॥ వినిశ్చితం వదామి తేవ అన్యథా బచాంసిమే ।
హరిం నరా భజంతియేఽతి దుస్తరం తరంతి తే ॥ 122

తా॥ నా నిశ్చితమగు సిద్ధాంతమును జెప్పుచున్నాను శ్రీరామచంద్రుని భజించిన మానవులు దుస్తరమైన సంసారసముద్రమునుండి సులభముగ దాటెదరు. సత్యములగు నా పలుకులు నమ్ముడు

చౌ॥ కహేఉఁ నాథ హరిచరిత అనూపా ।
వ్యాస సమాన స్వమతి అనురూపా ॥
శృతి సిద్ధాంత ఇహఇ ఉరగారీ ।
రాము భజిఅ సబ కాజ బిసారీ ॥ 1

తా॥ ఓ నాథా ! శ్రీరామచంద్రుని దివ్యమగు కథల విస్తారముగ, సంక్షేపముగ చెప్పితిని. సర్పాంతకా! గరుడుడా ! సర్వవిధములగు కార్యముల నొదలి శ్రీరామచంద్రుని భజించుమని, శ్రుతులు, పురాణములు చెప్పుచున్నవి.

చౌ॥ ప్రభు రఘుపతి తజి సోఇ అకాహీ ।
మోహి సే సఠ పర మమతా జాహీ ॥
తుమ్హ విజ్ఞానరూప నహి మోహా ।
నాథ కీన్హి మోపర అతి చోహా ॥ 2

తా॥ శ్రీరామచంద్రు నొదలి ఎవరిని భజింతువు. ఏ మూర్ఖునితో స్నేహము చేసెదవు. ఓ నాథా ! నీవు విజ్ఞాన స్వరూపుడవు. మోహము లేనివాడవు. నీకు నాయందు దయ గలదు.

చౌ॥ పుంఛిహు రామకథా అతిపావని ।
సుక సనకాది సంభు మన భావని ॥
సత సంగతి దుర్లభ సంసారా ।
నిమిష దండ భరి ఏకఉ బారా ॥ 3

తా॥ శ్రీశుకదేవునకు, సనకాది సప్తర్షులకు, పరమశివుని మనస్సునకు ఆహ్లాదమును, సంతోషమును గలిగించు, పవిత్రము, దివ్యమునైన

శ్రీరామ కథను నాకు దెలియజెప్పితివి. ఈ ప్రపంచమందే కొద్దికాలము పాటు గూడ సత్సంగము లభింపదు.

చౌ॥ దేఖు గరుడ నిజహ్బాదయఁ బిచారీ ।
మై రఘుబీర భజన అధికారీ ॥
సకు నాధమ సబ భాంతి అపావన ।
ప్రభు మోహి కీన్హ బిదిత జగపావన ॥ 4

తా॥ ఓ గరుడుడా ! నీవు బాగుగ హృదయమున దాలోచింపుము నేనెవడను? శ్రీరామచంద్రుని భజించుటకు అధికారినై యున్నాను; పక్షి జాతులలో నీచజాతివాడను. సర్వవిధముల అపవిత్రుండను. అయినప్పటి కిన్ని శ్రీరామచంద్రమహారాజు నన్ను పరమపవిత్రునిగ జగత్ప్రసిద్ధము జేసినాడు.

దో॥ ఆజు ధన్యమై ధన్య అతిజద్యపి బ సబ బిధి హీన ।
నిజ జన జాని రామ మోహి సంత సమాగమ దీన్హ ॥

తా॥ యెట్లైననేమి, నేను సర్వవిధముల హీనుడను. నీచజాతిలోని వాడనైనను నేను ధన్యుడనై యుంటిని శ్రీరామచంద్రమహారాజు నన్ను నిజదాసునిగ భావించి మహాత్ముడవగు నీతో సంభాషణలు సలిపించినాడు

దో॥ నాథ జథామతి భాషేఉఁ రాఖేఉఁ నాహిఁకఛు గోఇ ।
చరితసింధు రఘునాయక థాహ కిపావఇ కోఇ ॥ 123

తా॥ ప్రభూ : నేను నా బుద్ధి ననుసరించి చెప్పితిని. నా హృదయమునందే మాత్రము దాచుకొనలేదు. శ్రీరఘురాముని చరిత్రలు సముద్రముతో సమానము వాని లోతును దెలిసికొనగలమా? ఏమి? (శ్రీరామ తత్వము తెలిసికొనుటకు మానవుని ఆయువు చాలదు.)

చౌ॥ సుమిరి రామ కేగున గన నానా ।
పుని పుని హరష భుసుండి సుజానా ॥
మహిమా నిగను నేతి కరిగాఈ ।
అతులిత బల ప్రతాప ప్రభుతాఈ ॥

తా॥ శ్రీరామచంద్రుని దివ్య గుణసమూహముల మాటి-మాటికి స్మరించుకొని శ్రీకాకభుశుండి మహర్షి ఆనందపడెను. భగవానుని మహిమలు వర్ణింపజాలక వేదములు గూడ నేతీతివాక్యములు పలికెను. ఆతని బల, ప్రతాపములు, గొప్పదనము వర్ణనాతీతము.

చౌ॥ సివ అజపూజ్య చరన రఘురాఈ ।
మోపర కృపా పరమ మృదుల లాఈ ॥
అస సుభాఉ కహుఁ సునఉఁ న దేఖఉఁ ।
కహి ఖగెస రఘుపతి సమ లేఖఉఁ ॥ 2

తా॥ శ్రీరామచంద్రులవారి దివ్యచరణముల బ్రహ్మయు, పరమశివుడును ఎల్లప్పుడు సేవింతురు. వారికి నీయందు మిక్కిలి ప్రేమగలదు. నాయందు వారికిగల ప్రేమనుగూర్చి చెప్పలేను. వినలేను చూడలేను. ఓ పక్షిరాజా! గరుడుడా! శ్రీరామచంద్రునితో సమానముగ ఎవరినిగూర్చి దెలిసికొనగలను?

చౌ॥ సాధక సిద్ధ బిముక్త ఉదాసీ ।
కవి కోవిద కృతగ్య సన్యాసీ ॥
జోగీ సూర సుతాపస గ్యానీ ।
ధర్మ నిరత పండిత బిగ్యానీ ॥ 3

చౌ॥ ధన్య దేశ సో జహఁ సురసరీ ।
ధన్య నారి పతివ్రత అనుసరీ ॥
ధన్య సో భూపునీతి జోకరఈ ।
ధన్య సో ద్విజ నిజ ధర్మన టరఈ ॥ 3

తా॥ గంగానదినిగల్గిన దేశమే ధనవంతమైనది. ఏస్త్రీ పాతివ్రత్య ధర్మములనాచరించునో అట్టిస్త్రీ అదృష్టవంతురాలై యుండును. ఏరాజ్య ములో న్యాయముండునో ఆదేశమే ధనవంతమైనది. ఏబ్రాహ్మణుడు తన ధర్మమును గాపాడుకొనునో అట్టివాడే ధన్యుడని చెప్పబడెను.

చౌ॥ సో ధనధాన్య ప్రథమగతి జాకీ ।
ధన్య పున్యరత మతిసోఇ పాకీ ॥
ధన్య ఘరీ సోఇ జబ సతసంగా ।
ధన్య జన్మ ద్విజ భగతి అభంగా ॥

తా॥ దాన ధర్మాదికార్యములకు ఏ ధనమునుపయోగపడునో అట్టి ధనమే ధన్యమైనది. పుణ్యకార్యములందెవరి బుద్ధి రాణించునో ఆతని బుద్ధి పరిపక్వతనొందినదై యుండును. సత్సంగమందు గడిపినకాలమే ధన్య వంతమైనది. అట్టివారి జన్మలే ధన్యవంతములై యుండును. బ్రాహ్మణు అందు అఖండమగుభక్తి ఎవరు గలిగియుందురో వారే అదృష్టజాతకులు. అఖండభక్తులుగనుందురు (ధనమునకు మూడుగతులు గలవు) దాన, భోగ, నాశనగతులుగలవు దానము గొప్పదై యుండును. భోగము మధ్య మము. నాశనము జేయుట నీచకార్యము. నీచగతి. ధనమును దానధర్మ ములకు వినియోగించకుండినను, అనుభవించకుండినను, వానిధనము నాశనరూపము జెందును.

తా॥ శ్రీకాకభుశుండి మహర్షులవారి దివ్యములగు మాటలువిని, శ్రీరామచంద్రుని చరణములందాతనికి గల ప్రేమనుజూచి, సందేహము లన్నియు నశింప గరుడుడు ప్రేమతో ఇట్లు పలుకసాగెను.

చౌ॥ మైకృత కృత్య భయఉఁ తబ బానీ
సుని రఘు బీర భ గతి రస సానీ ॥
రామ చరన నూతన రతి భఈ ।
మాయా జనిత బి పతి సబ గఈ ॥

తా॥ శ్రీరామచంద్రుని దివ్య భక్తిరసములో మునిగితిని. నేను నీదివ్యమగు పలుకులువిని కృతకృత్యుడనయితిని. శ్రీరాముని దివ్యచరణము లందు నాకు నూతనమగుభక్తి గలుగుచున్నది. మాయచే వ్యాపింపబడిన ఆపదలు తొలగినవి. సంతోషముగ నుంటిని.

చౌ॥ మోహా జలధి బోహిత తుమ్హ భఏ ।
మో కహఁ నాథ బిబిధ సుఖ దఏ ।
మో పహిఁ హోఇ న ప్రతి ఉపకారా ।
బంద ఉఁ తవ బద బారహిఁ బారా ॥ 2

తా॥ నేను మోహరూపమనెడు సముద్రమున మునిగితిని. పడవవలె నీవు నన్ను ఆసముద్రమునుండి రక్షించితివి. ఓనాధా! పరమసుఖవంతునిగ జేసితివి. నేను నీకేమి ప్రత్యుపకారము జేయలేకుంటిని. మాటిమాటికి నీ చరణములకు నమస్కారము జేయుచున్నాను.

చౌ॥ పూరన కామ రామ అనురాగీ ।
తుమ్హ సమ తాతన కోఉ బడ భాగీ ॥

సంత బిటప సరితా గిరి ధరనీ ।
పరహిత హేతు సబన్హికై కరనీ ॥ 3

తా॥ నీవు పూర్ణకాముడవు. శ్రీరాముని ప్రేమించువాడవు స్వామీ ! నీతో సమానుడగు అదృష్టవంతుడు లేడు. మహాత్ములు, వృక్షములు, నదులు, పర్వతములు, భూమి మొదలుగా గలవన్నియు యితరులకు ఉపకారములే జేయుచున్నవి.

చౌ॥ సంత హృదయ నవనీత సమానా ।
కహా కబిన్హ పరి కహై న జానా ॥
నిజ పరితాప ద్రవఇ నవనీతా ।
పర దుఃఖ ద్రవహిం సంత సు పునీతా ॥ 4

తా॥ సాధుమహాత్ముల హృదయములు నవనీతముతో సమానమని కవీశ్వరులు జెప్పిరి, వారుఅసలు తెలిసికొనలేకుండిరి. వెన్న వేడివలన కరిగిపోవును. పరమపవిత్రులైన సాధుమహాత్ములు పరులకు కలుగు దుఃఖ బాధలజూచి సహింపలేరు.

చౌ॥ జీవన జన్మ సుఫల మమ భయఉ ।
తవ ప్రసాద సంసయ సబ గయఉ ॥
జానేహు సదా మోహి నిజ కింకర ।
పుని పుని ఉమా కహఇ బిహంగవర ॥ 5

తా॥ నాజీవితము సఫలమైనది. నీయొక్క దివ్యానుగ్రహమువలన సర్వసందేహములు నశించినవి. నన్ను నీదాసునిగ దెలిసికొనుము. (శివుడు చెప్పుచున్నాడు) ఓ ఉమా ! పక్షులలో సర్వశ్రేష్ఠుడగు గరుడుడు మాటి మాటికి అట్లు పలుకసాగెను.

దో॥ తాసు చరన సిరు నా ఇ కరి ప్రేమ సహిత మతిధీర ।
గయఉ గరుడ వైకుంఠ తబ హృదయఁ రాఖి రఘుబీర॥

తా॥ శ్రీకాకభుశుండి మహర్షులపాద చరణములకు నమస్కరించి, హృదయ గృహమందు శ్రీరామచంద్రుని ధరించి ధీరుడు, బుద్ధిమంతుడు నగు గరుడుడు వైకుంఠమున కేగెను.

దో॥ గిరిజా సంతసమాగమ సమ న లాభకఛు ఆన ।
బిను హరికృపా నహోఇ సో గావహిఁ వేద పురాన ।

తా॥ ఓపార్వతీ ! సాధుమహాత్ముల కలయకతో సమానమగు సమావేశములేదు. సాధుమహాత్ముల సమాగమము భగవానుని అనుగ్రహము లేనిదే గలుగదని వేదములు పురాణములు జెప్పుచున్నవి.

చౌ॥ కహేఉఁ పరమ పునీత ఇతిహాసా ।
సునత శ్రవన ఛూటహిఁ భవ పాసా ॥
ప్రనత కల్పతరు కరునా పుంజా ।
ఉపజఇ ప్రీతి రామ పద కంజా ॥ 1

తా॥ నేనీ పరమపవిత్రమైన ఇతిహాసమునుగూర్చి చెప్పితిని. దీనిని విన్నవారు సంసారబంధములనుండి రక్షింపబడెదరు ! శరణాగతులకు కల్పవృక్షముతో సమానుడును, దయాసముద్రుండగు శ్రీరామచంద్రుని దివ్యచరణములందు ప్రేమకలుగును.

చౌ॥ మన క్రమ బచన జనిత అఘజాఈ ।
సునహిఁ జే కథా శ్రవన మనలాఈ ॥

తీర్థాటన సాధన సముదాఈ ।
జోగ బిరాగ గ్యాన నిపునాఈ ॥ 2

తా॥ ఈ దివ్యమగు శ్రీరామకథను శ్రద్ధగా వినువారలకు మనో వాక్కాయకర్మలద్వారా చేసిన పాపములు నశించును. తీర్థయాత్రలు మొదలుగాగల గొప్ప సాధనలు, యోగము, వైరాగ్యము, జ్ఞానమునందు నైపుణ్యము గలిగియుండుట.

చౌ॥ నానా కర్మ ధర్మ వ్రత దానా ।
సంజమ, దమ, జప, తప, మఖనానా ॥
భూత దయా ద్విజ గుర సేవకాఈ ।
బిద్యా బినయ బిబేక బడాఈ ॥

తా॥ వివిధ విధములగు కర్మలు, ధర్మములు, దానములున్నూ, యమ, నియమసాధనములున్నూ, జప యజ్ఞాదులును, సర్వజీవులయందు దయగలిగి యుండుటయును, బ్రాహ్మణుల, గురువుల సేవించుటయును, విద్యా వినయములతో అరితేరి యుండుటయును.

చౌ॥ జహఁ లగి సాధన బేద బఖానీ ।
సబ కరఫల హరి భగతి భవానీ ॥
సో రఘునాథ భగతి శ్రుతి గాఈ ।
రామ కృపా కాహూఁ ఏక పాఈ ॥ 4

తా॥ ఓ భవానీ! శ్రీరామచంద్రుని యందు ప్రగాఢమగు భక్తినిగల్గి యుండుమని వేదములలో చెప్పబడెను శ్రుతులు, పురాణేతిహాసములు, శ్రీరాముని భక్తిని గూర్చియే చెప్పబడెను. ఆభక్తి ప్రభావమువలన విరాగులయ్యెదరు.

దో॥ ముని దుర్లభ హరి భగతి నర పావహిం బినహిం ప్రయాస
జేయహ కథా నిరంతర సునహిం మాని బి స్వాస ॥

తా॥ ఏమానవుడు నిరంతరము భక్తిశ్రద్ధలతో శ్రీరామకథను వినునో, అట్టివాడు కష్టపడకయే మునిశ్రేష్ఠులకుగూడ దుర్లభమైన హరి భక్తిని పొందును

చౌ॥ సోఇ సర్వగ్య గునీ సో ఇగ్యాతా ।
సోఇ మహీ మండిత పండిత దాతా ।
ధర్మ పరాయన సోఇ కులత్రాతా ।
రామ చరన జాకర మన రాతా ॥

తా॥ ఎవరిమనస్సు శ్రీరామచంద్రుని దివ్యచరణములందు లగ్నమై యుండునో నాతడే సర్వము దెలిసినవాడును గుణవంతుడును జ్ఞానియునై యుండును. ఆతడే భూమాతకు నిజమగుపుత్రుడు, అలంకారుడు, పండితుడు, దాతయు, ధర్మరక్షకుడు, వంశోద్ధారకుడునై రాజించును.

చౌ॥ నీతి నిపున సోఇ పరమ సయానా ।
శ్రుతి సిద్ధాంత నీక తేహింజానా ॥
సోఇ కవి కోవిద సోఇరన ధీరా ।
జో ఛల ఛాఢి భజఇ రఘుబీరా ॥

తా॥ కపటమును, దంభమునొదలి శ్రీరామచంద్రుని భజించువారే నీతికోవిదులును బుద్ధిమంతులునై యుందురు వారికి వేదములలోగల సిద్ధాంతములు బాగుగ దెలియును. అట్టివారే కవులు, కోవిదులు, రణధీరులునై యుందురు.

చౌ॥ ధన్య దేస సో జహఀ సురసరీ ।
ధన్య నారి పతివ్రత అనుసరీ ॥
ధన్య సో భూపు నీతి జో కరఈ ।
ధన్య సో ద్విజ నిజ ధర్మ న టరఈ ॥ 3

తా॥ గంగానదినిగల్గిన దేశమే ధనవంతమైనది. ఏస్త్రీ పాతివ్రత్య ధర్మములనాచరించునో అట్టిస్త్రీ అదృష్టవంతురాలై యుండును. ఏరాజ్యములో న్యాయముండునో అదేశమే ధనవంతమైనది. ఏబ్రాహ్మణుడు తన ధర్మమును గాపాడుకొనునో అట్టివాడే ధన్యుడని చెప్పబడెను.

చౌ॥ సో ధన ధన్య ప్రథమ గతి జాకీ ।
ధన్య పున్యరత మతి సోఇ పాకీ ॥
ధన్య ఘరీ సోఇ జబ సతసంగా ।
ధన్య జన్మ ద్విజ భగతి అభంగా ॥

తా॥ దాన ధర్మాదికార్యములకు ఏ ధనమునుపయోగపడునో అట్టి ధనమే ధన్యమైనది పుణ్యకార్యములందెవరి బుద్ధి రాణించునో ఆతని బుద్ధి పరిపక్వతనొందినదై యుండును. సత్సంగమందు గడిపినకాలమే ధన్యవంతమైనది. అట్టివారి జన్మలే ధన్యవంతములై యుండును. బ్రాహ్మణు లందు అఖండమగుభక్తి ఎవరు గలిగియుందురో వారే అదృష్టజాతకులు, అఖండభక్తులగనుందురు (ధనమునకు మూడుగతులు గలవు) దాన, భోగ, నాశనగతులుగలవు దానము గొప్పదై యుండును. భోగము మధ్యమము. నాశనము జేయుట నీచకార్యము. నీచగతి. ధనమును దానధర్మములకు వినియోగించకుండిననూ, అనుభవించకుండిననూ, వానిధనము నాశనరూపము జెందును.

దో॥ సోకుల ధన్య ఉమా సునుజగ తపూజ్య సుపునీత ।
శ్రీరఘుబీర పరాయన జేహిఁ నర ఉపజ బినీత ॥ 12

తా॥ ఓ ఉమా! దయతోవినుము. ఏకులమందు శ్రీరఘురాముని భక్తులు జన్మింతురో ఆకులమే ధన్యవంతమైనది పదునాలుగు భువనములలో పూజింపబడుదురు. పరమపవిత్రులుగ నెంచబడుదురు.

చౌ॥ మతి అనురూప కథా మైఁ భాషీ ।
జద్యపి ప్రథమ గుప్తకరి రాఖీ ॥
తవమన ప్రీతి దేఖి అధికాఈ ।
తబమైఁ రఘుపతి కథా సునాఈ ॥ 1

తా॥ నేను నాబుద్ధి ననుసరించి ఈ దివ్యమగు శ్రీరామకథను కీర్తించితిని. మొదట నేను గుప్తముగ దాచియుంచితిని. భక్తియనిన అధికమగు ప్రేమను గలిగియుందువు.

చౌ॥ యహ న కహిఅ సఠహీ హఠ సీలహీ ।
జోమన లాఇ న సున హరి లీలహీ ।
కహిఅ న లోభహీ క్రోధహీ కామిహీ ।
జోన భజఇ సచరాచర స్వామిహీ ॥ 2

తా॥ ఈ కథయందనురక్తిలేని మూర్ఖునకును, ధూర్తునకును, లోభికిని, క్రోధికిని, కామునకును, శ్రీరామచంద్రుని భజింపనివారికిని ఈ దివ్యకథను చెప్పరాదు.

చౌ॥ ద్విజ ద్రోహిహి న సునాఇ అగబహూఁ ।
సురపతి సరిస హోఇ నృప జబహూఁ ॥

రామ కథా కే తేఇ అధికారీ ।
జిన్హ కే సత సంగతి అతి ప్యారీ ॥ 3

తా॥ ఇంద్రునితో సమానమైన భాగ్యవంతుడయినను రాజయి నప్పటికిని బ్రాహ్మణ ద్రోహికి ఈ కథ ఎప్పుడునూ వినిపింపరాదు. సత్సంగ అభిలాషులును, శ్రీరాముని దివ్యచరణములందు ప్రేమగలవారును ఈ కథను వినుట కధికారులు.

చౌ॥ గురు పద ప్రీతి నీతి రత జేఈ ।
ద్విజసేవక అధికారీ తేఈ ॥
తా కహఁ యహ విశేష సుఖదాఈ ।
జో హి ప్రాన ప్రియ శ్రీరఘురాఈ ॥ 4

తా॥ శ్రీగురుదేవుల దివ్యచరణములందు ప్రేమాసక్తులుగల వారున్నూ, నీతిపరాయణులున్నూ బ్రాహ్మణభక్తులున్నూ ఈ దివ్యకథను వినుట కధికారులు. వారికే ఈ కథ దివ్యాతిదివ్యములగు సుఖముల నిచ్చును. శ్రీరామచంద్రు డట్టివారినే ప్రాణసముడుగ భావించును.

దో॥ రామ చరనరతి జో చహ అథవా పద నిర్బాన ।
భావసహిత సో యహ కథా కరఉ శ్రవన పుటపాన ॥

తా॥ శ్రీరామచంద్రుని దివ్యచరణములందు ప్రేమ కోరుకొను వారునూ, మోక్షసామ్రాజ్యము గావలసినవారును, శ్రీరామకథామృతము ప్రేమతో తన చెవులనెడు దొప్పలతో పానము జేయవలెను.

చౌ॥ రామకథా గిరిజా మైఁ బరనీ ।
కలిమల సమని మనోమల హరనీ ॥

సంసృ్కృతి రోగ సజీవని మూరీ।
రామకథా గావహిం శ్రుతిరూరీ॥

తా॥ ఓ పార్వతీ! కలియుగ పాపముల భస్మముజేయు మనోమల మును హరించు దివ్యమగు శ్రీరామకథను వర్ణించితిని జన్మ-మరణరూప మనెడు రోగమును నాశనము జేయుటకు శ్రీరామునికథ సంజీవనివంటిది యని వేదములు, పురాణములు, విద్యావంతులు చెప్పుచున్నారు.

చౌ॥ ఏహి మహఁ రుచిర స ప్తసోపానా।
రఘుపతి భగతి కేర పంథానా॥
అతి హరికృపా జాహి పరహోఈ।
పాఉఁ దేఇ ఏహిఁ మారగసోఈ॥ 2

తా॥ శ్రీరఘురామునియందు భక్తి గలుగుటకు ఏడు సోపానములు గలవు. ఎవరేమార్గమున ప్రయాణించినను శ్రీరామునియందు భక్తిని పొందుదురు.

చౌ॥ మన కామనాసిద్ధి నరపావా।
జే యహ కథాకపట తజిగావా॥
కహహిఁ సునహిఁ అనుమోదన కరహీఁ।
తే గోపద ఇవ భవనిధి తరహీఁ॥ 3

తా॥ కపటమునొదలి ఈ పవిత్రమగు కథను వినువారికి కోర్కెలు నెరవేరును సిద్ధిని పొందెదరు ఈకథను చెప్పువారు, వినువారు సంసార రూపమనెడు సముద్రమును గోష్పాదమువలె దాటుదురు ప్రశంసింప బడెదరు.

